# కథా వీథి

# कथा वीथी

कथा वीथी

సంకలనం :

శ్రీ దుర్గానంద

ప్రకాశకులు :

దక్షిణ భారత హిందీ ప్రచార సభ ... , ...

హైదరాబాద్ :: హైదరాబాదు ... దీయబడిన ...

# మనవి

కథావీథి మా సర్వోదయ గ్రంథ మాల ప్రచురణ లోని 17 వ పుష్పము. తెలుగులోని ప్రసిద్ధ రచయితల కథలను సేకరించి ప్రచురించుటలో మా ఉద్దేశ్యము హిందీ భాషా ప్రచారముతో పాటు మాతృభాష యందు మాకున్న భక్తి శ్రద్ధలను వెల్లడించుటయే. మా కథా సాహిత్య ప్రచురణము పలువురు పాఠకుల, విద్యార్థుల మన్నన లందుకొని మాకు సమధికోత్సాహము చేకూర్చినందువలన మే మీ సంకలనములో ఇంక కొంచెము చొరవ, జాగరూకతతో ముందుకు నడచుట కవకాశము కలిగినది. ప్రసిద్ధ రచయితలు అడిగిన దే తడవుగా తమ కథల నొసంగి మా కార్యమునకు చేయూత నిచ్చుట మా యదృష్టము. వారికి నేము హృదయ పూర్వక ధన్యవాదము లర్పించుచున్నాము.

కథావీథిలో రచయితల పరిచయములతో పాటు ఆ యా కథల విశేషములుకూడ ఉల్లేఖింపబడినవి. శీఘ్రాతి శీఘ్రముగా క్రొంగ్రొత్త పుంతలు త్రొక్కుచు రోజురోజు వింతనడలు పోవుచున్న తెలుగు కథల స్వరూప స్వభావములను ఒక్కపట్టున నిర్ణయించి సమీక్షించుట నిజమునకు కష్టమైన పని. అయినప్పటికిని మాకు తోచిన విధమున మా హిందీ కథాసాహిత్య ప్రచురణ సంప్రదాయము ననుసరించి అట్లు చేయుట ఉచితముగా భావింపబడినది.

ఈ కథలు ముఖ్యముగా విషయము, భావ, శిల్పములను దృష్టియం దుంచుకొని ఎన్నిక చేయబడిన సముదాయ

సర్వసాధారణముగా వివిధ వస్తు స్పృశ్యములుగా అమర్చబడి యుండుటవలన సహృదయ పాఠకులకు కుతూహలము కలిగించుటలో నేమియు కొరంత రాలేదని మాత్రము నిశ్చయముగా చెప్పగలము. కథల శ్రేణిని నిర్ణయించునప్పుడు కథ ఆకృతిని బట్టి కాక కథ ప్రకృతినిబట్టి నిర్ణయించుట జరిగినది.

ఈ సంకలనములోకూడ కొందరు ప్రసిద్ధ రచయితలను చేర్చలేకపోవుట యన్నది తప్పలేదు. సాహిత్య మహోన్నతములో సంకలన మన్నది బిందుప్రాయమైనదియే గదా! ఇందుకు మేము విచారపడుటలేదుగాని కొన్ని కథలను మాకై మేము కోరితెచ్చుకొనికూడ ప్రచురింపలేకపోతిమి. ఇది అత్యంత ఖేదజనకము. ఏమైనను ఈ చిరుపాత్రము మా శక్తికి తగినదే కాని మా శక్తికి తగినది కాదనిచెప్పుట మాకు తగిన మాట. ఇంకొక్క విషయము.

మా కేంద్ర సభవారు ఈ సంకలనమును తమ విశారద పరీక్షకు పాఠ్యగ్రంథముగా నిర్ణయించి మా ప్రయత్నమునకు మిక్కిలి ప్రోత్సాహ మొసంగినారు. తదితర సంస్థలు, గ్రంథాలయములు, పాఠకులు కూడ నిట్లే దీనికి యథోచిత రీతిని దోహద మొసంగిన మా కృషి ఫలప్రదమై మేము ఇక నింత ఉత్సాహముతో ముందుకు పోవుటకు మార్గ మేర్పడగలదనియు, అట్టి చేయూత మాకు లభించగలదనియు గాఢముగా విశ్వసించుచున్నాము.

ఇట్లు

చిట్టూరి లక్ష్మీనారాయణశర్మ

కార్యదర్శి

దక్షిణ భారత హిందీ ప్రచారసభ—ఆంధ్ర.

హైదరాబాద్
..12-1960

# నా నుడి

'గద్యం కవీనాం నికషం వదంతి' ఈ నుడి వెనుకటి గద్యంలో వ్యాప్తికి, ఇప్పటి గద్యంలో ప్రతిభకు పర్యాయపదం. తెలుగు కథా సాహిత్యం ప్రజల సాహిత్యం. సంస్థల సాహిత్యం కాదు. తెలుగు కథలకు పాఠ్యగౌరవం అబ్బింది చాలాతక్కువ. అందువల్ల ఈ కథలు సంస్థల కృత్రిమత్వాలకు లోనుగాక సూటిగా ప్రజాజీవితాలను ప్రతిబింబించినాయి. ఇది ఒకందుకు మంచిదేకాని, సాహిత్యం పూర్తిగా సంస్థలకు దూరమైపోవడం అంతశ్రేయస్కరం కాదు. సంస్థలకొరకు వ్రాయక ప్రజలకొరకు వ్రాసిన రచనలు కేవలం పాఠకుల సుఖపఠనానికి ఉద్దిష్టమై చదువబడి విస్మరింపబడుతాయి. సాహిత్యమనేది ప్రజలు చదువుకున్న తరువాత విస్మరింపబడిపోకూడదు. దీనిని ఎంతో జాగ్రత్తగా ప్రజేతర సంస్థలు భద్రపరచుకోగలగాలి. అలా భద్రపరుచుకునే బాధ్యత కొంత సంస్థలమీద కొంత రచయితలమీద ఉంది. రచయితలు, సంస్థలు వేరువేరు కేంద్రాలనుండి వేరువేరు గమ్యాలకు ప్రయాణంచేసే సాహిత్యాలను సృష్టించడంవల్ల పాఠకులని, విద్యార్థులని, రెండు ముఠాలుగా విడగొట్టబడ్డారు ప్రజలు. పాఠకులకు శిష్టసాహిత్యం అందింపబడుతుంది. విద్యార్థులకు విశిష్టసాహిత్యం అందింపబడుతుంది. విద్యార్థుల సాహిత్యంలో వర్తమానకాలం లేదు. పాఠకుల సాహిత్యంలో భూతకాలం లేదు. ఇది ఒక పెద్ద అఘాతం. దీనివల్ల రచనల్లో ఏకోన్ముఖమైన స్థాయి రావు. అసలు సాహిత్యంలో శిష్ట - విశిష్టమనే భేదం ఎక్కడుంది? వర్తమానం భూత

మనే నిర్దేశమేమిటి? అది చదివేసి ప్రజలూ, ఇది చదివేది విద్యార్థులూ! విద్యార్థులేమిటి? ప్రజలేమిటి? రెండూ ఒకటి! పఠనంలో ప్రజలు విద్యార్థులు కావాలి, విద్యార్థులు ప్రజలు కావాలి.

తెలుగుకథల్లో తెలుగు కుటుంబం కనిపిస్తుంది. తెలుగు సంప్రదాయం వదలేకగాక ఇంకొంచెం పెరిగిన రచయితలో పాశ్చాత్యసంస్కృతి అతిక్రమించినట్లు వచ్చిపడే తెలుగుఇంటిలో ఇంగ్లీషు పాత్రలు మాట్లాడుకుంటున్నాయా అనిపిస్తుంది. తెలుగులో ఇంగ్లీషు చదువు భారతీయీకరింపబడలేదు. భారతీయ విద్యలు వర్తమానజీవనపరంగా పునఃపరిశీలింపబడినది తక్కువ. కథాకల్పనదృష్టితో చూస్తే కథాసాహిత్యానికిది ఒక చారిత్రికమైన లోటు. తెలుగుదేశంలో భాషోద్యమాలు, జాతిసంస్కరణోద్యమాలు, సాహిత్యోద్యమాలు, రాజకీయోద్యమాలు పుట్టినాయి. కాని విద్యా, జ్ఞాన, సాంస్కృతికోద్యమాలు పుట్టలేదు. రవీంద్రుని ఉద్యమం వంటిది, అరవిందుని ఉద్యమం వంటిది, దయానందుని ఉద్యమం వంటిది ఒక్కటిలేదు. ఈకొరత మనజీవితంలో ఉండి మనంవ్రాసే కథలమీద కూడా తొంగిచూస్తుంది. మనం కౌటుంబికానందపు కథలు వ్రాస్తున్నాం గాని ఉత్తమ కుటుంబాలను సృష్టించలేకపోతున్నాము. మన ప్రేమకథల లోని ప్రేమసంకేతం అననుభూతమైంది, అనుకరణాత్మకమైందిగా ఉండిపోయింది. మన సంఘదూషణలో వ్యంగ్యంతప్ప నిర్మాణంలేదు. ఆఫీసు పని, నిరుద్యోగం, అతిశ్రమ, చాలీచాలని జీతం మొదలైనవన్నీ కథకుని స్వీయ నిశ్వాసలుగా కనిపించుతున్నాయేగాని ఒక మూలతత్వపు, ఒక మహాసిద్ధాంతపు వెలుగునీడల్లో అవి కదలుతున్నట్లు కదలడంలేదు. మన ముందు, మనవెనుక, మనలో, మనలోలోపల మనకు దూరంగా, మన

దగ్గరగా రకరకాలుగా మెరుస్తూ ఉన్న అనేక జీవితాలను మనం అచ్చు పోయలేకపోతున్నాం. దీనికి కారణం శిష్టవిశిష్ట సాహిత్యాలమధ్యన సమన్వయం లేకపోవడం, చదువుకు మనుగడకు మధ్య వంతెనకట్టలేక పోవడం.

కథకుని వ్యక్తిత్వం సగం కథకునిమీద తక్కినసగం పాఠకులు, భాషాసమృద్ధి, భూమిఎల్లలమీద ఆధారపడి ఉంటుంది. భూమి ఎల్లల దృష్టితో చూస్తే హిందీప్రదేశం పెద్దది. ఢిల్లీ, లక్నో, పాట్నా, నాగపూరుల మధ్యనున్న ప్రదేశమంతా హిందీప్రదేశం. ఇచ్చట వివిధ సంస్కృతులు, వివిధ జాతులు, వివిధ కాల దేశాలు ఉన్నాయి. ఈసామగ్రిని కథాగ చయిత ఎంతకాలమైనా వాడుకోవచ్చు. పైగా పైఉద్యమాలవంటి ఉద్యమాలు ఈ నేలలోపుట్టి ఇచ్చటి కథకునకు ఒక అంతర్ప్రాంతీయ జీవితాన్ని, ఒక సర్వసమాహారప్రాయమైన సభ్యతను ఇచ్చినాయి. ఈ సభ్యత అటు పాశ్చాత్య సభ్యతకుచెందిందికానీ, ఇటు ప్రాంతీయ సభ్యతకు చెందిందికానీ కాదు. ఒకరకంగా దీనిని ప్రాచీన భారతీయత మీద నుంచి వచ్చిన అర్వాచీనమైన స్ఫూర్తి లేక పరిష్కృతి అనవచ్చు. అందువల్ల ప్రాంతీయవస్తువులకంటె ఈ కథకునివస్తువు భిన్నమైందిగా ఉంటుంది. ఇప్పుడు హిందీసాహిత్యాన్ని ఉన్నతపరచే దృష్టితో, ఆదర్శవంతమైంది ప్రామాణికమైంది చేసే తలంపుతో కొన్ని బలవంతమైన దోహదక్రియలు జరుపబడుతున్నాయి. ఆభిజాత్యం, అధికారం, సంస్కృతి, సాజాత్యం, సామగ్ర్యం ఇంకా ఇలాంటి ఎన్నో మేలిరకపు గుణాల్ని ప్రవేశపెట్టడంవల్ల ఒక ప్రణాళికా సాహిత్యంవంటి సాహిత్యం నిర్మింపబడుతుంది. ఇది సాహిత్యగమనానికి వాంఛనీయమైన ఉన్నతికాదు. ఈ ఉత్తమజాతి

కృతకత్వం ఇప్పుడిప్పుడే హిందీకథల్లో తొంగిచూస్తుంది. ఇంతకీ చెప్పే దేమంటే హిందీ కథలు equipment దృష్టితో మంచివేకాని కళా కౌశలం, శిల్పం, అనుభూతిదృష్టితో ఇతర ప్రాంతీయ కథలకంటే గొప్పవి కావు. తెలుగు కథలు ఈవిషయంలో ఏప్రాంతీయ కథలకంటేను తీసిపోవు.

మనకు అత్యుత్తమ కథారచయితలు ఉన్నారు. ఈ సంకలనంలో కూడా ఉన్నారు. గోపీచంద్, కుటుంబరావు, బుచ్చిబాబు ప్రభృతులు చాలా ప్రసిద్ధిపొందిన కథకులు. వీరు వాస్తవాన్ని వాస్తవికంగా చెప్పారు. జీవితసంఘర్షణకు స్పష్టమైన అర్థం వీరిలో ఉంది. ఇంతకుముందున్న కథకుల్లో ఇంత స్పష్టమైన యుగాకృతి, జీవనస్ఫూర్తి లేదు. వారిలో కొందరు సమాజాన్ని విచ్ఛిన్నం చేశారు. కాపాడలేదు. కొందరు భావకవితనే కథారూపంలో ఇచ్చారు. కొందరు ప్రాచీనసంస్కృతిని కథల్లోకి అనువదించారు. మరికొందరు దారిద్ర్యాన్ని ఆక్రందనచేసి తరువాత ఏమి చేయాలో తోచక ఊరుకున్నారు. అంటే వారిలోని కొందరికథలు ఆనంద స్వరూపాలు. ఆనందంతో పాటు చిత్తును కలిపిన చలం కథలు చిదానంద స్వరూపాలు. ఈమువ్వురు, చిదానందంతో పాటు సత్తును కూడా కలిపారు. ఈ మువ్వురిలో కాలజ్ఞానం ఉంది. గోపీచంద్ లో కాలస్ఫురణ, కొడవటిగంటిలో కాలానుభూతి, బుచ్చిబాబులో కాలవేగం ఉంది. గోపీచంద్ శిల్పం సర్వాంగశోభి. యౌవనం అన్ని అవయవాల్లోను నిండుగా ప్రవహిస్తుంది. బుచ్చిబాబు కథ చైతన్యవతి. కొడవటిగంటి ప్రస్తరశిల్పి. ఈయన ఉక్కుఉలిముందు చట్రాళ్లుకూడా పాలరాతి బొమ్మలు అవుతాయి. ఈయన పాత్రలకు ఈయన ఎక్కడకు తీసుకు

వినుకున్నాడో తెలుసు. గోపీచంద్ తన పాత్రలలో ఒదిగి, దాగిఉంటాడు. కొడవటిగంటి ముందు నిమ్నోన్నతాలు, గోపీచంద్ ముందు సమతలాలు, బుచ్చిబాబు ముందు సైకతాలు ఉన్నాయి. గోపీచంద్ బాహ్యంలో అంతర్యం ఉంది. కొడవటిగంటి అంతర్యంలో బాహ్యంఉంది. బుచ్చిబాబు కనీనిక ఏమీ ఎక్కువలేనిచోట అగాధాన్ని చూడవచ్చు, అగాధంలో శిఖరం చూడవచ్చు. ఇది మయసభలాంటి చిదాభాస. అట్లని బుచ్చిబాబు శుద్ధ సాంస్కృతికుడు గాడు. ఆయనకు సమవేదన ఉంది. ఆయనవి కఠోర సత్యాలు కావు, సుకుమారసత్యాలు. కొడవటిగంటి ముందున్నది సిద్ధాంతం, గోపీచంద్ ముందున్నది చింతన, బుచ్చిబాబులో స్ఫురణ ఉంది. ఫలతః గోపీచంద్ శైలిలో గాంభీర్యం, కొడవటిగంటిలో ప్రసాదం, బుచ్చిబాబులో ఓజస్సు (సమాస భూయిష్ఠత్వం కాదు) ఉంది. కొడవటిగంటి ధ్వనిని నిండుగా ఇస్తాడు. గోపీచంద్ ప్రతిధ్వనిని ఇస్తాడు. కుటుంబరావు కథ తూటా, గోపీచంద్ కథ మతాబా.

గోపీచంద్ సత్యాన్వేషి, కుటుంబరావు సత్యసాధకుడు. మారే సత్యంలోఉన్న వైవిధ్యాలు గోపీచంద్‌కు కావాలి. మారనిసత్యం ప్రవహించే దిశలూ, మార్గాలూ కొడవటిగంటికి కావాలి. బుచ్చిబాబులోఉన్నవి ఖండిత సత్యాలు. ఎక్కడికక్కడే ఉద్భావం, పోషణ, లయింపు. గోపీచంద్ సత్యాన్వేషణలో నిరంతర ప్రయాణీకుడు. కొడవటిగంటి పాత్రలు మృణ్మయశరీరాలు, గోపీచంద్ పాత్రలు మానవశరీరాలు. బుచ్చిబాబు ఆకారాలు తైజసాలు. గోపీచంద్ కౌశేయం సౌందర్య సౌకుమార్య శాశ్వతాలతో చక్కగా అల్లబడి ఉంది. బుచ్చిబాబు చిత్రంలో ఇంద్రధనుసు రంగులు కనిపించుతాయి. గోపీచంద్ సమగ్రమైన కథారచయిత బుచ్చిబాబు వ్యాఖ్యాత. కుటుంబరావు విధిబద్ధుడై [illegible]కూడా ఎన్నో బలమైన ప్రయోగాలు చేశాడు. ఎంతతుచ్ఛమైన వస్తువునైనా వచనంచేసి

ముద్దగా, రసాయనంగా ఇచ్చే అపారమైన పావనశక్తి ఆయనలో ఉంది. సర్వగ్రాహి. గోపీచంద్ మననశీలి. బుచ్చిబాబు నడక కాంతిమంతమైంది. భూమిమీద నుంచొని భూమిని పరిశోధించి తత్వాన్ని తిరిగి భూమికి ఇచ్చేస్తాడు కొడవటిగంటి. గోపీచంద్ భూమ్యాకాశాల సంబంధాలను వెదుకుతాడు. ఈ అన్వేషణ అంతా బుచ్చిబాబుకు శిల్పగతమైంది. గోపీచంద్ అనుద్వేగి, కొడవటిగంటి ఉద్భాషి. బుచ్చిబాబులో ఆహ్లాదం కొడవటిగంటిలో ఆనందమూ ఉంది. కథాగమనంలో గోపీచంద్ ప్రేమచంద్‌కు దగ్గర. పాత్ర చిత్రణలో కొడవటిగంటి ప్రేమచంద్‌కు దగ్గర. బుచ్చిబాబు ప్రేమచంద్‌కు తరువాతితరంవాడు. కొడవటిగంటి, గోపీచంద్‌లు ఒకే ప్రవాహానికి రెండు పాయలు. బుచ్చిబాబు సఖ్యమధ్యలో ఈ పాయలతో కలుస్తూ పోతూంటాడు. పోతూ ఉండటమే బుచ్చిబాబు గమ్యం. కొడవటిగంటి ఇక వ్రాయకపోవచ్చు. అది ఉద్యమం. ఉద్యమం ఒకేసారివచ్చి ఒకేసారి పోతుంది. బుచ్చిబాబు వ్రాస్తూ ఉండవచ్చు. ఆయన ప్రజాస్వామికం. ప్రజాస్వామికంలో విధినిషేధాలు ఉండవు. గోపీచంద్ చూస్తూచూస్తూఉండి ఎప్పుడో ఒక తటిత్తు మెరిసినప్పుడు వ్రాయవచ్చు. అందినవస్తువు అందినట్లుగాకుండా కొంచెం రసాయనీకరణం చేసుకోవలసినపని గోపీచంద్‌కు ఉంది. అట్లని తతిమ్మా రచయితల్లో ఈ ప్రకరణ లేదనిగాదు. కుటుంబరావులో ఈ రసాయనీకరణం వృత్తిపరంగానూ బుచ్చిబాబులో వ్యక్తిపరంగానూ గోపీచంద్‌లో సంవిత్తిపరంగానూ ఉంది. ఒక మార్పును తాను స్వయంగా పులకించి మళ్లీ తేరుకొని నెమ్మదిగా తొణక్కుండా బెణక్కుండా కథయిస్తాడు గోపీచంద్. ఈ ముగ్గురు ఇలా ఒకే తత్వానికి మూడురూపులు.

ఒక్క మాట. ఇప్పటికెన్ని కథలు వ్యాసాలు, వ్యాఖ్యానాలు, శాస్త్రగ్రంథాలు, ప్రసంగాలు అచ్చవుతున్నాయి. కవిత్వం వచనంగానూ వచనం కవిత్వంగానూ రూపొందుతుంది. ఇది చెడుగాదు ఉత్కర్షం. ఇప్పటి ఈ

సాహిత్యవ్యాకోచాలన్నీ ఏ సంకోచానికి దారి తీస్తాయో మరి. పరుగ త్తటం, నిలబడటంలో సు:ఖం, నిలబడటం పరుగెత్తడంలో సుఖం. ఈ పరుగులన్నీ చివరకు 'సత్యం చెప్పడం, అది ప్రియంగా చెప్పడం' అనే రెండు మాటల్లోకే ఒదిగిపోతాయేమో. అదే నిజమైతే అప్పుడు కవులనీ, కథకులనీ వ్యాసకర్తలనీ, ఇన్ని భేదాలుండవు. రచయిత అంటే ఈ భేదప్రభేదాలులేని ఒకే ఆత్మ, ఒకే ప్రాణం, ఒకే ఒక ఆర్తి. రచన చదివి, అది ముగించి, పుస్తకం మూసివేసిన తర్వాత కూడా ఏ రచయిత ప్రాణం గింగురుమని వినిపిస్తూ ఉంటుందో అతనే ఉత్తమ రచయిత. ఆ ప్రాణం ఒక్కొక్క రచయితకు సన్నివేశంలో ఉంటుంది. ఒక్కొక్క రచయితకు పాత్రలో ఉంటుంది. మరొక రచయితకు విరోధాగంలో ఉంటుంది. కాళిదాసు ఉపమాలంకారములో తన ప్రాణాన్ని దాచుకున్నాడు. ఈ ప్రాణశక్తి ప్రొంగుకువచ్చి రచయితతో రచన చేయిస్తుంటే తిరిగి అతని రచనలో ఆశక్తి కనిపించకపోతే ఇక ప్రయోజనమేముంది? రీతి, శైలి, శిల్పంకంటే కూడా రచయితయొక్క ఈ తన వ్యక్తిత్వం ఈ అనిర్వచనీయమైన ప్రాణపదార్థంలోనే ఉంది. అదిలేని రచయితలు, క్షణికానందానికో, వినోదానికో, ఉల్లాసానికో వ్రాస్తూ ఉంటారు.

— దుర్గానంద్

# క్రమము

# శ్రీ గోపీచంద్

శ్రీ గోపీచంద్ గారు కవిరాజు త్రిపురనేని రామస్వామి చౌదరి గారి జ్యేష్ఠపుత్రులు. కృష్ణాజిల్లా అంగలూరులో జన్మించారు. తెనాలిలోనే బాల్యం, రచనాకాలం ఎక్కువగ గడిచింది. 'లా' డిగ్రీ పొందికూడా న్యాయవాద వృత్తి చేపట్టలేదు. కొంతకాలం సినిమా రంగంలో ఉండి లక్ష్మమ్మలాంటి ఉత్తమ చిత్రాలను డైరెక్టుచేశారు. కొంతకాలం ఆంధ్రప్రభుత్వ పబ్లిసిటీశాఖకు డైరక్టరుగా ఉన్నారు. ప్రస్తుతం ఆలిండియా రేడియో హైదరాబాదు కేంద్రములో గ్రామస్థుల విభాగానికి ఆర్టిస్టు ప్రొడ్యూసరుగా పనిచేస్తున్నారు. వీరి కథలు అనేక సంపుటాలుగా ప్రచురింపబడ్డాయి. మమకారం, ఆకాశజ్యోతి, ధర్మవడ్డీ, సంపెంగపువ్వు మొదలైన కథలు ఆంధ్ర కథా సాహిత్యంలో సాటిలేనివి. వీరి "అసమర్థుని జీవయాత్ర" తెలుగు పాఠకహృదయాలను అమితంగా చూరగొంది. అభ్యుదయకరమైన భావాలు, హేతుబద్ధమైనదృష్టి, నిశితమైన వ్యంగ్యం, మితమైనవాక్కు వీరి ప్రత్యేకతలు. ఇప్పుడు గోపీచంద్ గారు ఆధ్యాత్మిక గ్రంథాలు కూడా వ్రాస్తున్నారు. వీరి ఆధ్యాత్మిక చింతనకూడా ప్రయోగాన్ని సాధించి వీరి ప్రతికార్యరంగానికి పేరు ప్రతిష్ఠలు గడించి పెడుతూ ఉండడం ముదావహం.



# క్రమము

# శ్రీ గోపీచంద్

శ్రీ గోపీచంద్ గారు కవిరాజు త్రిపురనేని రామస్వామి చౌదరి గారి ద్వితీయపుత్రులు. కృష్ణాజిల్లా అంగలూరులో జన్మించారు. తెనాలిలో వీరి బాల్యం, రచనా కాలం ఎక్కువ గడిచింది. 'లా' డిగ్రీ పొందికూడా న్యాయవాద వృత్తి చేపట్టలేదు. కొంతకాలం సినిమా రంగంలో ఉండి లక్ష్మమ్మలాంటి ఉత్తమ చిత్రాలను డైరెక్టుచేశారు. కొంతకాలం ఆంధ్ర ప్రభుత్వ పబ్లిసిటీశాఖకు డైరక్టరుగా ఉన్నారు. ప్రస్తుతం ఆలిండియా రేడియో హైద్రాబాదు కేంద్రములో గ్రామస్థుల విభాగానికి ఆర్టిస్టు ప్రొడ్యూసరుగా పనిచేస్తున్నారు. వీరి కథలు అనేక సంపుటాలుగా ప్రచురింపబడ్డాయి. మమకారం, ఆత్మజ్యోతి, ధర్మవడ్డీ, సంపెంగపువ్వు మొదలైన కథలు ఆంధ్ర కథా సాహిత్యంలో సాటిలేనివి. వీరి "అసమర్థుని జీవయాత్ర" తెలుగు పాఠకహృదయాలను అమితంగా చూరగొంది. అభ్యుదయకరమైన భావాలు, హేతుబద్ధమైనదృష్టి, నిశితమైన వ్యంగ్యం, మిసిమైన వాక్కు వీరి ప్రత్యేకతలు. ఇప్పుడు గోపీచంద్ గారు ఆధ్యాత్మిక గ్రంథాలు కూడా వ్రాస్తున్నారు. వీరి ఆధ్యాత్మిక చింతనకూడా ప్రజోపయోగాన్ని సాధించి వీరి ప్రతి కార్యరంగానికీ పేరు ప్రతిష్ఠలు గడించి పెడుతూ ఉండడం ముదావహం.



# కథ

స్వప్నానికీ యథార్థానికీ మధ్య గలిగిన ఒక చిన్న సంఘర్షణను చూపెట్టిన కథ 'కార్యశూరుడు'. ఇంకా చెప్పాలంటే ప్రేమజీవితానికీ కుటుంబజీవితానికీ, స్మృతికీ వర్తమానానికీ, కవికీ మనిషికీ మధ్యజరిగిన కలకలం, అది ముగియడమూ యిందు చూస్తాము. స్వప్నం [illegible] అందంగా ఉంటుంది. అందువల్లే శిశిరకుమారబాబు అందంగా కనిపించాడు తిలకానికి. తిలకం వాస్తవిక మానవుని భార్య. ఆమె భా[illegible] సమాజంది, అసలు వాస్తవికత భర్తది. ఈ రెండూ వెంకయ్య కార్యసాధనకు విజయం చేకూర్చినాయి. స్మృతిని వర్తమానంలోకి నడిపించి దాన్ని సౌందర్యహీనంగా చేసి దాంతో లాభం పొందాడు వెంకయ్య. శిశిరకుమారబాబు కవిజీవితంమీద ఇది సవాలువంటిది. కథాశిల్పదృష్టితో మాత్రే ఇది ఒక అద్భుత ప్రయత్నం. శిశిరబాబు ముందుకువచ్చీరాలేక [illegible]నుండి తొంగిచూస్తూ చూడలేక దోబూచులాడుతున్న తిలకం గతస్మృతిలకంగాదు, తిలకం కుటుంబజీవితం. తిలకం ఎవరిపుస్తకం చదువుతున్నదీ అన్నది ఈ కథను విప్పేగొప్ప సంఘటన. ఈ కథలో నాలుగు [illegible] చాలా ప్రముఖపాత్ర వహిస్తాయి. ఇలాగే శిశిరబాబు కవిసమ్మేళనానికి వెళ్ళడం, వెంకయ్య రిక్షైను, తిలకం ఇంట్లో తిరుగుతున్న గ్లోబూ, ఫ్యాక్టరీ పొగగొట్టం వేటికవి కథకు అతికిపోతున్న సాంకేతికాలు. శిశిరబాబు ఊబలాటం, వెంకయ్యలోని తుఫాను, వెంకయ్య తుపానుకు తిలకం మనోనిబ్బరం ఒకహద్దు.

ఇది మనస్తత్వ ప్రధానమైనకథ.

# కార్యశూరుడు

శిశిరకుమారబాబు రైలు దిగాడు. అది అట్టే పెద్ద స్టేషన్ కాకపోవటంవల్ల ప్రయాణీకులు ఎక్కువమంది లేరు. సామాన్లు మోసే కూలీలు అసలే లేరు. ఒక పోర్టరుమాత్రం ఎర్రజెండా ఆకుపచ్చజెండా కలిపి చుట్టి చంకలో పెట్టుకొని అటూ ఇటూ తిరుగుతున్నాడు. ఆ రైలుమార్గమంతా తన జండాల ప్రభావం వల్లే నడుస్తూవుందని అతని అహంకారం.

అతాన్ని పిలిచి శిశిర కుమారబాబు అడిగాడు – "వెంకయ్యగారిల్లెక్కడ?"

"ఏ వెంకయ్య? ఇక్కడ వెంకయ్యలు కొల్లలు కొల్లలున్నారు!" అన్నాడు పోర్టరు.

శిశిర కుమారబాబుకి వెంకయ్య యింటిపేరు తెలియదు. తిలకం భర్త అని మాత్రమే తెలుసు. ఒక ఫ్యాక్టరీలో మేనేజరనీ; కూలీలతో కలిసి సమ్మె చెయ్యటంవల్ల ఈ మధ్యే ఉద్యోగం ఊడిందనీ తెలుసు. ఆ సంగతే పోర్టరుకి చెప్పాడు.

"కామ్రేడ్ వెంకయ్యా! తెలియకేం!" అన్నాడు పోర్టరు.

"ఎక్కడ?"

పోర్టరు పొలాల్లోనుంచి వెళ్ళే కాలిబాటను చూపించాడు. వారి తిరిగినన్ని మెలికలూ చేత్తో చూపిస్తూ చెప్పాడు. "ఇట్లా

వెళ్ళి ఎడంపక్కకి తిరిగి, ముక్కుకు సూటిగా ఇరవై గజాలు నడిస్తే అతని డిస్పెన్సరీ తగుల్తుంది."

వాన వెలిసిపోవటంవల్ల చేలన్నీ నెరలిచ్చి వున్నయి. గట్లలో పెద్ద పెద్ద కలుగులున్నయి. పక్కనున్న ఫ్యాక్టరీ శిథిలమయిన పురాతనకట్టడంలాగు పడివుంది. సంస్కృతభాషను తలుచుకున్నప్పుడు కలిగే విషాదంకంటె ఎక్కువ విషాదాన్ని కలిగిస్తూ వుంది. ఒక్క ఫ్యాక్టరీగొట్టం మాత్రం ఆ విషాద దృశ్యాన్ని ఛేదించుకొని నిలబడి భవిష్యత్తులోకి చూస్తూ వుంది.

శిశిరకుమారబాబు కాలిబాటనే పడిపోయి పోర్టరు చూపించిన ఇంటిదగ్గరకు చేరుకున్నాడు. అది పూరిల్లు. పొరపాటు పడ్డానేమోనని భవంతికోసం అటూ ఇటూ చూశాడు. కాని దగ్గరవున్నవన్నీ పూరిళ్ళే!!

ఆ ఇంటిపక్కనే చెట్టుకింద కూర్చుని చదువుకుంటున్న వ్యక్తి అతన్ని చూశాడు. ఆ వ్యక్తి కొంచెం ముతకమనిషి. వాడిచూపులు కలిగిన మనిషి. బాహ్యప్రపంచంసంగతి తప్ప తనజేబుకి చిరుగున్నసంగతే తెలుసుకోలేని మనిషి. సాయంకాలం భోజనంలోకి బంగాళాదుంపకూర బాగుంటుందో, కాకరకాయపులుసు బాగుంటుందో ఇంకా తేల్చుకోని మనిషి !!

"ఏంకావాలి ?" అని అడిగాడు.

"వెంకయ్యగారిల్లి దేనా ?"

"అదే."

"ఆయనభార్య ఇంట్లోవుందా ?"

"ఎవ్వరూ ?"

"ఆయన భార్య."

"భార్యలు ఇంట్లోవుండక ఏంచేస్తారు ! ఇంట్లో నేవుంటారు. ఎప్పుడూ ఇంట్లో నేవుంటారు." అని చెప్పి ఆ వ్యక్తి మళ్ళీ పుస్తకం చదువుకోవటం మొదలుపెట్టాడు.

శిశిరకుమార బాబుకి కష్టంవేసింది. "నేను వూళ్ళోవాళ్ళ భార్యలసంగతి అడగటంలేదు. వెంకయ్య భార్యసంగతి అడుగుతున్నాను" అన్నాడు.

"వెంకయ్యభార్యమాత్రం వూళ్ళోవాళ్ళ భార్యకాదూ?" అని మొహాన విసిరికొట్టినట్టు జవాబు చెప్పాడతడు. ఈసారి తలకూడా పైకెత్తకుండా జవాబు చెప్పాడు.

శిశిరకుమార బాబుగారికి కోపంవచ్చింది. బొత్తిగా సంస్కారంలేని మనిషి ! సోషలిజం ప్రచారంలోకి రాకముందు పల్లెటూళ్ళు ఎంత మర్యాదగా వుండేవి ! ఈసారి తాను రాసే పుస్తకంలో ఇటువంటి విచిత్రవ్యక్తి నొకణ్ని సృష్టించి, ఇప్పటి యువకుల్ని దెబ్బతియ్యాలి !

ఇక ఆ వ్యక్తితో లాభంలేదని తానే నెమ్మదిగా వెళ్ళి ఆ ఇంటితలుపు తట్టాడు. లోపల అడుగుల చప్పుడు వినిపించింది.

ఒకక్షణం ఆనే అనుకున్నాడు. ఒకక్షణం కాదనుకున్నాడు. ఆ పదధ్వని ఆమెదే అనుకున్నాడు. మళ్ళీ కాదనుకున్నాడు.

ఆనే !!!

కాని ఎంతమారిపోయింది! గుర్తుపట్టటానికే కష్టంగా వుంది! అతడు ఆశ్చర్యంతో అలాగే నిలబడిపోయాడు అతన్ని చూచి ఆమెకూడా అంతే – అలాగే నిలబడిపోయింది. అతని మొహాన్నుంచి చూపులు తిప్పుకోలేకపోయింది. అతని మొహం మీద చూపులు ఆనటంలేదు. ఆమెకు అతని మొహం అలికినట్టు కనిపించింది. కాని అతనే అని తెలుసు. కాని బాధో ఆనందమో, ఆ వికారం ఏమిటో తెలియటంలేదు. హృదయం మాత్రం చెడిపోయిన గ్రామఫోను రికార్డులా గుర్రుమని మోతి పెట్టింది. కదలకుండా, మెదలకుండా, రెప్పవెయ్యకుండా చూస్తూ అలాగే నిలబడిపోయింది.

శిశిరకుమారబాబుకి ఏమీతోచక అటుతిరిగి ఇటుతిరిగి, గొంతుసవరించుకొని "ఇప్పుడే వచ్చాను" అన్నాడు.

"రండి"—కాని గడపలోనుంచి కదల్లేదు. కదలటం మరచిపోయింది.

"నిన్ను చూచిపోదామని వచ్చాను," అన్నాడు. ఆమాట ఆమెకు వినిపించింది. ఒక్కక్షణం ఆమె పాలిపోయిన మొహం జీవకళతో ప్రకాశించింది. ఒక్కక్షణం ఆనందంతో చూపులు

నుకపినై. ఒక్క క్షణం పెదిమలమీదికి చిరునవ్వు వచ్చినట్టే వచ్చింది!

"రండి"

ఇద్దరూ లోపలికి వెళ్ళారు.

ఆ యింటికి కంతకీ అదొక్కటే గది. ఆగదిలో సామాన్లు, అలంకారాలూ ఎక్కువగా లేకపోయినా, పరిశుభ్రంగా వుంది. అలమరలో పుస్తకాలున్నాయి. కుర్చీకి ఎదురుగా బల్లమీద స్టౌవ్ వుంది. గోడకు భూగోళపటం తగిలించివుంది. పక్కనే ఒక ఫొటో వుంది—అదెవ్వరిదో శిశిరకుమార బాబుకి తెలియ లేదు. అతని ముప్ఫై సంవత్సరాల జీవితంలో ఆ ఫొటో ఎక్కడా తగలేదు. ముడి వేసుకోవటం చేతగాని నెక్ టై, ముడతలు పడ్డ బూష్ కోటూ, బూదివాసి బుల్లిగడ్డం, హృదయాల్లోకి దూసుకుపోయే చురుకుచూపులూ — ఆ ఫొటో ఎవ్వరిదో శిశిరకుమార బాబుకి తెలియ లేదు. అసలా ఫొటో వెంకయ్య ఎందుకు తగిలించాడో బోధపడ లేదు. అతడీ విధంగా గదిని పరిశీలిస్తుంటే తిలకం అతన్ని క్రీగంట చూస్తూ నిలబడింది. అతను రావటం ఆమెకు సంతోషం గలిగించినా, తానిటువంటి కొంపలో వుంటున్నానే సంగతి అతనికి తెలిసినందుకు విచారపడ్డది.

"అంతా బాగున్నారా?" అని అడిగింది.

"అంతా ఎవ్వరు? నే బాగానే వున్నాను," అన్నాడు. అతనికి తలిదండ్రులు చిన్నతనంలోనే పోయారు. మరిం కెవ్వరూ లేరు. ఆ సంగతి ఆమెకు తెలుసు. "నువ్వో" అని అడిగాడు.

ఆమె కళ్ళల్లో నీళ్ళు తిరిగినై. అతడు చూస్తాడేమో నని భయంతో అతని వైపుకి వీపు తిప్పి పుస్తకాలు సర్దుతూ నుంచుంది. పుస్తకం అనుకోని పుస్తకాలకింద వున్న పేపరు తీసే టప్పటికి అరలోని పుస్తకాలన్నీ కిందపడి మోతచేసినయి. దడ దడ కొట్టుకునే హృదయంతో ఆమె అలాగే నిలబడింది.

మళ్ళీ బాబే అడిగాడు: "మీావా రెక్కడో మేనేజ రని విన్నాను."

"అవును"

"బాగున్నారా?"

"రిజైనిచ్చారు"

"ఎందుకు?"

"ఏమో!"

"ఇప్పుడేం చేస్తున్నారు?"

"సమ్మెలు చేస్తున్నారు–" ఇక అక్కడ వుండలేకపోయింది. తడబడుతూ గబగబా లోపలికి వెళ్ళిపోయింది.

ఏదేలావున్నా వెంకయ్య ఉద్యోగానికి రిజైనివ్వటం ఆమెకు ఇష్టంలేదని శిశిరకుమారబాబు గ్రహించాడు. గ్లోబ్ గ్రిరున

సంతోషంతో చెప్పాడు. దేశాలువస్తున్నై.—పోతున్నై మళ్ళీ ఆదేశాలే వస్తున్నై—మళ్ళీ ఆదేశాలేపోతున్నై. కాలచక్రం కంటె అనేకరెట్లు వేగంగా తిరుగుతూవుంది గ్లోబ్. అతడు దాన్ని తదేకధ్యానంతో చూశాడు. అయిదారు సంవత్సరాల క్రిందట జరిగిన తన కథను జ్ఞాపకంచేసుకోటానికి యత్నించాడు.

అప్పుడతడు కాలేజీలో బి. ఏ. చదువుతుండేవాడు. తిలకం ఇంటర్మీడియట్ చదువుతూండేది. అతడు కాలేజీ మేగజీన్లో పద్యాలు వ్రాశాడు. మర్నాడు తిలకం కనిపించి అతని పద్యాలు పొగిడింది. అప్పట్నుంచీ ఇద్దరికీ స్నేహం కుదిరింది. అతడు తాను రాసిన పద్యాలు చదివి వినిపిస్తే ఆమె విని సంతోషించేది. కాలేజీ విడిచిపెట్టింతర్వాత ఇద్దరూ రోజూ షికారు వెళ్ళేవారు. సముద్రంవొడ్డున కూర్చొని అలల్ని తిలకించేవారు. సూర్యాస్తమయాన్ని తిలకించేవారు. తన్మయత్వం చెందేవారు. ఆ వాతావరణంలో అతడు వ్రాసిన ప్రేమగీతాలు అర్ధనిమీలిత నేత్రాలతో పాడేవాడు. ఆమె తన ఆనందాన్నంతా నిట్టూర్పుల్లో విడిచేది! కాని రోజులు ఒకేరకంగా గడవ్వు. ఒకరోజు ఇద్దరికీ తగాదా వచ్చింది–చాలా స్వల్పవిషయం. తిలకం వన్నెను పువ్వుని చూచి, "ఆ ముండిచెట్టుకి అంత సువాసనగల పువ్వు ఎలాపుట్టిందో!" అన్నది. శిశిరకుమారబాబు "చిద్విలాసం! వికారంగావుండే నీ తండ్రికి నువ్వెలా పుట్టావు?" అన్నాడు. అతడు నవ్వులాటకే అన్నాడు. కాని ఆమెకు కోపం వచ్చింది.

అప్పటినుంచీ అతన్ని కలుసుకోవటం మానేసింది. కొన్నాళ్ళకు ఒక ఫ్యాక్టరీ మేనేజర్ని వివాహం చేసుకుందని తెలిసింది. తన మీద కసితీర్చుకోటానికే ఈపని చేసిం దనుకున్నాడు శిశిర కుమారబాబు. తరువాత మరికొన్ని సంగతులు తెలిసినయి. తిలకం భర్త పోషలిస్టనీ, అతన్తో తిలకం సరిగ్గా కాపరం చెయ్యటం లేదనీ......

ఈ విధంగా ఆలోచించుకుంటూ, తిలకం కాఫీ తెచ్చి బల్ల మీద పెట్టేవరకూ అతడు గమనించలేదు.

"పుచ్చుకోండి"

"ఆఁ"

"పుచ్చుకోండి"

"నాకోసం ఎందు కింత శ్రమ ?"

"ఇది మా కాఫీటైమే !"

శిశిరకుమారబాబుకి ఆశాభంగమైంది. "మీకోసం కాక పోతే ఇంకెవరికోసం శ్రమపడతాను," అంటుం దనుకున్నాడు. నెమ్మదిగా ఆమెనుచూస్తూ కాఫీ ఒక్క గుటక వేశాడు.

"బాగుంది. నీచేతి కాఫీయేనా ?"

"కాదు."

ఆమె మనస్సులో మనస్సు లేక కాదని జవాబు చెప్పింది. లేకపోతే కాఫీకూడా తానే చేస్తున్నాననే సంగతి అతనికి తెలియనివ్వటం ఇష్టంలేకో, లేకపోతే ఇంకెందుకో! ఆలోచించ

కుండా జవాబు చెప్పింది. కాని అతనికి మాత్రం ఆ జవాబు హాయిని కూర్చింది చమత్కరిస్తున్న దనుకొని సంతోషంతో బిగ్గరగా నవ్వాడు. ఆమె తబ్బిబ్బుపడి అతన్ని వెకిలిగా చూచింది

ఇంతలో బయటనుంచి అడుగుల చప్పుడు వినిపించింది. ఆమె మాట్లాడకుండా, చిలిలోకినడిచే సతీలాగా నడిచి తలుపు దగ్గరకు వెళ్ళింది. బయట పుస్తకం చదువుతున్న వ్యక్తి మరి ద్దరితో ప్రవేశించాడు. శిశిరకుమార బాబు, నవ్వువిసి ఋగ్గుతూ వాళ్ళతో ఆగారు. చెట్టుకిందనుంచి వొచ్చిన వ్యక్తి చిటచిట లాడుతూ నిలబడ్డాడు. మిగిలిన ఇద్దరూ పీకుల్లాగు నిలబడ్డారు.

తిలకం తొందరగా పరిచయం చెయ్యటానికి ప్రయత్నిం చింది. "ఈయన శిశిరకుమారబాబు—"

అంతే! ఆపేరు వినేటప్పటికే వెంకయ్య ముఖ కళవళికలు మారిపోయినై. అంతకంటే చెప్పటానికి అవకాశం ఇవ్వలేదు. చిరునవ్వుతో శిశిరకుమారబాబు దగ్గరకువచ్చి, మీరా? ఎవ్వరో అనుకున్నాను. క్షమించండి. మీ పరిచయం చేసు కోవాలని చాలా రోజుల్నించి ప్రయత్నిస్తున్నాను. నా భార్య మిమ్మల్ని గురించి చాలా చెప్పింది. మీరు రాసినపుస్తకాలన్నీ మా ఇంట్లో వున్నాయి. మీ ఆఖరి విరహవేదనకూడా ఉంది. నా భార్యకు మీ పుస్తకాలంటే చాలా మక్కువ. భోజనం కూడా మానేసి, నన్నుకూడా వొదిలేసి చదువుతూవుంటుంది." అని కరస్పర్శ చేశాడు.

శిశిరకుమారబాబు కలవరపడ్డాడు. వెంకయ్య తన్నింత హృదయపూర్వకంగా ఆహ్వానిస్తాడని అతడనుకోలేదు. తన్ను చూడగానే చొక్కా-చేతులు పైకిమడచి 'వర్గకలహం' 'విప్లవ చైతన్యం' 'రుధిరం' 'రక్తం' అంటూ డనుకున్నాడు.

తిలకం సమాధిలాగు నిలబడి చూస్తుంది.

వెంకయ్య తన స్నేహితుల్ని పరిచయం చేశారు.

అందులో వొకరు సర్దార్ సుబ్బావధాన్లు. వారు ఉపన్యాసకులు. ఎండిపోయిన కార్మికులు రక్తనాళాల్లో నూతనరక్తాన్ని ప్రవహింపజెయ్యగల్గినవక్త. రెండోవారు కామ్రేడ్ అచ్చయ్యగారు సమ్మెకమిటీ సెక్రటరీ. సమ్మెలు నిర్వహించటంలో అందెవేసినచెయ్యి. శిశిరకుమారబాబు సర్దార్ సుబ్బావధాన్లుకి షేక్ హాండివ్వబోతే అతడు నమస్కారం పెట్టాడు. కామ్రేడ్ అచ్చయ్యకు నమస్కారం పెడితే అతడు సిగ్గుపడి వెకిలినవ్వు నవ్వి తలవంచుకున్నాడు.

అంతా మళ్ళీ కాఫీకి కూర్చున్నారు. మిగిలిన ముగ్గురూ కాఫీతాగుతూ సమ్మెనుగూర్చి చర్చించుకుంటూవుంటే శిశిరకుమారబాబు ముళ్ళమీద కూర్చున్నట్లు కూర్చున్నాడు.

ఇక ఒకరోజుకూడా సమ్మెసాగదు. కూలివాళ్ళు తిండ లేక చస్తున్నారు." అన్నాడు కామ్రేడ్ అచ్చయ్య.

"ఉపన్యాసాలిద్దాం. మీటింగు పెట్టించు," అన్నాడు సర్దార్ కామ్రేడ్!

"తిండికి లేదంటే ఉపన్యాసాలిస్తానంటావ్! ఇంకా నయం, భావకవిత్వం రాస్తానన్లా?" అన్నాడు కామ్రేడ్ అచ్చయ్య.

"ఏం చేద్దామంటావు?"

"ఏం చెయ్యాలో తెలియటం లేదు. ఏదో కటి చెయ్యాలి."

"దేశంలోని మిగిలిన కార్మికసంఘాలను సహాయం చెయ్య మనికోరదాం. ఏదన్నా సహాయం లభిస్తే మరొక వారం రోజులు గడపొచ్చు;" అన్నాడు వెంకయ్య.

"ఇలా ఎన్నాళ్లు?" అన్నాడు కామ్రేడ్.

"వారం రోజులు గడిస్తే చాలు. అప్పటికి యజమాన్లు లొంగితీర్తారు," అన్నాడు వెంకయ్య.

"లొంగకపోతె!"

"మనం లొంగాలి"

"ఇంతా కష్టపడి చివ్వరకి అంతే! అయితే ఈబాధలన్నీ ఎందుకూ?" అని నిట్టూర్చాడు సర్దార్.

"ఈచిన్న పోరాటాల్లో జయం లభిస్తుందని గట్టిగా చెప్ప లేం. ఇప్పుడు మనం ఓడిపోయినా అంతిమపోరాటానికి కావల సిన అనుభవం మనకు దొరుకుతుంది. ఈ పోరాటాలవల్ల కార్మి కుల్లో చైతన్యం కలుగుతుంది. అదే ఇప్పుడు మనకు కావల సింది" అన్నాడు వెంకయ్య.

"ప్రపంచ కార్మికులారా! ఏకము గండు" అని మోగాడు సర్దార్.

కాఫీ పూర్తయిం తర్వాతకూడా చాలాసేపు మాట్లాడు కున్నారు. మధ్యమధ్యలో ఉద్రేకాలు పెరిగి దూషించుకున్నారు. శిశిరకుమార బాబు అయోమయంగా కూర్చున్నాడు. సంస్కారంలేని, వాళ్ళని చూస్తే అతనికి అసహ్యం వేసింది. తిలకంలో మార్పూ, ఈకొంపలో ఆమెపడే బాధా అప్పుడతనికి అర్థమైనై.

ముగ్గురూ లేచారు వెంకయ్య శిశిరకుమార బాబు వైపుకు తిరిగి, "కొంచం పనుంది వెళ్ళివస్తాను. నాలుగురోజు లుంటారుగా" అన్నాడు.

"లేదు. మద్రాసులో కవులసమ్మేళనకు వెళ్తూ చూచిపోదామని దిగాను. రేపు వుదయం వెళ్ళిపోవాలి."

"అలా కాదు. నాలుగు రోజులన్నా వుండాలి." అని వెంకయ్య కోరాడు.

"ఉండండి" అన్నాడు సర్దార్.

"ఉండండి" అన్నాడు కామ్రేడ్.

తిలకం చూపుల్తో ప్రార్థించింది. అతడు కష్టంమీాద అంగీకరించాడు. వెంకయ్య బయటికివెళ్తూ జ్ఞాపకం చేశాడు. "నాలుగు రోజులంటే, నాలుగురోజులు."

* * * *

మర్నాడు వెంకయ్యరాలేదు. ఈ అయిదు సంవత్సరాల్లో తిలకం అంత సంతోషంగా ఎప్పుడూలేదు. విద్యార్థిని దశలో వొదలిన జీవితాన్ని మళ్ళీఅందుకుంది. తోటలో కూర్చొని

శిశిరకుమార బాబుతో కబుర్లు చెప్పుకుంది. పూర్వస్మృతు లన్నీ జ్ఞాపకం తెచ్చుకొని ఆనందంతో పొంగిపోయింది. అతడు రాసిన పద్యాలను చదివి వినిపించమని కోరింది. అతడు గొంతు బిగపట్టి విగ్రహిస్తూ సవరించుకుంటూ, అర్ధనిమీలిత నేత్రాలతో పాడి వినిపించాడు:—

నీ తలలోని పువ్వునై
నీ జడలోని గంటనై
కంటిమీది రెప్పనై
జాకెట్టు చుక్కనై
నివసిస్తాను
వసియిస్తాను !
నీవుకట్టిన నీలాంబరాలలో
నీవుతొడిగిన సిల్కుజంపర్లలో
కలికించి
మురిపించి
నిద్రపోతాను
నిద్రపోలేను ! !

అతని పాటల్ని ఆమె మెచ్చుకుంది. కాని పూర్వం కలిగిన తన్మయత్వం కలగలేదు. ఆమె భావతంత్రులు తెగిపోయినవా

ఏమిటిది!

ఏమి టిది!

రాత్రంతా ఏడుపుతో ఆలోచనల్తో నిద్రపోలేదు తిలకం.

*　　*　　*　　*

రెండో రోజుకూడా వెంకయ్య రాలేదు. కూలీలను ఆర్గనైజ్ చెయ్యటానికి వెళ్లివుంటాడని చెప్పింది తిలకం.

"ఆర్గనైజ్ చేస్తాడా?"

" అంటే! "

"కూలీలందరు ఏకము కావలెరా!" అని పాడింది. ఇద్దరూ నవ్వుకున్నారు. కాని ఆ రోజు శిశిరకుమారబాబుని పద్యాలు పాడమని తిలకం అడగనూ లేదు. అతను పాడనూ లేదు. ఆరాత్రి మాత్రం తిలకం పడుకొని 'కూలీలందరు ఏకము కావలెరా!' అనేపాట పది పన్నెండుసార్లు పాడుకుంది. ఆశ్చర్యమేమిటంటే పాటుతున్నకొద్దీ ఆమెకాపాట బాగుంది. శిశిరకుమారబాబు పాట లివ్వలేక పోయిన ఆనందం ఆ పాట ఇచ్చింది.

*　　*　　*　　*

మూడో రోజుకూడా వెంకయ్య రాలేదు. ఇవ్వాళ తిలకం షికారు వెళ్లలేదు. శిశిరకుమారబాబు అడిగితే "తలనొప్పిగా వుంది. మీరు వెళ్లిరండి" అని చెప్పింది. అతడు తిరిగివచ్చే టప్పటికి వెంకయ్య పుస్తకం చదువుతూ కూర్చుంది.

"ఎలావుంది?" అని అడిగాడు బాబు.

"బాగుంది"

"ఏమిటి ?"–వింతగా అడిగాడు.

"పుస్తకం"

"పుస్తకం కాదు"

"మరేమిటి?"

"తలనొప్పి"

"ఎవ్వరికి?"

ఇక అతడు ఎక్కువ ప్రశ్నించలేదు.

*　　*　　*　　*

నాలుగో రోజుకూడా వెంకయ్య రాలేదు. ఇవ్వాళ తిలకం శిశిరకుమారబాబుకి అసలు కనిపించలేదు. వంటింట్లో కూర్చొని అదే పుస్తకం తదేకధ్యానంతో చదువుతూవుంది. శిశిర కుమారబాబుకి ఏమీ తోచక దాసీదానితో సరసాలాడు తుంటే చూచింది. కాని ఏమాత్రం ఆశ్చర్యపడలేదు. ఎందుకు పడుతుంది? ఆపుస్తకంలో ఈసంభాషణ చదువుతూ వుంది:–

భూదేవి—నీవు ఎందుకు రాస్తున్నావ్?

కవి—కోకిల ఎందుకు పాడుతూవుంది?

భూదేవి—అది పక్షి.

కవి—నేనూ పక్షినే!

భూదేవి—నీవు మనిషివి

కవి—అయితే!

భూదేవి—ఆ కృత్రిమ వాతావరణంలో వూపిరాడక పాతాళలోకంలో పడిపోతావు.

*　　*　　*　　*

అయిదో రోజు వెంకయ్య వచ్చాడు. చాలా గాబరాగా వున్నాడు. రేగిన జుట్టూ, పెరిగిన గడ్డం, దుమ్ముకొట్టుకున్న బట్టలూ—మాక్సిం గోర్కీ పుస్తకం జీవం పోసుకొచ్చి నట్లుంది. గదిలో అడుగు పెట్టగానే శిశిరకుమార బాబుని అడిగాడు:—
"తిలకం ఏదీ?"

అతన్ని చూచి శిశిరకుమార బాబు కొంచెం భయపడ్డాడు. ఇలాంటి వ్యక్తుల్ని గూర్చి పుస్తకాల్లో చదవటానికే అతడు భయపడతాడు. ఇక జీవితంలో ఎలా ఎదుర్కొంటాడు?

"తిలకం ఏది?" అని మళ్ళీ అడిగాడు వెంకయ్య. ఈసారి వెంకయ్యలో ఆదుర్దాకంటే విచారం ఎక్కువ కనిపించింది.

"వంటగదిలో వుంది." అని చెప్పాడు బాబు.

"వంటగదిలోనా?"

"అవును"

"ఏం చేస్తూంది?"

"వంటగదిలో ఏంచేస్తారు?"

"ఇడ్డెన్లా?" కోపంగా అడిగాడు వెంకయ్య. కాదు అన్నట్లు తలూపాడు శిశిరకుమారబాబు.

వెంకయ్య ఆలస్యాన్ని భరించలేకపోయాడు. "చెప్పు. ఏం చేస్తూంది?" అని రెండడుగులు ముందుకు వేసి గద్దించాడు.

"చదువుతూ వుంది" అని చెప్పాడు బాబు.

"ఏ పుస్తకం? నీ పుస్తకమా?" కాదు, నీ పుస్తకం."

వెంకయ్య ఒక్క నిట్టూర్పు విడిచాడు. గ్లోబ్ గిర్రున తిప్పాడు. గబగబా ఫోటోదగ్గరకు వెళ్ళాడు. "ప్రపంచ కార్మికులారా, ఏకముగండు" అని కేక వేశాడు.

ఆ కేకకు శిశిరకుమారబాబు ఉలిక్కిపడ్డాడు. వెంకయ్య అతనిదగ్గరకువొచ్చి చెవిలో రహస్యంగా చెప్పాడు, "అయితే ఇక నువ్వెందుకు? నువ్వెళ్ళొచ్చు !"

ఈ మాటలకు శిశిరకుమారబాబు నిర్విణ్ణుడయ్యాడు, వెంకయ్యని అర్థంచేసుకోటానికి ప్రయత్నించాడు. తానేం చేశాడు ? వెంకయ్య కోర్కెమీదే వుంటున్నాడాయెను—"మీకింత కష్టంగా ఉందని తెలిస్తే అసలే వుండేవాణ్ని కాదు." అన్నాడు.

"అదేంమాట ! ఉండక పోతేఎలా?" అన్నాడు వెంకయ్య. అద్దంలో మొహం చూచుకుంటూ, జుట్టుసర్దుకుంటూ మాట్లాడాడు: "మీరు ఉండాలి. అయితే నాలుగురోజులు మాత్రమే ఉండాలి." అని కులికాడు.

"ఎందుకు?"

వెంకయ్య అద్దందగ్గరనుంచి శిశిరకుమారబాబు దగ్గరకు వొస్తూ, సీరియస్‌గా చెప్పాడు–"మీరిద్దరూ ప్రేమించుకున్నారని నాకు తెలుసు. మీ పూర్వపరిచయం నాకు తెలుసు. అందుకనే నిన్ను నాలుగురోజు లుండమని బలవంతపెట్టాడు"

"ఎందుకు?"

"చెబుతాను. ఇదివరకు మీ పరిచయమల్లా ఎక్కడో ఎప్పుడో కలవటం కవిత్వం మాట్లాడుకోవటం, తన్మయత్వం చెందటంతో సరిపోయింది. అంతేగాని నిన్ను మనుష్యునిగా అర్థంచేసుకునే అవకాశం తిలకానికి లేకపోయింది. అందుకని నిన్ను గురించీ, నీతో గడపిన 'మధుర' క్షణాలను గురించీ ఎప్పుడూ ఆలోచించుకుంటూ, తన ప్రస్తుత జీవితంతో పోల్చుకొని విచారిస్తుండేది. ఎంతచేసినా, ఎంత ప్రయత్నించినా కుంటుంబజీవితం వేరు, ప్రేమజీవితం వేరు. కుటుంబభారం వ్యుద్రేకంతో కూడిన ప్రేమ జీవితంలా వుండమంటే ఎలా వుంటుంది? ప్రియునికిమల్లే పొగుడుతూ, వర్ణిస్తూ 'ప్రేయసీ, ప్రేయసీ నీ వాళ్లడనే ప్రేయసీ' అనుకుంటూ తిరగడానికి భర్తకి ఎలా మనస్కరిస్తుంది? ఎలా తీరుతుంది? ఆ సంగతి తెలియక తిలకం తన జీవితాన్ని దుర్భరం చేసుకుంటూవుంది. ఎప్పుడూ కిటికీదగ్గర కూర్చోవటం, నీతో గడిపిన క్షణాల్ని స్మృతిపథానికి తెచ్చుకోవడం. నిట్టూర్పులు విడవటం! ఏం చెయ్యాలా అని నేను చాలా ఆలోచించాను. తిలకం అంటే నాకు చాలా ప్రేమ. ఆమె కష్టపట్టం చూచి సహించలేను. అందుకని నీదగ్గరకువచ్చి నీసహాయం తీసుకుందామనుకున్నాను. అదృష్టవశాత్తూ నువ్వే వచ్చావు." అని నవ్వటం మొదలు పెట్టాడు వెంకయ్య.

శిశిరకుమారబాబు మాట్లాడకుండా వింటున్నాడు. వెంకయ్య నవ్వు అతని హృదయాన్ని దహించి వేస్తూవుంది.

వెంకయ్య అందుకున్నాడు:—"ఈ నాలుగురోజుల పరిచయంలో ఆమెకై వు దిగిపోయివుంటుంది. నువ్వెంతసామాన్య మానవుడవో, దుర్భరపురుషుడవో, నీకవిత్వం ఎంతపనికిమాలిందో ఆమెకు తెలిసివుంటుంది. నీ పద్యాలకంటే నే ఫాక్టరీలో రాసే ఎకౌంట్లే ఉపయోగకరమైనవని తెలిసుంటుంది. నువ్వు పాడే పాటలకంటే నేనువాగే నినాదాలే ఉపయోగకరములని తెలుసుకుని ఉంటుంది. పైత్యంతో ఎక్కువ కాలం ప్రజల్ని మోసం చెయ్యలేం! అందుకనే నిన్ను నాలుగు రోజు లుండమని కోరాను. నిన్ను అర్థంచేసుకునే అవకాశం ఇవ్వటానికి నే నింట్లో లేకుండా వెళ్ళాను. నువ్వురాగానే వస్తే ఏమయ్యేదో తెలుసా! ఆమె నిట్టూర్పులు మరీ ఎక్కువయ్యేవి. ఆమెజీవితం నాశనమయ్యేది. ఇక భయంలేదు. ఇక నీఅవసరం లేదు. నువ్వెళ్ళొచ్చు" అని లోపలికి సంతోషంగా గెంతాడు.

శిశిరకుమారబాబుకి కోపం వచ్చింది. వెంకయ్య తన్ని నీచ కార్యానికి ఉపయోగించుకున్నందుకు రోషం వచ్చింది. భార్యాభర్తల తగాదా తీర్చటానికి తా నీవిధంగా వాడుకోబడతానని అతడు కల్లోకూడా అనుకోలేదు. అది అతని సిద్ధాంతానికి వ్యతిరేకంకూడా! తన సిద్ధాంతం ఈవూళ్ళో, ఈ ఫ్యాక్టరీ పొగలో భగ్నమయిందని ఉక్రోషం వచ్చింది. తిలకంతో చెప్పాలని గబగబా లోపలకు వెళ్ళాడు.

కాని తిలకం గదికి వెళ్ళేదార్లో వెంకయ్య కనిపించాడు. "ఎక్కడికి?" అని అడిగాడు. "తిలకంతో మాట్లాడాలి"

వెంకయ్య ఈమాటకు బిగ్గరగా నవ్వాడు—"ఆశకు అంతు లేదు భాయిసాబ్! తిలకంతో నే మాట్లాడతాను. జరిగిన సంగతంతా చెబుతాను. మీరు వెళ్ళండి. వెళ్ళి కవిసమ్మేళ నాలు చేయించండి." అన్నాడు.

శిశిరకుమారబాబు కోపంతో తుకతుకలాడి పోయాడు. కాని వెంకయ్య వైఖరి చూస్తే భయంవేసింది! పట్టుపడితే, ఇంకొక మాటంటే తంతా డనుకున్నాడు. "ప్రపంచ కార్మికు లారా, ఏకముగండు" అని మీదకు దూకుతా డనుకున్నాడు

"ఎక్స్ప్లాయిటేషన్—ఎక్స్ప్లాయిటేషన్" అనుకుంటూ వచ్చిందారి పట్టాడు.



# శ్రీ అడివి బాపిరాజు

శ్రీ అడివి బాపిరాజుగారి జన్మస్థానం పశ్చిమ గోదావరి జిల్లా, భీమవరం. జననం 1895 అక్టోబరు 8. రాజమహేంద్రి (ఆర్ట్సు) కాలేజీలో బి. ఏ. చదివి 1921లో స్వరాజ్యోద్యమంలో జైలుకు వెళ్ళారు. తర్వాత బందరు ఆంధ్రజాతీయ కళాశాలలో ప్రమోదకుమార ఛటర్జీ వద్ద చిత్రలేఖనం అభ్యసించారు. ఆ తరువాత బి. యల్. పట్టాను పొంది కొంతకాలం భీమవరంలో ప్లీడరుగా ఉన్నారు. 'త్రివేణి' పత్రికకు కొన్నాళ్ళు సహాయ సంపాదకులుగా కూడ పనిచేశారు. 1935 నుండి 1939 వరకు ఆంధ్ర జాతీయ కళాశాలకు ప్రిన్సిపాలుగా ఉన్నారు. కొంతకాలం ఫిలుములలో ఆర్టుడైరెక్టరుగా ఉన్నారు. తరువాత హైదరాబాదులో 'మీజాన్' దినపత్రికకు సంపాదకులయ్యారు.

బాపిరాజుగారు సాహిత్యంలోనూ చిత్రకళలోనూ సమానప్రతిభులు. నారాయణరావు, హిమబిందు, తుఫాను, కోణంగి, నరుడు, జాజిమల్లి, గోనగన్నారెడ్డి వీరి నవలలు. అంజలి, రాగమాలిక తరంగిణి, శశికళ మొదలైన కథలు, నాటికలు, గేయాలు, కావ్యాలు చాలా ఉన్నవి. బాపిరాజుగారు 1952 సెప్టెంబరు 22న మద్రాసులో కీర్తిశేషులైనారు.



# కథ

కత్తి, గంటం అనేవి రెండు విభిన్న భావనాకేంద్రాలకు రెండు విభిన్న శబ్దసంకేతాలు. గంటంతో సాహిత్యవిజయాన్ని, కత్తితో దేశవిజయాన్ని సాధించిన ప్రాచీనపౌరుషగాథలో జగ్గన్నగంటం విలక్షణమైంది. జగ్గన్నగంటం కావ్యసృష్టిని సూచించేదికాదు. కావ్యసృష్టికి సంబంధించిన వృత్తిని సూచించేది. అడివి బాపిరాజుగారి కళాహృదయం అధివాస్తవికతతో మేళవింపబడి జగ్గన్నను ఎన్నుకొని ఆకాలానికి చెందిన ఒక సాధారణ శ్రమజీవి జీవనవిధానాన్ని పరిశీలించింది. జగ్గన్నవృత్తి పరిశుద్ధమైంది. జగ్గన్నకు ఉన్న సమః కౌతూహలం ప్రభువులకు అందింపబడి తక్షణమే కార్యరూపం ధరించి విజయం సాధించింది. ఆ విజయానికి ఫలితంగా అతనికి చెంగల్వల ప్రకాశకవిమంత్రి పుత్రిక లభించింది. ఆస్థాన మంత్రిత్వం ఇంకాకొన్ని బిరుదులు లభించినాయి. ప్రతిభ చప్పున గుర్తింపబడి ఆవరణాలు, అడ్డంకులు లేకుండా సూటిగా ఉన్నతపథాలను అధిరోహించడానికి వీలున్న ఆ పంచికాలాన్ని, ఇప్పుడే రెండు మూడు శతాబ్దాలముందు మనస్మృతినుండి జారిపోయిన ఆ నిష్కళంక ప్రాచీన సభ్యతా శాద్వలాన్ని కన్నులకు కట్టినట్లుచేసి మనల నోరూరింపజేస్తున్నారు బాపిరాజుగారు. తెలుగు సంస్కృతిని ప్రతిబింబింపజేసే చారిత్రికతథ్యాలను కథగా మల్చుకోవడంలో బాపిరాజుగారు ఎలాగూ సిద్ధహస్తులు. ఈ తథ్యాలతోపాటు పేటిలోనుంచి జగ్గన్నను దర్శించడం ఈ కథలోని బాపిరాజుగారి ఇంకో విశిష్టత.

ఇది సంస్కృతి ప్రధానమైన కథ.

# జగ్గన్న గంటం

అతడు వేద వేదాంగ పారంగతుడు. సకలశాస్త్ర విద్యావేత్త. నిరుపేద. పేరు జగ్గన్న. ఇంటిపేరు కడలివారు. కృష్ణానదీతీర శాలిభూములలో రెండు నివర్తాల నేల అతని పెద్ద కుటుంబానికి ఏ మాత్రం రాబడి నివ్వగలదు? జగ్గన్న తండ్రి రామన్న మంత్రికి ఆరుగురు ఆడపిల్లలు, ముగ్గురు మొగపిల్లవాండ్లు. ముగ్గురు ఆడపిల్లలకు పెళ్ళిళ్ళు చేసినారు. వారు అత్తవారి ఇళ్ళల్లో కాపురం చేస్తున్నారు. ఒకొక్క పెళ్ళికి ముప్ఫది నలువది కృష్ణరాయ వరహాల వరకు ఖర్చు అయినది. ఆ వరహాల రాబడికి ఒకొక్క నివర్తమే అమ్ముడు పోయింది.

రామన్న మంత్రి అతి అభిమాని. కూటికి జొన్నలు లేకపోయినా కుండ చల్లగా వుండవలసిందే. కుటుంబం యావత్తూ అలా యెన్నిరోజులు వస్తుందో! కమ్మనాటి ఆరువేల బ్రాహ్మణుడు. కొండపల్లి రెడ్డి ప్రభువుల రాజ్యం పాల సముద్రపు కెరటాలల్లా పరిపాలింప జేసిన జక్కన్న మంత్రి మునిమనుమడు.

కొండపల్లి రెడ్డి రాజ్యం శ్రీకృష్ణదేవరాయలు వడిసి పట్టి లోబచ్చుకొన్నప్పుడు జక్కన మంత్రి రిక్తహస్తాలతో

స్వగ్రామమైన కదలీపుర క్షేత్రానికి విచ్చేసి తన మెడలోని హారాల నమ్ముకొని నూరు నివర్తనములు భూమి కొని వ్యవసాయ దారుడయ్యాడు. భారతీయుడికి వాడి కత్తి అయినా దొరుకుతుంది. లేకపోతే నాగలి మేడి తోకైనా దొరుకుతుంది.

మూడు తరాల్లో నూరు నివర్తాల భూమి ఆరింటికి దిగింది. రాజభోగంపోయినా రాజసం మిగిలింది.

౨

కదలి జక్కన్న చదువుల కదలి. అతని వ్రాత ముత్యాల పోత. స్నానాది అనుష్ఠానాలు నిర్వర్తించుకుని ఉత్తరాన నాగేశ్వరస్వామి భక్తులు మోయించే గంటలతో శ్రుతికల్పి వాడి మొనవాలు గంటము చేత బూని ఏ భారతమో, భాస్కర రామాయణమో, శ్రీనాథ కాశీఖండమో, పెద్దనార్యుని మనుచరిత్రమో చక్కగా సమకూర్చిన తాళపత్రాల మీద లిఖిస్తూ వుంటే అర్ధయామానికి ఆశ్వాసము పూర్తి అయ్యేది. అతని బంధువులలో ఒక కుటుంబానికి పూర్వీకుడు అయిన పేరంరాజు జక్కనకవి సిద్ధయామాత్యుని గురించి చెప్పినట్లు మన జక్కన్న గంటము వ్రాతలో సవ్యసాచి. రెండుచేతులా ముత్యాల మాలలు మహావేగంతో వ్రాయగలడు.

చిన్నతనాన్నించి అలవడిన ఈ విచిత్ర కౌశల్యమువల్ల జక్కన్న అప్పుడప్పుడు తండ్రిగారి పాదాలకడ పది పదిహేను

నిష్కములు సమర్పిస్తూ వుండేవాడు. ఏ మాండలిక ప్రభువో, ఏ ఉన్నత రాజోద్యోగో, ఏ సంపన్నుడో జక్కన్న వ్రాసి వుంచిన ఉత్తమ గ్రంథాలను తనకు తోచిన పారితోషికం అర్పించి తీసుకుపోతూ వుండేవాడు.

జక్కన తండ్రివలెనే పలచని పొడుగాటి మనిషి. బంగారు మేని ఛాయ. అమోఘమైన బలం వుంజింప జేసు కున్న ఉక్కులాంటి దేహము. గరుడ నాశికము. చిన్నవైనా అందమైన రేఖలు కలిగి కాంతివంతమైన కళ్లు.

తండ్రిగారి కడనే శుశ్రూష చేసి సంస్కృతంలో అఖండపాండిత్యము సంపాదించుకున్నాడు. తెలుగు భాషలో పూర్ణ పండితు డనిపించుకున్నాడు. కన్నడ, ద్రావిడాది ఇతర దక్షిణ భాషలలో, పారసీకం, ఓఢ్రం, హిందీ మొదలగు ఉత్త రాది భాషలలో ఉత్తీర్ణు డయ్యాడు. ఐదారు లిపులు మహా ప్రవాహం వలె రచింపగలడు.

జగ్గన తండ్రిగారితో పాటు వ్యవసాయం చేయుటలో ఆరితేరిన బంటు. తమకున్న రెండు నివర్తాల వ్యవసాయము త్వరలో ముగించి తండ్రి కుమారు లిద్దరు యితర భూములు కౌలుకు తీసుకుని వ్యవసాయం చేస్తూ వుండిరి. దాని వల్ల కుటుంబానికి ఓ మోస్తరుగా సరిపోయే రాబడి వస్తూ వుండెను.

3

తండ్రి—నాయనా! ఈ ఏటి పంట అంత నాశిగా లేదు బాబు.

జగ్గన్న—కందులు, సెనగలు, పెసలు, మిర్చి యింత పుష్కలంగా అవతరించడానికి కృష్ణవేణమ్మ దయే కారణం.

రామన్న మంత్రి—దేశంలో మళ్ళీ పెద్ద యుద్ధం సంభవించే సూచనలు కనబడుతూ వున్నవి. ఆంధ్ర సార్వభౌములు శ్రీరంగరాయలని, పెనుగొండలో రాక్షసుడైన జగ్గరాయలు హతమార్చి నప్పటి నుంచి మన మహారాజైన రఘునాథభూపాలుడు వుడుకెత్తిపోతున్నాడని వేగు వచ్చినట్లు దేవరకోటలో గగ్గోలుమంది. శ్రీమంతులు, ప్రభువులు నాగమనీడులం వారు ఏ సమయానకు రాణువుతో బయలు దేరి రమ్మని తంజావూరు నుంచి రఘునాథనాయనిం వారి ఆజ్ఞ వస్తుందో అని యెదురు చూస్తున్నారు.

జగ్గన్న—నాకూ హృదయంలో ఆందోళనంగావుంది. బాబయ్యగారూ! అధర్మం పరవళ్లు పెడుతూన్నది. ప్రభువు కృష్ణదేవరాయలు దివంగతుడయ్యాడు. దేశంలో భీభత్స దేవత తాండవం చేస్తూన్నది. దుర్గానాగేశ్వర దేవుని కృప యెల్లావున్నదో.

రామ—శ్రీ దుర్గాదేవి కరుణ వల్ల నాలుగో అమ్మాయి భ్రమరాంబ వివాహం యీ ఏడు చేయవలసి వుంటుందిరా. కోటలో రాయసపుయిన అడివి మాచన్నగారు

తన పెద్దకుమారునికి భ్రమరాంబను యివ్వవలసిందిగా మనకు రాయబారం పంపిద్దామని అనుకుంటున్నారని గొట్టిపాడి పెద నాగేశ్వరరెడ్డి, రాజపురోహితుడు వేమూరి శ్రీరంగభొట్ల సోమయాజులువారును మొన్న సందేశం తీసుకొనివచ్చారు. అమ్మాయికి పదవ ఏడైనా పంచకావ్యాలు చదువుకుంది. అందాల బరిణె. దాని అదృష్టం యెట్లా వుందో.

జగ్గన్న – దేశపరిస్థితులు మేఘా లావరించినట్లున్నాయి బాబయ్యగారు. అవి రక్తమేఘాలు. రాజుల్లో రాజ్యకాంక్ష యెక్కువయింది. బలములు తక్కువయ్యాయి. బుడతగీచులు, వాళ్ళు యెక్కడ్నుంచి వస్తున్నారో. సముద్రాల అవతల నుంచో, సముద్రం క్రింద పాతాళం నుంచో, వర్తక మనీ, వల్లంకు లనీ, వచ్చి రాజులకూ రాజులకూ కొట్లాలు ముడి పెడుతున్నారు. ధర్మం లేదు, ప్రజల క్షేమం లేదు–ప్రభువుల హృదయాలల్లో.

రామన్న—ఒక్క మన నాగమనీడు ప్రభువు యార్లగడ్డ వంశానికే కాకుండా, కమ్మనాటి రెడ్ల వంశాలన్నిటికీ కూడా కీర్తి తెస్తున్నాడు. తన ప్రభువు రఘునాథ భూపాలునితో పాటు కావ్యకర్త అవుదా మని ఆలోచిస్తున్నాడు. పండితాదరణ, కళారాధన కలిగియుండడమే కాకుండా ప్రజలను తన బిడ్డల్లా రక్షించుకొంటున్నాడు. ఒక్క బందిపోటు యెరగం. రెండేళ్ళక్రింద వచ్చిన చిన్న క్షామాన్ని భూ

3

తండ్రి—నాయనా! ఈ ఏటి పంట అంత నాశిగా లేదు బాబు.

జగ్గన్న—కందులు, సెనగలు, పెసలు, మిర్చి యింత పుష్కలంగా అవతరించడానికి కృష్ణవేణమ్మ దయే కారణం.

రామన్న మంత్రి—దేశంలో మళ్ళీ పెద్ద యుద్ధం సంభవించే సూచనలు కనబడుతూ వున్నవి. ఆంధ్ర సార్వభౌములు శ్రీరంగరాయలని, పెనుగొండలో రాక్షసుడైన జగ్గరాయలు హతమార్చినప్పటి నుంచి మన మహారాజైన రఘునాథభూపాలుడు వుడుకెత్తిపోతున్నాడని వేగు వచ్చినట్లు దేవరకోటలో గగ్గోలుమంది. శ్రీమంతులు, ప్రభువులు నాగమనీడులం వారు ఏ సమయానకు రాణువుతో బయలు దేరి రమ్మని తంజావూరు నుంచి రఘునాథనాయనిం వారి ఆజ్ఞ వస్తుందో అని యెదురు చూస్తున్నారు.

జగ్గన్న—నాకూ హృదయంలో ఆందోళనంగావుంది. బాబయ్యగారూ! అధర్మం పరవళ్లు పెడుతూన్నది. ప్రభువు కృష్ణదేవరాయలు దివంగతుడయ్యాడు. దేశంలో భీభత్స దేవత తాండవం చేస్తూన్నది. దుర్గానాగేశ్వర దేవుని కృప యెల్లావున్నదో.

రామ—శ్రీ దుర్గాదేవి కరుణ వల్ల నాలుగో అమ్మాయి భ్రమరాంబ వివాహం యీ ఏడు చేయవలసి వుంటుందిరా. కోటలో రాయసమయిన అడివి మా చన్నగారు

తన పెద్దకుమారుసికి భ్రమరాంబను యివ్వవలసిందిగా మనకు రాయ:బారం పంపిద్దామని అనుకుంటున్నారని కొట్టిపాడి పెద నాగేశ్వరరెడ్డి, రాజపురోహితుడు వేమూరి శ్రీరంగభట్ట సోమయాజులువారును మొన్న సందేశం తీసుకొనివచ్చారు. అమ్మాయికి పదవ ఏడైనా పంచకావ్యాలు చదువుకుంది. అందాల బరిణె. దాని అదృష్టం యెట్లా వుందో.

జగ్గన్న - దేశపరిస్థితులు మేఘా లావరించినట్లున్నాయి బాబయ్యగారు. అవి రక్తమేఘాలు. రాజుల్లో రాజ్యకాంక్ష యెక్కువయింది. బలములు తక్కువయ్యాయి. బుడతగీచులు, వాళ్ళు యెక్కడ్నుంచి వస్తున్నారో. సముద్రాల అవతల నుంచో, సముద్రం క్రింద పాతాళం నుంచో, నర్తక మనీ, వల్లంకు లనీ, వచ్చి రాజులకూ రాజులకూ కొప్పులు ముడి పెడుతున్నారు. ధర్మం లేదు, ప్రజల క్షేమం లేదు-ప్రభువుల హృదయాలల్లో.

రామన్న—ఒక్క మన నాగమనీడు ప్రభువు యాగ్స్న గడ్డ వంశానికే కాకుండా, కమ్మనాటి రెడ్ల వంశాలన్నిటికీ కూడా కీర్తి తెస్తున్నాడు. తన ప్రభువు రఘునాథ భూపా లునితో పాటు కావ్యకర్త అవుదా మని ఆలోచిస్తున్నాడు. పండితాదరణ, కళారాధన కలిగియుండడమే కాకుండా ప్రజ లను తన బిడ్డల్లా రక్షించుకొంటున్నాడు. ఒక్క బందిపోటు యెరగం. రెండేళ్ళక్రింద వచ్చిన చిన్న క్షామాన్ని భూమిలో

మూాడు నిలువులా పాతి, ప్రతియింటా దీపాలు వెలిగింపించి పండగలు చేయించిన ప్రభు వతడు.

౪

తండ్రికుమారు లిద్దరూ అనుకున్న మాటే నిజమయింది. శ్రీమంతులు యార్లగడ్డ నాగమనీడు ప్రభువుకు తంజావూరు నుండి రఘునాధ మహారాజు మంత్రియయిన అప్పయ్య దీక్షితుల వారు అన్ని పరికరాలతోను, ఆయుధాలతోను, సంపూర్ణ సైన్యయుక్తంగా రావలసిందని మహారాజు ఆజ్ఞ పంపించారు. నాగమనీడు ప్రభువు తన స్నేహితుడైన కొండపల్లి అన్నారెడ్డి ప్రభువుకు, కొండవీటి చిన్నారెడ్డి ప్రభువునకును, తంజావూరికి సైన్యాలతో తరలి వెళ్ళడం విషయంలో రాయబారాలు పంపించారు.

దేవరకోటలో అలజడి యెక్కువగా వుంది. నాగమనీడు ప్రభువు ఆజ్ఞ డిండిమాలతో, డప్పులతో రాణువుపోగు దల నాయకులు దేవరకోటరాజ్యం అంతా చాటింపించారు. ఊళ్ళను పాలించే పంచాయితీలకు రాజముద్రాంకితమైన వార్తలు వచ్చాయి. రఘునాధభూపాల మహారాజు ఆజ్ఞ వెలనాడు, వేలనాడు, రేనాటి విషయం, కొండవీడు, కొండపల్లి, కందనోలు, పాకనాడు మొదలయిన యావత్తు ఆంధ్ర భూమికి సంచలనం కలుగ జేసింది. కృష్ణదేవరాయని చల్లని

రాజ్యం తెలుసుకోనివారు లేరు. జగ్గారాయలు, మధుర ప్రభు వైన ముద్దు చెన్నప్పనాయుడు, ఆంధ్ర సామ్రాజ్యానికి తల పెట్టిన విపత్తును తలిచి కోపించి పళ్లు పటపట కొరకనివాడు లేడు.

నాగమనీడు ప్రభువు సైన్యాలలో పేరు లైన చివిసీయు కాపువారు, యమునినైనా నిలబెట్టగల కమ్మనాటి రెడ్లు విరివిగా వచ్చి చేరుతున్నారు. దేవరకోట మహాపురంలో కమ్మర కొలుముల్లో ఉక్కు కత్తులు, కరవాలాలు, భిండివా లాలు, బల్లాలు, శూలాలు, తోమరాలు రాత్రింబవళ్లు ఎడ తెరిపి లేకుండా తయారవుతున్నాయి. మచిలీపట్టణంలో వర్తకం చేసుకొనే ఒలాందులు నాగమనీడు ప్రభువు పంపిం చిన బంగారపు టంకాలు తీసుకొని తుపాకులు, ఫిరంగులు, తుపాకిమందు, ఉక్కుసామగ్రి సరఫరా చేసినారు. ఏబది ఒలాందు సైనికులును ఒక చిన్న ఒలాందు నాయకుని శిక్షణ క్రింద వచ్చి నాగమనీని సైన్యంలో చేరారు.

నాగమనీడు ప్రభువుకు తన క్రింద దళవాయిగా వుండ టాని కెవరి నేర్పాటు చేద్దామా అన్న ప్రశ్న ఉదయించింది. ప్రశ్నతోపాటే కడలి రామన్న మంత్రి మూర్తిన్నీ ఆయన కళ్ళ యెదుట ప్రత్యక్ష మయింది. రామన్న మంత్రి ముసలి వాడైనా భీష్ముని వలె ఉద్ధత సత్త్వుడు. ద్రోణుని మరిపించే యుద్ధవ్యాపార నిపుణుడు. వెనుక బుడతకీచు దొంగలు

(పోర్చుగీసు) కొందరు అరబ్బీ ఓడ దొంగలతో కూడి కృష్ణా నదీ ముఖద్వారంలో దిగి దేవరకోట సంస్థానంలోకి చొచ్చుకొని వచ్చి కడలి పురాన్ని ముట్టడించబోయే ముందర, రామన్న మంత్రి ఊళ్లోవున్న కమ్మనాటి రెడ్డివీరుల్నీ, కాపు వీరుల్ని, అశ్వత్థామలా వీరత్వం వహించిన బ్రాహ్మణ వీరుల్నీ, చిన్నదళంగా నేర్పరచుకొని తమ కడ్డమొస్తుందని ఏమాత్రం అనుకోకుండా, కొలదోపిడిలో రత్నాలరాసులు కలలుగంటూ ఏమరుపాటున నున్న ఆ బందిపోటు దండుపై హిమపాతంలా, రామబాణంలా, ఏనుగుల దండులా విరుచుకు పడ్డారు. బుడతకీచులతుపాకులు ముక్కలయ్యాయి. అరబ్బుల సురియలు తునకలయ్యాయి. యేబదిమంది తోడిదొంగలు తమ ప్రాణాలు ఆంధ్రభూమి కర్పింపగా, తక్కినవారు పలాయన మంత్రము పఠించగా, రామన్న మంత్రి వెంటాడి, ఒక్క పురుగైనా లేకుండా బందిపోటు లందర్నీ మట్టిపాలు గావించాడు.

ఈ విషయం తెలంపుకు రాగా నాగమనీడు ప్రభువు రామన్న మంత్రికి ఆహ్వానమూ, అందలమూ పంపించాడు. దేవరకోట కోటలోకి వెళ్ళిన రామన్న మంత్రిని, రాయసం అడివి మాచన్నగారు సగౌరవంగా, సింహాసనాసీనుడై కొలువు తీర్చియున్న శ్రీమంతు నాగమనీడు ప్రభువులంవారి సభలో సమస్థాన ప్రవేశింప జేసెను. నాగమనీడు ప్రభువు

లేచినాడు. సభికు లందరూ లేచినారు నాగమనీడు రామన్న మంత్రికి నమస్కరించి ఆసనము చూపించి రామన్న మంత్రి ఆసీనుడు కాగానే, తాను సింహాసన మధివసించి ''ఏమండీ! అయ్యవారూ! తమ యింటిలో అందరూ క్షేమంగా వున్నారని తలుస్తాను'' అని ప్రశ్నించినారు.

రామన్న మంత్రి:— శ్రీ నాగేశ్వరస్వామి కరుణవల్ల, ప్రభువులవారి కటాక్షంవల్ల అందరూ క్షేమంగా ఉన్నామండి.

ప్రభువు:— రఘునాధరాయలు మహారాజులుంగారి ఆజ్ఞప్రకారం మేము సైన్యం తీసుకొని తంజావూరు వెళ్ళుతున్నాము. మా సైన్యం నడుపుతూ మాకు కుడిచేయిగా ఉండడానికి మీరు మాతో తంజావూరు రావాలని ఆశిస్తున్నాము.

రామ:- ఏలినవారి నమ్మకానికి కృతజ్ఞుణ్ణి. పంట పండించుకునే యీ నిరుపేద పారుడు సైన్యాలు నడపడంలో తమకు ఏమాత్రం సహాయంగా ఉండలేడని నమ్ముతున్నాను.

అడవి మాచన్న మంత్రి:- రామన్న మంత్రిగారూ! కర్తవ్యంలో దక్షత చూపగలవాడే కదనరంగంలో గండర గండడై ముందుకు నడవగలడు. తమరు ఏలినవారు కానుకనిచ్చే తాంబూలం పరిగ్రహించాలని మనవి చేస్తున్నాను.

రామ:- నేను పెద్దవాడ్నయ్యాను. మాచన్న మంత్రి గారూ! నే నింటి దగ్గర కృష్ణా - రామా అంటూ నాగే

శ్వరస్వామివారిని భజిస్తూ ఉండవలెను. మా పెద్ద అబ్బాయి యుద్ధంఅంటే చాలా కుతూహల పడుతున్నాడు. సహాయదళ వాయిగా కాకపోయినా చిన్న చమూపతిగానన్నా తీసుకొని వెళ్ళవచ్చును. దళనాయకుడుగా ఉండడానికి నిజమయిన ప్రజ్ఞానిధి యతడేనని మనవి చేస్తున్నాను.

జగ్గన్న దళవాయిగా శుభముహూర్తంలో నాగమ నీడులం వారి చేత అభిషేకింపబడ్డాడు. నాల్గువేల కాల్బ లంతో నూఱు ఆశ్వికదళంతో 10 ఏనుగులతో దేవరకోట సంస్థానాధిపతిన్నీ శ్రీమంతుడును అయిన నాగమనీడు ప్రభువు, మల్లేపద్ది సింగమరెడ్డి, చలసాని అచ్యుతరామనీడు, కంఠంనేని వాసుకేశ్వరనీడు, వేములపల్లి దుర్గారాయలు, ఆరజా పిన్నమనాయకుడు, తలుపుల గంద్రయ్యనాయకుడు గండు శోభనాద్రిరెడ్డి, నెనుసు బ్రహ్మన్ననాయకుడు, కోట భైరవన్న, మన్నీలుగ, చమూపతులుగ, అశ్వదళవాయి లుగ, గజయూధ నాయకులుగ కూడరా కడలిపురం వేంచేసినారు.

మంచి ముహూర్తం చూసి శ్రీమంతు నాగమనీడు ప్రభువు మహాక్షేత్రమయిన కడలిపురంలో వేంచేసియున్న కులదేవుడైన శ్రీ దుర్గానాగేశ్వరస్వామివారి కడకుపోయి బ్రహ్మావాసుకి, తక్షక, కర్కోటకాది పవిత్ర కృష్ణోదకాల కృతావగాహులై స్వామివారికి మహాన్యాసపూర్వకమైన

యేకాదశ రుద్రాభిషేకములు చేయించినారు. సహస్ర నారి కేళాభిషేకములు, బంగారుకలశాల కొలదీ పంచామృతాభిషేకాలు జరిగినవి. జ్యేష్ఠ శుద్ధ పంచమి గురువారంనాడు నాగమనీడు ప్రభువులు నాగేశ్వరస్వామివారి యెదుట విజయ చిహ్నముగ అఖండమును వెలిగించి శుక్రవారంనాడు దుర్గామ్మవారికి సహస్రనామ కుంకుమార్చన చేసి శు॥ యేకాదశి బుధవారంనాడు సర్వసైన్యాలతో కదలి శివగంగలో వేంచేసి యున్న కులదేవత యయిన మహిషాసురమర్దనిని సర్వదేవతలతో గూడ కొలిచి చక్రవర్తి వరాహాలాంఛన పతాకము ఎత్తించి విజయ ఐరావతనామ మత్తగజముల నెక్కి తంజావూరు చేర వెడలినారు.

౫

తన సైన్యానికి తానే ముఖ్య సైన్యాధికారై నడుపు కుంటూ వెళ్ళిన నాగమనీడు ప్రభువుకి ముఖ్య దళవాయిగా జగ్గన్న మంత్రి ధనుస్సులు, యీటెలు, అమ్ములు, శూలాలు మొదలయిన ఆయుధాలతో ఒక మత్తగజాన్ని ఎక్కి నాగమనీడు ప్రభుని కుడిసైపున నడుస్తూ సైన్యాన్ని సర్వవిధాలా కనిపెట్టుచూ తాను ఇదే ప్రథమపర్యాయం చూసే దేశాన్ని గమనిస్తూ సైన్యాల్ని సింహాపురం దగ్గర పెన్న దాటించి భగవంతు నర్చించి తిరుపతి చేరుకొన్నారు. తిరుపతిలో నాగమనీడు ప్రభువు వెంకటేశ్వరస్వామివారి దర్శనం

చేసి పూజలు చేయించి ముడుపులు చెల్లించి స్వామికడ శలవు దీసుకొని కతిపయ దినాల్లో తంజావూరు చేరుకొన్నారు.

జగ్గన్న హృదయం పరిపరివిధాల పోతున్నది, మనుష్యుల రక్తాలు ప్రవాహాలు కట్టడం, దేశాలు నాశనం అవడం, మనుష్యులు నిర్మించుకొనే ఊహాసధాలు నాశనం గావడం - మనుష్యులలో దైవత్వమూ రాక్షసత్వమూ ఉంది కాబోలు, రాజ్యాలు వస్తున్నవి రాజ్యాలు పోతున్నవి. మహారాజులు సింహాసనాలు ఎక్కారు. దేదీప్యమానంగా వెలిగారు. తెర వెనక మాయమయ్యారు. మతకర్తలు సకల శాస్త్రవేత్తలు, వేదాంతులు, మహాకవులు, సంగీత కళానిధులు అందరూ వచ్చి తమతమ విధులను నిర్వర్తిస్తూ అలా అలా నడిచి కాలంలో కలిసిపోయారు.

వీరి రాకగాని పోక గాని యీ అనంత విశ్వానికి అవసరమున్నదా అని జగ్గన్న అనుకొన్నాడు. కీర్తి ప్రతిష్ఠలు కొంతకాలం నిల్వ వచ్చునుగాక యీ విశ్వవిశ్వాలలో కోట్ల కోట్ల అంశాంశమైన కీర్తిగాని ప్రతిష్ఠగాని తాను చేస్తున్నానని విర్రవీగే కర్మగాని యేపాటివి? రాజుల చరిత్రలు దండకవులలో, అభ్యుదయ రచనలలో కవులచే గానం చేయబడుగాక. కవులయొక్క రసవత్తర ఘట్టాలు, తీయని లోతైన భావాలలో రూపం పొందుగాక. ఈ విశ్వంలో వీని పరిణామము ఎటువంటిది? గంటము నడపడంలో తమకు సవ్యసాచిత్వం ఉండుగాక. తన గంటం వాడి మొనమంచి కావ్య

రస ప్రవాహాలు సుడులు కట్టుకొని పోయినవి కాక! అవి తాటాకులలో ఉన్నవి. ప్రతిఅక్షరము క్షరము కానిదా? క్షరముకాని ఆ అక్షరాలను తన హృదయంలో మోసే తాళపత్రం దివ్యశక్తి స్వరూపమా?

ఈ లాంటి ఆలోచనలతో జగ్గన్న తంజావూరిలో తమ కేర్పరిచిన విడుదులలో బసచేసినారు. బృహదీశ్వరుని, బృహన్నాయకిని అర్చించినారు. భోజకృష్ణదేవరాయల అప రావతారమైన శ్రీ రఘునాథ రాయలమహారాజు కొలువులో ఆంధ్రసామ్రాజ్య మహోద్భుతము కన్నులార కనుగొన్నాడు.

గొప్ప వ్రాయసగాడైన జగ్గన్నమంత్రి, మహారాజు తనకోటలో నిర్మించిన సరస్వతీ మందిరానికి యాత్ర చేసి నాడు. దారు దంత పేటికలలో సంస్కృతాంధ్ర ద్రావిడ కర్ణాటక గ్రంథాలు వేలకొలదియున్నవి. పూర్వగ్రంథాలు, ఆధునిక గ్రంథాలు అనేక రకాలయిన వ్రాతలలో తాటా కుల మీద విన్యాసమై ఉన్నవి. సరస్వతీమందిరము గ్రంథ రత్న భాండాగారమే గాదు, అనేక దివ్యత్వాలు సదా ప్రత్య క్షమై సభ తీర్చియున్న పావనభూమి యది. కర్కశులై రాక్షసత్వము వహించగల్గిన మనుష్యులు తమ దివ్యత్వం లోంచే గ్రంథాలు వ్రాయగల్గి నారుగాబోలు! మనుష్యునిలో దివ్యత్వం ఏ అజ్ఞా చక్రంలోనో దాగి ఉంటుందా?

జగ్గన్న మంత్రి ఇంటి దగ్గర, పూజా పీఠంమీద వున్న తన గంటాన్ని తలుచుకొన్నాడు. తనకు గ్రంథాల్ని చూపిస్తూన్న గ్రంథాలయాధిపతిని "స్వామీ! శ్రీ రఘునాథ భూపాలుడు రచించిన గ్రంథాలు ఒక్కసారి నాకు చూపించగలరా?" అని ప్రశ్నించినాడు "ఆ పెద్దపెట్టెలో వున్న దంతపు పేటికలో మహారాజు రచించిన రామాయణ గ్రంథమున్నది. ఆ రజత పేటికలోనున్న పుస్తకము రఘునాధ మహారాజు కృతమైన వాల్మీకి చరిత్రము ప్రభువులు ఇప్పుడు మహాభారత తాత్పర్యసంగ్రహము రచిస్తున్నారు. ఈ పెద్ద పెట్టెలోనున్న దంతపేటికలలోని గ్రంథాలన్నీ రఘునాధ ప్రభువులవారికి అంకితములిచ్చినవి. అది విజయవిలాసము. అది అలంకార రత్నాకరము. ఇది సాహిత్య రత్నాకరము. యజ్ఞనారాయణదీక్షిత మహాకవి రచించినది.

జగ్గన్న:— "రామభద్రాంబికాదేవి అద్భుతమైన కావ్యాన్ని సృష్టిస్తున్నారని వినికిడి."

"రఘునాథాభ్యుదయః మను మహాకావ్యాన్ని ఆమె రచియిస్తున్నది. శ్లోకస్వరూపాన అమృతమే రూపెత్తిన రస వత్తర మయిన కావ్యం సుమాండి అది."

"ఔను, ఆమె యశము, కృష్ణాగోదావరీ తీరాలవరకు వ్యాపించింది.

౯

శ్రీ రఘునాథమహారాజు సైన్యాల జైత్రయాత్ర సాగించి ఆషాఢ శుద్ధ పంచమినాడు తోపూరునందు ఆంధ్ర

సామ్రాజ్యం విచ్ఛిన్నం చేయదల్చుకొన్న గొబ్బూరి జగ్గరాయలతో తలపడి, పమినాడాతనిని యుద్ధంలో సబంధువంగా సమయించినవి, మహాసైన్యం వ్యూహాన నడపుటందు, యుద్ధమునందు అతిరథుడయిన రఘునాథరాయలు, ధర్మరాజు తన సహోదరుల సహాయం పొందినట్లు, నాగమనీడు, యాచమనాయుడు మొదలయిన మహావీరుల సహాయముతో శత్రు సేనలను నుగ్గాడి విజయలక్ష్మీకంఠమునందు పరిగ్రహణ పుష్పమాల వైచినాడు.

ఆ యుద్ధంలో శ్రీమంతు నాగమనీడు ప్రభువున్న ఆతని దళవాయి జగ్గన్నమంత్రియున్ను చూపించిన పరాక్రమము ప్రభువయిన రఘునాథరాయలు నిండు సభలో మెచ్చుకొన్నాడు. రఘునాథరాయని సచివులలో ఒకరయిన చెంగల్వాల ప్రకాశకవిమంత్రి (విజయరాఘవ నాయక వంశావళి కావ్యము రచించిన చెంగల్వాల కాళకవి జ్ఞాతి దగ్గర) జగ్గన్న మంత్రి ప్రతిభకు, పాండిత్యానికి, సేనల్ని నడిపే బంటుతనంలో ఆతని ప్రజ్ఞకు యెంతో మెచ్చుకొని, నీలాంబుజలోచనీదేవి లా వెలుగు తన పుత్రికను పత్నిగా స్వీకరించవలసినదని నాగమనీని ప్రభువుద్వారా సందేశము పంపెను.

నాగమనీడు ప్రభువు రఘునాథ భూపాలుడు తనపై చూపిన ఆదరాభిమానాలకెంతో సంతోషించి 'సమరవ్యూహనిర్వచన', 'పరగండ భైరవ' అను బిరుదాలను భక్తితో స్వీకరించి జగ్గన్న మంత్రికి తన ఆస్థానంలో మంత్రిత్వ పదవిని మహారాజు సమక్షంలోనే అర్పించినాడు. కడలి పురాన్నుండి రామన్న మంత్రి సకుటుంబముగ తంజావూరు వేంచేసినాడు.

జగ్గన్న మంత్రి వివాహం అతి వైభవంగా జరిగింది. ప్రభువుతో, బంధువులతో, భార్యతో, భార్య బంధువులతో జగ్గన్నమంత్రి దేవరకోట వచ్చి చేరినాడు. దేవరకోటలోను కడలిపురంలోను అనేక మహోత్సవాలు జరిగినవి.

వ్యవసాయం చేసుకుంటూ, కృష్ణవేణీ తీర ప్రదేశాల ఆనందంతో విహరిస్తూ, రాజకార్యాలు నిర్వర్తిస్తూ జగ్గన్న మంత్రి తన గంటాన్ని మళ్ళీ చేతపట్టినాడు. 'సత్యభామా విజయ'మను సంస్కృత కావ్యాన్ని, 'నాగమనీడు ప్రభు విజయ'మను తెలుగు కావ్యాన్ని ప్రారంభించి జగ్గన్న రెండు నెలలలో పూర్తి చేసి ప్రభువున కంకిత మిచ్చినాడు. అంకిత మహోత్సవము కోటలో అఖండంగా జరిగింది, రఘునాథ సరస్వతీమందిరము దర్శించిన నాగమనీడు ప్రభువు పెన్నిధి యైన జగ్గన్నమంత్రి తనకు బాసటగ నుండగా ఏమి కొదువ యని దేవరకోటలోను సరస్వతీ మందిర మొకటి నిర్మించ దలచుకొన్నారు. జగ్గన్నమంత్రి గంటం లోంచి ప్రవహించి వచ్చిన పూర్వకవుల గ్రంథాలు రామన్నమంత్రి, జగ్గన్న మంత్రి శిష్యులైన యనేకులు వ్రాసియిచ్చిన తాళపత్ర గ్రంథాలు ఆ మందిరంలో వెలిగిపోయినవి. కృష్ణానది నవ్వు కొనుచు ఉత్తరవాహినియై ప్రవహించి సముద్రుని చేరు కొన్నది.

~~~
~~~

## 6) శ్రీ రావూరి భరద్వాజ

జననం:- 1926. రచనా ప్రారంభం 1944. భరద్వాజగారు స్పష్టమైన బలమైన అభివ్యక్తిగల కథకులు. వీరు తన ముందు తరం వారినుంచి ఎక్కువగా చలంనుండి ఎన్నో క్రొత్త పుంతలను, కథాశైలులను, గ్రహింపుచేసుకొని అసంఖ్యాకంగా కథలు వ్రాశారు. వీరి కథలు ఇప్పటికి 40 సంపుటాలుగా వెలువడినాయి. దాదాపు 80 రేడియో నాటికలూ, రూపకాలు ఉన్నాయి. వీరి కథల్లో త్రినేత్రుడు, నర(క)లోకం, ఆహుతి, చిత్రగ్రహం మొదలైన కథలు విశేషంగా పాఠకుల మన్ననలు పొందినాయి. ఉత్తమ కథా రచనకు మూడు బంగారు పతకాలూ, ఒక రజతపతకం బహుమానంగా పొందారు. ప్రస్తుతం ఆకాశవాణి హైదరాబాదు కేంద్రంలో గ్రామస్థుల విభాగంలో పని చేస్తున్నారు.

# కథ

ఇది చరిత్రవంటి జానపదకథ: కథాక్రమం, సన్నివేశాలూ అన్నీ చారిత్రక సహజాలూ, సంభావ్యాలమీదుగా ఉత్ప్రేక్షింపబడి అల్లబడినవి. వాసవుడు అంతఃపురంలోనికి ప్రవేశించడానికి ముందున్న కథ యథావస్తూ వర్ణనాత్మకమైంది. తరువాతి కథ యుక్తిప్రధానమైంది. ఆరంభంలో కథ సాఫీగా నడిచి, తరువాత హృదయాన్ని ద్రవింపజేసి తిరిగి అవసానంలో ఆసక్తికి దోవతీస్తుంది. అంతఃపురంలో నాగిని ఉండటం కథ కూర్పుకు సహజమైన కల్పన. తండ్రి మరణం ప్రయత్నపూర్వకంగా కథకుపయోగించుకున్న క్రొత్త ఉద్దీపన. ఈకథ, చరిత్రాభాస అయినప్పటికీ కథాకథన దృష్టిలో తిన్నని కథ. బానిసల కడగండ్ల చిత్రణా, వాసవుని అంతఃపుర ప్రవేశం, న్యాయవిచారణ మొదలైనవి భారతీయేతరవాతావరణంనుంచి అలాంటి అనుభవాలనుంచి పుట్టి అవన్నీ కథగా పోహాళింపబడినవి. కాబట్టి ఇది బాహిరంగా జానపద కథ

తత్వతః యుక్తిప్రధానమైన కథ.



భారత పురాతత్వ శాఖవారు, పూర్వ భారతసంస్కృతి పునరుద్ధరణ నిమిత్తం త్రవ్వకాలు ప్రారంభించిన సంగతి లోకవిదితం. కేంద్ర ప్రభుత్వానుమతితో ఇటీవల రాజస్త్రా స్థానంలో జరుపబడిన పరిశోధనలో, విచిత్రమైన ఎన్నో విషయాలు, బైటపడినట్లు పత్రికా పాఠకులందరూ ఎరుగుదురు. పాడుపడిన ప్రాంతంగా, ఇంతవరకూ పరిగణింపబడుతూ వచ్చిన స్థలాన్ని, పైశాఖవారు త్రవ్వగా, అకస్మాత్తొక మహా నగరం బయటపడ్డది. వీధులు తీర్చి దిద్దినట్లున్నాయి. శిల్ప శోభతో పింపెసలారే భవన శిథిలములు గోచరించాయి. ప్రజలు ఎంతో నాగరికతతో జీవించినట్లు, ఎన్నో చిహ్నాలు దొరికాయి. అయితే అవన్నీ బూడిదలో కప్పబడిఉన్నాయి. వీధులనిండా, బూడిద, బొగ్గు రేణువులు విస్తారంగా ఉన్నాయి నగరం; ఆ మూలాగ్రం అగ్నికి ఆహుతయి పోయినట్లు భావింపబడుతున్నది. లక్షలాది మానవాస్థికలు నగర మంతటా విరజిమ్మబడి ఉన్నాయి. ఒకచోట ఆయుధశాల, దానికల్లంత దూరంలో ధనాగారము, రాచనగరు ఉన్నట్లు స్పష్టంగా గోచరిస్తున్నది. ఆ నాటి రాజులు (ముఖ్యం, ఆ నగరమేలినరాజు) దయార్ద్రచిత్తు డనడానికి, శాసనాలు చాలా ఆధారాల నిస్తున్నాయి. మరికొన్ని తామ్రశాసనాలలో, అవమానకరమైన భాష ఉపయోగింపబడ్డది. కొన్నిటిలో బెదరింపులు, యుద్ధాల కాహ్వానము మొదలైనవి ఉన్నాయి.

ఏది ఏమైనా ఆ నగరంచుట్టూ ఒక బ్రహ్మాండమైన 'కథ' అల్లుకొని ఉన్నదనడం సుస్పష్టం. నగరం అగ్నిదగ్ధం కావడాన్ని బట్టి, చివరి దశలో, అది శత్రు పీడితమై ఉంటుందని ఊహిగా చెప్పవచ్చు. ఐతే ఆ రాజెవరు? అతని రాజ్యమేది? అతని శత్రువు లెవరు? ఏ కారణంచేత అలా శత్రుత్వం వచ్చింది. ఇత్యాది సందేహాలు సమాధానాలకు అపేక్షిస్తున్నాయి.

ప్రతి కార్యానికీ వెనుక, ఒక్కొ కారణం ఉంటుంది. కారణ రహితమైన కార్యం ఉండే అవకాశం లేదు. అలాగే ఒక్కొక్క రాజ్యోద్భవానికి, ఒక్కొక్క కారణముంటుంది. ఉండి తీరాలి. ఆంగ్లేయ ప్రభుత్వం మనలను పాలించడానికి కారణం, మహమ్మదీయరాజులు. మహమ్మదీయులు మన దేశంలో కాలూనడానికి కారణం, ఆనాటి హిందూరాజుల లోని అనైక్యత. అలాగే ఈ భస్మనగరానికి కూడా, వెనుక చాలా కారణాలు ఉండి ఉండాలి! అవేమిటన్న ప్రశ్నకు సమాధానం వెదకడంలోనే, ఆ చరిత్రకూడా బైటపడుతుంది.

లభించిన నాణాలనుబట్టి చూస్తే ఆ నగరం పేరు 'జయంతి' అని తెలుస్తున్నది. లిపి సంస్కృతమైనప్పటికీ, ద్రవిడ ప్రభావం, భాషలో కొట్టవచ్చినట్లు కనిపిస్తున్నది. నాణెమునకు ఒకవైపున 'గోష్ఠలి' బొమ్మ చెక్కబడి ఉన్నది.

గొడ్డలిని ఆయుధంగా ధరించిన రాజులు పూర్వ భారతంలో ఉన్న ఛాయలు లేవు. పురాణాలన్నిట్లో పరశురాముడు మొదటి వాడైనవాడు సరే! గొడ్డలి 'సారంగ' జాతివారి ఆయుధం. 'సారంగజాతి' బానిసజాతిగా, చరిత్ర ఒకటి రెండుచోట్ల మాత్రమే చెబుతున్నది" నాడు తప్ప మరొకరా ఆయుధాన్ని వాడారనటానికి నిదర్శనాలు లేవు. సారంగులు, ప్రాణ ప్రదంగా గొడ్డలిని చూసుకొనే వాగినదం నిర్వివాదం. అయితే ఆజాతి పెంపుదలలేక నశించి పోయినట్లూ, ఆజాతి అభివృద్ధికోసం (!)ఆనాటి పాలకులు చేసిన ప్రయత్నాలు ఫలించనట్లూ, చరిత్ర నొక్కివక్కాణిస్తున్నది. కాని సారంగ జాతి రాజ్యా లేలినట్లు ఎక్కడా లేదు. ఈ పరిశోధనా ఫలంగా చరిత్రను చక్కదిద్దవలసిన ఆవశ్యకత ఏర్పడ్డది. బానిస జాతి గూడా కొంతకాలం రాజ్యమేలినట్లు సవరించాలి.

మంచిదేగానీ, ఇందువల్ల మరికొన్ని క్రొత్త సమస్యలు ఉత్పన్నమౌతున్నాయి. మృగాలవలె అడవులలో సంచరించే, ఈ జాతి' నాగరికతను ఎప్పుడలవరచుకొన్నది? రాజ్యాన్నెలా సంపాదించింది? బానిసజాతి పాలకస్థాయిలో కొస్తుంటే, ఇతర పాలకులు ఎలా సహించారు? అలా సహించగలిగేలా వారిని ఏయే శక్తులు ప్రేరేపించాయి? చివరకిలా భస్మరాశి కావలసిన గ్రహచారమేమి సంభవించింది? ఎవరు కారణం? సారంగ జాతి, ఎంతకాలం రాజ్యమేలింది. — ఇవీ ప్రశ్నలు.

ప్రత్యస్త్రాలు లభించడం, అసంభవ మనుకొన్న ఈ ప్రశ్నలకు, అదృష్టవశాత్తూ పుష్కలమైన వివరాలతో సహా లభించాయి. ఒక మహత్తరమైన చరిత్ర — కాలం అత్యంత జాగ్రత్తతో కాపాడుతూ వచ్చిన చరిత్ర — బైట పడ్డది. ప్రతీ రాజవంశానికీ, దాని చరిత్ర ఉన్నట్టే, ఈ బానిస రాజవంశానికీ ఉన్నది. ఈ వంశవృక్షము, వంశీయుల గుణగణాలు, దానాది పుణ్యకార్యాల పట్టిక, రాజ్యంప్రాప్తించిన విధానము,—ఇంకా ఇలాంటివే లిఖించబడిన వ్రాతప్రతాలు,(స్థూలంగా ఇటుక రాళ్ళనవచ్చు. అయితే వాటికీ, ఇటుకలకూ భేదమున్నది, ఈ పత్రాలు ఇటుకలంత మందంగా ఉండవు. నలుచగా, ఇంకా పొడవు, వెడల్పు కలిగి, వ్రాతకు అనుకూలంగా ఉంటాయి.) రహస్య మందిరంగా గుర్తింపబడిన చోట దొరికాయి. వాటి ఆధారంతో సారంగ జాతి చరిత్రను వ్రాయటానికి ప్రయత్నం జరిగింది.

# 1

అలసి పోయిన సాయంత్రం అందంగా సాగిలి బడ్డది. మబ్బులు రోషంతో ఎర్రబడ్డాయి. పల్లె పల్లెలంతా బావురు మంటున్నది. వృద్ధులు, రోగ పీడితులు, హృదయ విదారకంగా రోదిస్తున్నారు. పల్లె ఒక మూలనుండి దగ్ధమయి పోతున్నది. ఆర్పే ప్రయత్నాలేమీ లేవు. చాలా గుడిసెలు పెరికి వేయబడి ఉన్నాయి. కొందరు మంటలలో కాలిపోతు

న్నారు. మరి కొందరు మంటలనుండి వెలికివచ్చి, కాలిన శరీర భాగాలు పెట్టే బాధకు అల్లాడి పోతున్నారు. క్రమంగా, అజ్ఞానంలాంటి చీకటి, తల విరియబోసుకొంటూ, క్రమ్ము కొస్తున్నది. నాలుగు వైపులా భయంతో చూస్తూ చెవులు రిక్కించి వింటూ. కొందరు చాటుమాటున పల్లెను సమీ పిస్తున్నారు.

వాసవుడు కదలలేదు. మెదలలేదు. పులకలేదు. పలక లేదు. చెట్టునానుకొని, అదే పనిగా దగ్ధమౌతున్న పల్లెకేసీ, సైనికులు వెళ్ళిన దిక్కుకేసీ చూస్తున్నాడు. అతని కన్నులు ఎర్రబడ్డాయి. పెదవులు వణకుతున్నాయి. పిడికిళ్ళు మూతలు పడుతూ, తిరిగి విచ్చుకొంటున్నాయి, కూలిపోయిన తన గుడిసెవేపు చూశాడు. గుండెలు పగిలిపోయ్యాయి. మధ్యా హ్నం వరకూ. ఆనందం పొంగిపొరలిన ఆ యింట్లో, ఇప్పుడు పీనుగులున్నాయి. తనను అమితంగా ప్రేమించే తల్లి, చచ్చి పడి ఉన్నది. తండ్రి 'కురురు' రాజ్యానికి బానిసగా పట్టుకు పోబడ్డాడు,

తండ్రి జ్ఞప్తికి, రావడంతో వాసవుడు స్థిరంగా నిల బడలేకపోయాడు. కాళ్ళు జవచచ్చిపోయాయి. కుప్పకూలి పోయాడు. రెండు కళ్ళూ మూసుకొన్నాడు. అయినా తండ్రి రూపం స్మృతికి వచ్చింది. ఆజానుబాహువైన అతని ఆకారం. సింహాన్నైనా నిరాయుధంగా చంపే అతని బలశౌర్యాలు,

అన్నిటినీ మించి, తనను బుజ్జగించేటప్పటి అప్యాయత వాస వుణ్ణి విచలితం చేశాయి. విచారాన్ని ఆపుకోలేక బావురు మని ఏడ్చాడు. ఎటువంటి చెట్టుకొమ్మనైనా, అవలీలగా విరిచే తన తండ్రి చేతులకు, తను చూస్తుండగానే సంకెళ్లు వేయబడ్డాయి ... ఆ దృశ్యం — తలుచుకొంటే - ఎంత ఘోరం!! కురుకురు సైనికులు వస్తున్నారని తెలియగానే, తననూ, చెల్లినీ, తండ్రి దాచి పెట్టాడు. తనుగూడా అప్పుడే తప్పుకోవచ్చు. కాని, పల్లెను రక్షించాలని, అందరనూ దాచే ప్రయత్నం చేయడంతో, అంతా భగ్నమయింది. సైనికులు నిప్పులు క్రక్కుతూ వచ్చారు. పల్లెను చుట్టుముట్టారు. స్త్రీ పురుష వివక్షత లేకుండా, ఆరోగ్యవంతుల నందరినీ పట్టుకొన్నారు. స్త్రీలను వివస్త్రలనుచేసి, చుట్టూచేరి, సంతోష ధ్వానాలు చేశారు. వినోదార్థం కొంపలకు నిప్పుముట్టించారు. మంటలు కోరలుసాచి బుసలు కొడుతూంటే, చిరునవ్వుతో, శిశువులను, వృద్ధులను, మంటలోకి విసరి, వారు గుండెలు ద్రవించేలా కేకలు పెడుతుంటే. విని, ఆనందించారు. బయటికి రావాలని ప్రయత్నించిన వారిని, బల్లేలకు గుచ్చి, నిప్పుల్లోకి విసిరారు.

వాసవుడు మెల్లిగా లేచాడు. దోవకడ్డంగా ఉన్న వాటిని తప్పించుకుంటూ తన గుడిసెదగ్గర కొచ్చాడు. ఒక్కొక్క కొమ్మను తొలగించి వేశాడు. తనతల్లి కూడా శవాకృతిలో పడి ఉంది. తల తిరిగిపోయింది. కొన్ని క్షణాల వరకు అతడు స్మృతికిరా లేదు.

'భగవంతుడా!' ఈ నరకం నుండి ఎప్పుడు విముక్తి? అనుకొన్నాడు.

అప్పటికప్పుడే, మిగిలినవారు 'సురక్షిత' ప్రదేశానికి వెళ్ళే ప్రయత్నాలలో ఉన్నారు. వాసవుని కక్కడనుండి కదల బుద్ధిగాలేదు. సురక్షిత ప్రదేశమంటూ ఎక్కడ ఉన్నది? తన జాతి ఎక్కడ ఉన్నా ఈ పాట్లు తప్పవు. ఇక్కడ కురుదు సైనికులు, ఇంకొకచోట ఇంకొక సైనికులు. ఎక్కడైనా తమకీ వేటాడబడటం తప్పదు. అయినప్పుడు ఈ ప్రయత్నం అనవసరమే! కానీ ప్రాణం మధురాతి మధురమయింది గదా! చేజేతులా దానిని త్యజించటానికి ఎవరు మాత్రం ఎలా అంగీకరిస్తారు?

అరణ్యంలో ఎక్కడో చంద్రుడుదయించాడు. తూరుపు దిక్కు ఎర్రవారింది. వెన్నెల చారలు చెట్లమీాదినించి ప్రాకు తున్నాయి. మంటలు చల్లారాయి. నిప్పులు – భగభగ మంటూ గాలికి చెదిరి, దూరంగా పడుతున్నాయి. అడవిలో మృగాల అరపులు, నిర్మానుష్యమైన పల్లె, ఎదుట తల్లిశవం, ప్రక్కనే, గుండెలవిసి కూర్చున్న తోబుట్టువు; వాసవుడు పిచ్చివాడై పోయాడు. అతని మనస్సు పరిపరివిధాల పరి భ్రమిస్తున్నది.

ఈ ఘోర విపత్తుకు, తన జాతి ఎందుకు గురికావలసి వస్తున్నది? సుఖంగా బ్రతికే హక్కు తమకెందుకు లేక పోవాలి? తమ జాతివారు, క్రూరమృగాలకన్న హీనంగా వేటాడబడట మెందుకు? తాము దుర్బలులు కాదే! ఎందుకు ఎదురు తిరుగలేక పోతున్నారు? పశువులకన్న అధ్వాన్నంగా, తనజాతి అమ్మ బడుతున్నది. కొనబడుతున్నది. తమకు తమ జీవితంమీాదే నమ్మకంలేదు. తాము ఎప్పుడు ఎవరికైనా అమ్మబడవచ్చు, తామెంతకాలం జీవించేదీ, భగవంతుని చేతిలో లేదు. ఈ 'నాగరికుల' చేతుల్లో ఉన్నది బలంఉడిగిన దాకా చాకిరీ చేయించుకొని, పనికి రానప్పుడు, తమ జాతివారు చంపబడుతున్నారు. లేదా, ఏ చక్రవర్తిగారి వినో దార్థమో, కాల్చివేయ బడుతున్నారు. తమను, ఏమిచేయు టాసికైనా, ఈ 'నాగరికులకు' హక్కున్నది. తమ పురుషులు పశువులవలె చాకిరీ చేస్తున్నారు. స్త్రీలు 'నాగరికుల' కామాన్ని తీర్చే వస్తువు లవుతున్నారు. ఏ స్త్రీనైనా నాగ రికులు ఉపయోగించుకోవచ్చు. ఎందరినైనా ఉపయోగించు కోవచ్చు. తప్పులేదు. తప్పన్నవాడికి శిరచ్ఛేదం!

ఇలా ఎంతకాలం తమ జాతి అనుభవించాలి? నీటి నుండి ఎప్పటికి విముక్తి?

వాసవుడు వేదనతో తపించిపోయాడు. రక్తం కుతకుత లాడింది. లేచి నిలబడ్డాడు. వాసవుని చెల్లెలు భయంతో అన్నవైపు చూసింది.

(దీని తరువాత మూడు ఇటుకలు పగిలి ముక్కలయి పోయాయి. ముక్కలను ఒకచోట జేర్చి చదవాలన్న ప్రయత్నం ఫలించలేదు. కారణం ఆ ఇటుకలమీద కొన్ని చోట్ల బెత్తికలు రాలి పోయాయి. అలా శిథిలమైన భాగాలలోని కథ ఏమిటో తెలియ లేదు. కథ తిరిగి ప్రారంభమయ్యేసరికి, వాసవుడు 'స్వర్ణపురి'లో ఉన్నాడు. అలా ఉండటానికి కారణం - ఆ చిదికిపోయిన భాగాల్లో ఉండి ఉంటుంది. ఈ లోపుగా వాసవుడు చేసిన పనులు, పన్నిన పన్నాగాలు, ఆలోచించిన ఆలోచనలు, మనకు లభించటం లేదు. సర్వసాధారణమైనదో, లేక అపూర్వమైనదో, ఒక సంఘటనగానీ, అనేక సంఘటనలుగానీ జరిగి వుంటాయి. ఆ సంఘటన [ల] కారణంతో వాసవుడు స్వర్ణపురి చేరి ఉంటాడని భావించటం తప్ప, మనకు కర్తవ్యం లేదు. దీని తాలూకు నిజానిజాలు మరొక చోట లభిస్తాయన్న ఆశగూడా లేదు. లభిస్తే - అంతకన్న కావలసిందిగూడా లేదు...)

## 2

ఆర్యులు భారత దేశంలో కాలుమోపి శతాబ్దాలు గడిచిపోయింది. అనేక కారణాల వలన వారు దేశపాలకులైనారు. కనీసం తమ బడితోత్తులను పాలకులుగా వుంచారు. ఉండేట్లు ప్రయత్నించారు. ఆ బలంతో తమ సంస్కృతిని, భారతం మీద పులిమారు. శాసనాలు చేయించారు, తద్వ్యతి

తిరేకులను ఘోరమైన శిక్షలకు పాల్పడ జేశారు. సమూలంగా నాశనం చేయాలని విశ్వ ప్రయత్నాలు చేశారు. అనేక చోట్ల, అనేక సందర్భాలలో, అనేక కారణాల వలన వారు విజయం పొందిన మాట నిజమే! అయినా 'అనార్య' సంప్రదాయాలు, సాహిత్య, సంస్కృతీత్యాదులు సమూలంగా నాశనం కాలేదు. విభిన్నమైన ఈ రెండు సంస్కృతుల మధ్యా, శతాబ్దాల తరబడి, తీవ్రాతి తీవ్రమైన సంఘర్షణ జరిగింది. ఒకదానిని మరొకటి నిర్జించవలెనని అపూర్వమైన ప్రయత్నాలు జరిగాయి. సంవత్సరాలు గడిచినా, ఏ ఒక్కదానికీ సంపూర్ణవిజయం లభించలేదు! కాల ప్రభావానికి, ఈ రెండు సంస్కృతులు తల ఒగ్గాయి. సంఘర్షణ సన్నగిల్లింది. వైషమ్యాలు సమసిపోయాయి. కొన్ని ముఖ్య సూత్రాలమీద, రెండింటికీ సమన్వయం కుదిరింది. అప్పటి నుండీ, ఇవి రెండూ భారతి జాతి అంతర్జీవితంలో కలిసి పోయాయి.

అందుకు ఉదాహరణగా స్వర్ణపురిలోని శివాలయం పేర్కొనవచ్చు. ఈ సంస్కృతీద్వయానికి, సమన్వయమే కుదరక పోయినట్లయితే, ఉత్తర భారతంలో – అందునా ఆర్యులు ప్రప్రథమంగా ప్రవేశించిన భాగంలో – ద్రావిడ జాతికి (అనార్య) చెందిన శైవాలయ ముండటం ఎలా సాధ్య పడుతుంది? తొలుదొల్త భక్తి ప్రపత్తుల దృష్ట్యా మహోత్స

వాలు ప్రారంభమైనప్పటికీ, కాలం గడిచినకొద్దీ వాటి ధ్యేయం మారజొచ్చింది. రాజులు, నియంతలై, నిరంకుశులై పాలించే కాలంలో, ఈ దేవతా ఉత్సవాలు, ఆయా రాజుల వినోద క్రీడలుగా, మారిపోయాయి. ప్రధానభాగమైన 'దేవుడు' అప్రధానమై, తదితర భోగవిలాసాదులు ప్రాముఖ్యత నందాయి.

ఉత్సవాలు ప్రారంభం కావటానికి రెండు రోజుల వ్యవధి ఉన్నది. అప్పటికే దేశదేశాల రాజులు, సామంతులు, దండనాయకులు, సచివులు న్యాయమూర్తులు స్వర్ణపురి నిండా బిలబిలలాడు తున్నారు. దేశదేశాల నుండి వణిక్ప్ర ముఖు లెందరోవచ్చి, అంగడులు తెరిచారు. ఉత్సవ వాతావరణం పట్టణాన్ని దట్టంగా క్రమ్ముకొన్నది. అంతటా ఆనందోత్సవాలు వెల్లి విరుస్తున్నాయి.

కానీ—

వీటన్నింటినీ సమకూర్చిన సారంగులు మాత్రం యథాతథంగా ఉన్నారు. ఇలాంటి పర్వదినాలలో సైతం - వారికైనందిన కార్యక్రమాలలో పీసమంత మార్పులేదు. ఆనాటి రాజులందరిలోకీ, కుకుర వంశస్థుడైన ఈ స్వర్ణపురి రాజు, మేటి. తదను గుణంగానే, అతని అజమాయిషీ క్రింద నాలుగువేలమంది సారంగ జాతీయులున్నారు. ఎంత ఎక్కువ మంది బానిసలుంటే, అంత ధనవంతుడుగా లెక్కింప

బడే ఆకాలంలో, తన బానిసల సంఖ్యను, ప్రతిక్షణమూ అభివృద్ధి పరచలాలని యశపాలుడు కోరడంలో తప్పులేదు. తనకున్న అనంత సంపద ప్రదర్శనంతో బాటు, ఈ బానిస సంపదనుకూడా ప్రదర్శించాలని యశపాలుడు తహతహలాడి పోతున్నాడు. ఈ సదవకాశం కోసం, అతను చాలా కాలం నుండి నిరీక్షిస్తున్నాడు. ఈనాటికి వచ్చింది. దీనిని సద్వినియోగం చేసుకోవలసిన బాధ్యత ఎంతైనా ఉన్నది గదా!

ఉత్సవాలను, మంగళకార్యంతో ప్రారంభించటం ఆనువాయితి. కానీ యశపాలుడీ సంవత్సరం, ఆ రివాజును మార్పించాడు. చాలామంది రాజులు, ప్రారంభోత్సవం బానిసల ప్రదర్శనంతో జరగాలని కోరారు. మరికొందరు పట్టుపట్టారు. యశపాలుడు కాదనలేదు. అందుకు కావలసిన ఏర్పాట్లు చూడమని మంత్రిని ఆదేశించాడు...

సాయంత్రం ప్రదర్శనస్థలి జనసమూహంతో నిండిపోయింది. ఉన్నత వర్గాలవారు, రాజవంశీయులకు, ఒకించుక దిగువగా ఆశీనులైనారు. నిగళబద్ధులైన సారంగులు రంగంలోకి ప్రవేశపెట్టబడ్డారు. వారి ప్రవేశంతో, జన సమూహంలో కలకలం రేగింది. ఆనందం వెల్లివిరిసింది. సంతోషధ్వానాలతో దిక్కులు పిక్కటిల్లాయి. కరతాళ ధ్వనులతో చెవులు దిబ్బడపడ్డాయి. వలయాకృతిగావున్న ప్రదర్శన స్థలిచుట్టూ సారంగులు తిరుగుతున్నప్పుడు (త్రిప్పబడుతున్నప్పుడు) ప్రేక్షకులలో

కొందరు గావుకేకలు పెట్టారు. కొందరు కాండ్రించి ఉమ్మారు. వినోదంకోసం మరికొందరు, రాళ్ళు రప్పలు విసిరారు. ప్రగాఢమైన తమోరాశి, ఘనీభవించి, మానవాకృతి దాల్చినట్లున్న సారంగులు రాజభటుల ఆజ్ఞ చొప్పున తిరిగి, ఆగారు. ఇంతటి బానిస సంపద తమ రాజుకున్నదని ప్రజ తెలుసుగదు. కోటి రాజులుగూడా ఊహించలేరు. ఈ దృశ్యాన్ని చూచి, వారు యశపాలుని అమితంగా అభినందించారు.

యశపాలుని ఆజ్ఞ మేరకు ప్రదర్శనం ఆపబడింది. బానిసలకు సంబంధించిన మరొక దృశ్యం మొదలెట్టబడింది. ఈ 'దృశ్యం' కొరకని గత పది రోజులుగా, బలాఢ్యులైన ఇద్దరు సారంగులు. అన్నపానీయాలు లేకుండా ఉంచబడ్డారు. వారు క్షుత్పిపాసలతో నకనకలాడి పోతుంటారు. రంగస్థలి మధ్యంలో, మూకుడులో తిండి, ముంతలో నీళ్లు ఉంచబడ్డాయి. బోనుల్లో ఉన్న ఇద్దరు సారంగులు రంగమధ్యంలోకి తీసుకురాబడ్డారు. రాజభటులు ఇద్దరినీ బోనులనుండి వెలికి తోలారు. అల్లంత దూరంలోనే, నీరు, తిండి, చూచిన ఆ యిద్దరు సారంగులూ, బోనునుండి వెలికి రాగానే నీటి మీదకు దూకారు. ఇద్దరూ పెనుగులాడటంతో, నీరుఒలికిపోయింది. వారి ముఖాలలో ఒకే ఒక క్షణం నిరాశారేఖ మెసలింది. మరుక్షణం, పరస్పర ద్వేషంతో, అసూయతో కుతకుతలాడి పోయారు. తిండికోసం ప్రయత్నించారు. పెనగు

లాడారు. కలియబడ్డారు. జన సమూహం అదరిపోయేలా బొబ్బలు పెట్టారు. తిండి మట్టిపాలయింది. అలా కావడానికి ప్రతీవాడు ఎదటివాడే కారణమని భావించి ఉండాలి. కోపంతో వారి కన్నులు, ఎర్రవారాయి. ముష్టియుద్ధానికి తలపడ్డారు. ఒకరినొకరు పడద్రోసుకొన్నారు గుద్దుకొన్నారు. మృగాలవలె రక్కు కున్నారు. ఒకడు రెండవవాడి కళ్లను వేళ్ళు గ్రుచ్చి ఊడలాగాడు. రెండవవాడు మొదటివాడి పీక కొరికాడు. కంఠం తెగిపోయింది. రక్తం చిమ్మికొట్టింది. ఇద్దరూ విలవిల లాడుతూ నేలకొరిగారు. కొన్ని నిమిషాలు, దారుణంగా తన్నుకొని, ఇద్దరు సారంగులూ చచ్చిపోయారు. రాజభటులు ఆ శవాలను ప్రక్కకు లాగారు.

ఈ దృశ్యం మామూలు ప్రేక్షకులకన్న, రాజవంశీయులకు అమితానందాన్నిచ్చింది. పుడిసెడు నీటికోసం, బొక్కెడు తిండికోసం, బానిసలు ప్రాణాలుగూడా విడుస్తారని, వారూహించలేదు. అలా ఎందుకు చేస్తారో వారికి బోధపడ లేదు.

మూడవ దృశ్యం రాజవంశీయులను గూడా విభ్రాంతులను జేసింది. రంగమధ్యంలో అగ్ని ప్రేల్చబడ్డది. మంటలు కోరలు చాస్తున్నాయి. నిప్పుకలు చెదరి పడుతున్నయి. ఆజానుబాహుడైన ఒక బానిస రంగంలోకి తీసుకు రాబడ్డాడు.

బలిష్ఠమైన దేహం, ఎండకు నిగనిగలాడుతున్నది. రాజభటులు కొరడాలతో బాదడంచేత శరీరంలో అక్కడక్కడ నిర్గించిన రక్తం కారుతున్నది. సారంగులకు నిప్పు అంటే తగనిభయం, ఈ సంగతి తెలిసే, ఆ ఆజాను బాహువు రావటానికి నిరాకరించి ఉండాలి. కాని అతని నిరాకరణ మెవరికి కావాలి? అతని నిరసనను లెక్కించే దెవరు? అతను – కనీసం – మనిషికూడా కాదు. ఓ అడవి జంతువు. బానిస! శుద్ధబానిస! !

రాజభటుడొకడు కట్టెలు కదిలించాడు. మంటలు రెచ్చిపోయాయి. మిగిలిన కొందరు, ఆ బానిసను, మంటల వైపు తోలారు. అతను వెళ్ళటం లేదు. తప్పుకొంటున్నాడు. భయంతో మంటచుట్టూ తిరుగుతున్నాడు. కేకలు పెడుతున్నాడు. ప్రేక్షకులను రక్షించమంటూ వేడుకొంటున్నాడు ! ఎంతచక్కని దృశ్యం ! ! రాజవర్గంవారు, ఈ బానిసపాట్లు చూడలేక, చూసి నవ్వలేక, సతమతమవుతున్నారు.

'వెధవ! నిప్పంటే అంత భయమెందుకో!'

అందరూ—ముఖ్యం—రాజవర్గంవారు, ఈదృశ్యాన్ని తనివితీరా చూశారన్న నమ్మకం రాజభటులకు కలగలేదు. ప్రతి క్షణమూ ప్రభువుల కన్నుల్లో, ఆజ్ఞను, అసంతృప్తిని, చూచే ఈభటులకు, ప్రభువుల కళ్ళల్లో, నేడు కూడా అసంతృప్తే గోచరించింది. బానిసను మంటల దాపులోనికి తోశారు. రెట్టింపు శక్తితో ఆ ఆకారం వెనక్కు వచ్చింది. రాజభటుల కెంత అవమానం ! ఒక బానిస తమ ఆజ్ఞను ఉల్లంఘించటమా ? నలుగురు రాజభటులు కొరడాలు తీసుకొన్నారు. బానిస వంటి మీది చర్మం ఊడి పోతున్నది.

రక్తం వరదలుగా కారిపోతున్నది. బానిస భయంకరంగా, బొబ్బరిస్తున్నాడు ప్రేక్షకులు కొందరు వాడి కేకలకు భయ పడ్డారు. ఒక రాజభటుడు. గురిచూచి ముఖంమీదికి కొరడా విసిరాడు. బానిస కుప్పలా కూలిపోయాడు. రెండు చేతులూ ముఖానికి కప్పుకొన్నాడు. తిరిగి, అదే చోట, దెబ్బ. మరొకటి, ఇంకొకటి, ఇంకొకటి...వ్రేళ్ళు విలిగిపోయాయి. చేతులు తీశాడు బానిస. ముఖం రక్తపు ముద్దలాగయింది. ఏది ముక్కో, ఏది కన్నో, తెలియడం లేదు. అంతా ఒకే ఒక మాంసపుముద్ద. రక్తంకారి కళ్ళు మూసుకు పోయాయి. బద్ధలైన వ్రేళ్ళతో రక్తం తుడుచు కొంటున్నాడు బానిస. అయినా, కళ్ళు తెరిపిళ్లు బడటంలేదు. ఏదో చూడాలన్న తహతహతో, తను వచ్చిన దిశవేపు తిరిగాడు. మరో దెబ్బ...చర్మం ప్రిదిలి ఎర్రనికండ తొంగి చూస్తున్నది. బానిస కేక వెయ్యలేదు. కళ్ళు గట్టిగా తుడుచు కొని మరొకసారి చూశాడు. ఏదో అస్పష్టంగా కనిపించింది. బిగ్గరగా ఏదో అన్నాడు. మరొకదెబ్బ...ఇంతవరకూ ఎలాగో ఓర్చుకున్నాడు, ఇక తను భరించలేడు. భయంకరమైన ఈ దెబ్బలకన్న... మరుక్షణంలో, బానిస నిప్పులలోకిదూకాడు. మంటలు అతన్ని పెనవేసుకొన్నాయి. కొన్ని నిమిషాలు, ఓ ఆకారం ఆ మంటల్లో గిజగిజ తన్నుకొన్నది; కట్టెలు చెల్లా చెదరయ్యాయి. మంట క్రమంగా ఆరిపోయింది. పొగ— దుర్వాసనతో—బానిస కాలిన వాసనతో, ఆవరణ అంతా నిండుతున్నది. నాటి కార్యక్రమం ముగిసింది. మహోత్స వాలకు ప్రారంభోత్సవం జరిగింది.

# 3

మిట్ట మధ్యాహ్నం. నాగరికులమీది బానిసలక్రోపంలా ఎండ మండిపోతున్నది. రావసగరు దాదాపు ప్రశాంతంగా ఉన్నవి. దాసీదాసజనం ఒక మూలచేరి విశ్రాంతి ననుభవిస్తున్నది. అప్పటివరకూ భర్తృదారిక 'జయంతి'కి సకలోపచారాలు చేసిన 'నాగిని' అలసిపోయిన శరీరాన్ని ఒకమూలకు చేర్చింది. ఇలా చేర్చగలనని, తను జీవించగలననీ, నాగిని నమ్మలేకపోయింది. నిన్న సాయంత్రంనుండీ ఆమె మనస్సు మనస్సులో లేదు. అప్పటికీ ఆ ప్రదర్శనం చూడకుండా ఉండాలని నాగిని చేయవలసిన ప్రయత్నాలన్నీ చేసింది. అయినా ఒక బానిస ప్రయత్నాలు — అందునా — అంతఃపురంలో బంధింపబడిన స్త్రీ బానిస ప్రయత్నాలు— ఎలా ఫలవంతమౌతాయి గనక ?

తన జాతీయులు పశువుల్లాగా రంగస్థలంలో త్రిప్పబడుతుంటే— ఇతర దాసీలవలెనే తనూ చూచింది. అప్పుడు ఆమెలో రేగిన భావసముదాయం- ఆమెనే ఆశ్చర్యపరచింది. వేలాది ప్రజలు సంతోషంతో చప్పట్లు కొడుతుంటే, కేకలు పెడుతుంటే, తనవారు అవమానంతో క్రుంగిపోయి, తలలు వంచుకున్నారు. అటు ఆనందంతో పిల పిల లాడుతున్న నాగరీకులను, ఇటు విచిత్రజీవులలా ప్రదర్శింపబడుతున్న తనవారినీ చూచి, నాగిని హృదయం క్షోభించింది.

ఇది తనకు క్రొత్తకాదు. ఇటువంటి 'వినోద కార్యక్రమం' నాగరీకులు తరచు జరుపుతుంటారని తనువిన్నది.

అప్పుడు ఏ భావాలు కలిగాయో తనకు జ్ఞాపకం లేదు. కానీ ఈ నాడు జరిగిన ఈ సంఘటన ఆమె మనస్సును కల్లోలితం చేసివేసింది. రాజకుమారితోబాటు, తనుకూడా జాలకం నుండి ఈ వినోదాన్ని వీక్షించింది. దుష్టురాలు! రాజకుమారి హర్షించినప్పుడల్లా తనూ హర్షించింది. ఆమె 'సెహబాష్' అన్నప్పుడల్లా తనూ 'సెహబాష్' అని మెచ్చుకొన్నది. తనెందుకింత పతనమయింది? ఎందుకు కాదనలేకపోయింది?

అందులో తను చాలామందిని ఎరుగు. 'పులిబాబాయి' –'కక్కన్న' నల్లమామ' అందరూ ఉన్నారు. వారందరినీ తను గొంతెత్తి పిలవాలనుకొన్నది. కానీ పిలువలేకపోయింది. ఆ గుంపులోనే తన అన్ననుకూడా చూసింది. లక్షమందిలో ఉన్నా తను వాసవుణ్ణి గుర్తుపట్టగలదు. అప్పటిదాకా వాసవుడుకూడా బందీ అయినాడని తనకు తెలియదు. తనొక్కతే అయినట్లూ, అన్న ఇంకా స్వేచ్ఛావాయువులు పీలుస్తున్నట్లూ తను ఊహించింది. తను ఇలా చిక్కి ఉంటుందని వాసవునికి తెలిసి ఉండదు. తెలిస్తే ఏదోవిధంగా కలుసుకొందుకు ప్రయత్నించకుండా ఉండడు. ఉండడని తను అనుకోవటమేగానీ, ఏమి ప్రయత్నిస్తాడు? అదెలా సాధ్యం? బానిసలను ఇటీవల భయంకరమైన కాపలాలో ఉంచుతున్నారని, చెప్పుకొనడం విన్నది. ఇదివరకెన్నడూ లేని రక్షణ విధానాలను అవలంబిస్తున్నారట. ఇంకెలా రాగలడు వాసవుడు?

నాగినికి దుఃఖం పొర్లుకొచ్చింది. భయంతో చుట్టూ చూసి బావురుమని ఏడ్చేసింది. మనస్సు రవంత తేలికపడి నట్లయింది. బానిసలకు ఏడ్చే హక్కుగూడా లేదని, నాగిని

కటీపలే తెలియవచ్చింది. గోగడ బహిరంగంగా ఏడ్చిన ఇద్దరు సారంగ స్త్రీలను, సజీవంగా భూ స్థాపితం చేశారు. వారి సమాధులిప్పటికీ కొలనుదగ్గర కనిపిస్తాయి... సోదరుడు కొంత దూరంలో బంధితుడై ఉన్నాడు. ఉన్నాడని తనకు తెలుసు. తనిక్కడ ఉన్నట్లు అన్నకు తెలీదు. తెలుసుకొనే అవకాశం లేదు. ఎంత ఘోరం! మానవజన్మ ఎత్తిన మహాపరాధానికి, తామీ యాతన లనుభవించవలసి వస్తున్నది. పశుపక్ష్యాదులకీ బెడదలు లేవు.

'భగవంతుడా! మాకీ మానవజన్మ నెందుకు ప్రసాదించావు? ఎందుకు మమ్మిలా బాధిస్తున్నావు?'

ఇంతకన్నా ఘోరమైన సంఘటన—బాసిస కాల్చివేయబడటం. అదృష్టవశాత్తు తనా సమయానికి అక్కడ లేదు. రాజపుత్రి ఏదో పనిమీద లోనికి పంపించింది. వచ్చేసరికి, అతని ముఖం రక్తంముద్దలాగా ఉంది. ఎవరికోసమో, నెత్తురోడుతున్న కన్నులు తుడుచుకొంటూ, నలుదిక్కులా చూస్తున్నాడు. అతని ఆప్తులెవరైనా, బంధితులై ఉన్నారేమో? కడసారి వారిని చూడాలన్న ఆకాంక్షతో, అలా చుట్టూ కలయ చూశాడేమో? తను అమితంగా ప్రేమించిన భార్య, తన రక్తాన్ని పంచుకొని పుట్టిన బిడ్డలు, తోబుట్టువులు తన తల్లిదండ్రులు, ఎవరికోసమో, ఎవరున్నారో! గుండెలు కలుక్కుమన్నాయి. చప్పున తండ్రి జ్ఞప్తికొచ్చాడు. తన తండ్రికూడా దాదాపు అంతే ఉంటాడు. అన్నకోసం అలాగే, నడుం వెనక్కువంచి, నడ్డిమీద చేతులానించి చూడటం కళ్ళలో మెదిలింది. ఒక్క-క్షణం, తన తండ్రేమో

పని, గడగడ వణికి పోయింది. పొంగివస్తున్న దుఃఖాన్ని ఆపుకోలేక పోయింది. ప్రక్కదాసి, సైగ చేయకపోయి నట్లయితే ఏడ్చివుండేది. మూగనో సహూధి కల్పవలసిన అవసరం తప్పిపోయింది.

అయితే అన్న ఎక్కడ ఉన్నట్లు? ఉన్నా ఎలా కలుసుకోవడం? ఒక్కసారి అన్నను చూచే అవకాశం, తనకు లభిస్తే, జీవితంలో మరేకోరికా తానుకోరను. ఓసాలో! ఒక్కసారి – ఒకే ఒక్కసారి తను అన్నను చూడగలిగితేనా?

## 4

భగ్గుమని మంటలెత్తుతున్న కళ్ళను వాసవుడు బలంగా తుడుచుకొన్నాడు. సంకెళ్లు గలగలమని ధ్వనిచేశాయి. వాటి వేపు దీర్ఘంగా చూశాడు వాసవుడు. గట్టిగా నిట్టూర్చాడు. అర్ధరాత్రి దాటింది. అందరూ నిద్రపోతున్నారు. కాటుక లాంటి చీకటి దట్టంగా విరియ బూసింది. ఇనుప తలుపు సందునుండి, ఒక నక్షత్రం మినుకుమినుకుమని కనిపిస్తున్నది. దూరంగా రాజభటుల పదధ్వని, ఉండి ఉండి మందంగా వినబడుతున్నది. సన్నటి వెలుగుచార, ఒక్క నిమిషం తలుపు సందునుండి లోపలికి ప్రాకి, చీకటిలో కలిసిపోయింది.

కాపలావాని దీపం అనుకొన్నాడు వాసవుడు.

గాలిబిగిసిపోయి దుర్గంధంతో, ఉకలుక లాడుతున్నది. ముక్కులు పగిలిపోతున్నాయి. తను స్వేచ్ఛగా గాలి

పిల్చి ఎంతకాలమైంది? నీలపు టాకాశాన్ని, అందులో స్వేచ్ఛ
రిగా తిరిగే మబ్బులనూ, చూచి ఎంతకాలమైంది; ఇలాంటి
చీకటి రాత్రులు (వెన్నెల రాత్రులేమో) చెల్లికి కాకమ్మ
కథలు చెప్పుకుంటూ గడిపిన రోజులు...తలుచుకొంటుంటే
అవన్నీ కలలనిపిస్తున్నాయి. అలా జీవించిన కాలం, ఒక
టున్నాదా—అన్న అనుమానం, మహావ్యాధిలా పట్టిపల్లా
ర్చుతున్నది. ప్రతిరాత్రీ - ఇప్పుడనుభవిస్తున్న ఈ నరక
యాతనలు మిథ్య అనీ, స్వప్నమయానక కలిగే భ్రాంతి వంటి
దనీ, మెలకువరాగానే, ఈ దుస్స్వప్నం చెదిరిపోయి—అలనాటి
తన స్వాతంత్ర్య జీవితం, తిరిగి తనకు లభిస్తుందనీ, అను
కొంటున్నాడు. కాదు. ఇది స్వప్నం ఎంతమాత్రం కాదు.
కాకపోగా లోగడ తను జీవించిన జీవితమే స్వప్న మాత్ర
మవుతున్నది.

ఒక్కొక్క మహా అనర్థం వెంట, ఎంతో కొంత
మేలు కూడా ఉంటుందని వాసవుడు ఇప్పుడే గ్రహించాడు.
పరస్పర ద్వేషంతో, పల్లటిల్లే తన జాతిలో, ఈనాడెక్కడా
లేని ఐకమత్యం వాసవుడు పసికట్టాడు. ఇందుకోసరమై లోగడ
ఎందరో సారంగ మేధావులు, నాయకులు ప్రయత్నించి,
సంపూర్తిగా పరాజితులైనారు. వారి జీవితాలు ఇందుకోసం
వమ్మయిపోయినవి. ఆనాడు వారు సాధించలేని ఫలితం, ఈ
నాడు అప్రయత్నంగా లభించింది. అందరూ అనుభవిస్తున్న
ఒకే రకపు యాతనామయ జీవితం, వారిలో ఆ సంఘీ
భావాన్ని నెలకొల్పి ఉంటుంది. ఇదేగనుక లోగడనే ఉన్నట్ల
యితే, ఇలా బానిసలుగా ఉండవలసిన దుస్థితి వచ్చేద

కాదేమో? అథవా దుర్గతి పట్టినా—దాదాపు జాతి జాతి మొత్తమూ ఈ బెట్టిదానికి పాల్పడవలసిన అవసరం ఉంటే? కాదేమో?

ఏది ఏమైనా ఇదీ ఒక సుగుణమే! దీని లాభనష్టాలను గురించి, ఇదమిత్థంగా ఏది చెప్పటమూ సాహసమవుతుంది. ఫలితం ఆచరించే విధానాన్ని బట్టి ఉంటుంది. అస్పృశ్యవర్గాలు సారంగులంతా, ఈనాడు తనమీద అపారమైన విశ్వాసం ప్రకటిస్తున్నారు. తను ఏది చేయమన్నా చేయడానికి సంసిద్ధత తెలియచేస్తున్నారు. అందువల్ల ఎలాంటి పరిస్థితుల నెదుర్కోవాలన్నా, ధైర్యంతో ఎదుర్కొంటామన్నారు. తను ప్రచారం పట్టిపో లేదు. గట్టిగా పనిచేసింది. తనకు కావలసింది కూడా ఇదే!

తండ్రి మరణం-తనకు దుఃఖకారణమే! అయినా, ఆయనగారి ఆహుతితో, అపూర్వమైన చైతన్యం తనజాతికి సంక్రమించింది. దీనిని సక్రమమార్గంలో వినియోగించవలసిన బాధ్యత తనది!

కీడులో మేలుగా 'నాగిని' అంతఃపుర బందీగా ఉన్నది. రాజరహస్యాలెన్నో చెల్లికి ముందుగా తెలుస్తాయి. కావలావాని 'సౌజన్యం'తో ఆ రహస్యాలు తనను చేరగలవు. రానున్న అపాయాలను ముందే తెలిసికొనడం వలన, వాటికి తగిన ఉపాయాలను కూడ ఆలోచించవచ్చు. తద్వారా కొన్ని రకాలైన బాధలనుండి, తన జాతి రక్షింపబడుతుంది. ఇంత కాలానికి తమకొక బాట కనిపించింది. భగవంతుని సహృదయత్వానికి నమస్సులు.

వాసవుని ఆలోచనలు తక్కున ఆగిపోయాయి. సమీపంలో ఏదో ప్రాకుతున్న చప్పుడయింది. ఏమిటోనని వాసవుడు కళ్ళుచిచ్చి చూశాడు. అజ్ఞానంలాంటి అంధ తమసం. ఏమీ కనిపించ లేదు. ఏదో క్షుద్రజంతువయి ఉంటుంది. రాత్రి మేతకయి బయలుదేరి ఉండవచ్చు. ఈపురాతన కారాగారంలో ఇలాంటి వుండటం సర్వసాధారణం! రానున్న జీవిని ఎదుర్కొనడం కోసం, వాసవుడు సిద్ధంగా ఉన్నాడు. ప్రాకుతున్న చప్పుడు కొన్ని నిమిషాలాగి, తిరిగి వినబడింది. వాసవుడు జాగ్రత్తగా విన్నాడు మనిషి ఊపిరిపీలుస్తున్న చప్పుడు...వాసవుడు ప్రాకుకొంటూ, ఆ చప్పుడు వచ్చిన వైపుకు వచ్చాడు. రెండు తలలు తాకాయి.

'ఎవరు ?'

'నేను'

'ఓ'

తిరిగి గుసగుసలు, ఇద్దరూ ప్రాకుకొంటూ ఇంకోమూలకు చేరారు; నడిచి వెళ్ళలేక కాదు. నడిస్తే సంకెలలు ధ్వనిస్తాయనీ, ఆధ్వనివిని రాజభటులు రావచ్చనీ భయం. ఖానిసలు రాత్రివేళల్లో — లేచి తిరుగరాదన్న క్రొత్త శాసనం, ఇటీవలే అమలులోకి వచ్చింది. శాసన ధిక్కారం చేసిన నలుగురు సారంగులు, సింహాలకు ఆహారంగా వేయబడి, ఎంతో కాలం కాలేదు.

'ఇన్నిటికీ నీ అభిప్రాయ మేమిటంటావ్ ? అన్నదొక గొంతు, తనకే వినబడనంతటి మెల్లిగా.

'ఒక్కసారి ఎదురు తిరుగుదాం !'

'ప్చ్' అని చప్పరించింది. మొదటి గొంతు 'తిరుగ బడితే' సర్వనాశనమయి పోతాం మనల్ని సమిష్టిగాగానీ, విడివిడిగాగానీ, చంపగల శక్తి మన యజమానికి లేదనుకోకు. తలుచుకొంటే, మనలను బూడిద చేసెయ్యగలడు'

'మరి ?'

'చెబుతున్నాను' అన్నది మొదటిగొంతు. 'అంద రమూ ఒకేసారి విముక్తి పొందాలంటే సాధ్యంకాదు. ముందు కొందరు మాత్రమే, బహుశః – చాలా కొద్దిమందికి మాత్రమే ననుకొంటాను, స్వేచ్ఛ లభిస్తుంది ఎలాగంటే, కొద్దిరోజుల్లో మన యజమాని మనలను విక్రయానికి పెట్ట బోతున్నాడు. ఎక్కువ డబ్బు చెల్లించినవారికి మనం అమ్ముడుబోతాము అప్పుడు, ఆ డబ్బు మనమే చెల్లించి మనవారిలో కొందరిని మనమే కొనాలి. అంటే ముఖ్యులైన వారినన్నమాట. ఏ ఒకరిద్దరొచ్చినాచాలు. వారు తిరిగీ మరికొంత ధనాన్ని నెచ్చించి' మరికొందరిని కొంటారు. సరి పడినంత మంది వెలికి రాగానే, రహస్యంగా, దీనిమీదికి దాడిజరిపి- మనవారిని విడిపించుకొంటాము. ప్రయాణానికి కావలసిన ఏర్పాట్లన్నీ చేసేఉంటాయి. ఈ సందర్భములో ఎక్కువ మంది సారంగులు నష్టపడవచ్చు నిజమేగానీ, అందరూ నష్టపడటంకన్న కొందరే నష్టపడటం మంచిదని నా అభిప్రాయం. మరి నీవేమంటావు ?'

'బావుంది. మరి డబ్బు ?'

అంతఃపురంలో, రాజకుటుంబీకుల ఉపయోగార్థం, చాలా ధనరాసులున్నాయని నాగిని చెప్పింది. వస్తువులను

మనం ముట్టుకోరాదు. గుర్తులు తెలిసిపోతాయి. కాపలా వారికి తన శీలాన్ని ఎరవేసి నాగిని వశపరచుకొన్నది. ఆ సమయానికి వారి నక్కడ లేకుండా చూసే బాధ్యత నాగినిది.'

'అమ్మయ్యో! అంతపనే!!'

'ఇష్షో! మెల్లిగా మాట్లాడు' అని ఆగి తిరిగి ప్రారంభించింది గొంతు. 'ఇంత పిరికితనమైతే - మన మనుకొంటున్న వాటిల్లో ఒక్కటీ నెరవేర్చలేము. ధైర్యం - దేనికీ భయపడని గుండెనిబ్బరం కావాలి. సక్రమంగా జరిగితే బాగుపడతాము. లేదా - పట్టుబడిన ఆ ఒక్కడూ చావవలసి వస్తుంది. విధిగా చావవలసి ఉన్న మనం, ఒక సత్కార్యానికై ప్రయత్నించటంలో చావడమన్నది - వృథాపోదు... ఏమంటావు?'

'అంతఃపురానికి ఎవరు వెడతారు?'

'నువ్వు!'

'బాబోయ్! నా వల్లకాదు'

అయితే నేనే వెడతాను. జాగ్రత. ఈ విషయం ఎక్కడా పొక్కనీకు. దురదృష్టవశాత్తూ నేను పట్టుబడటమే జరిగితే, నా పట్ల మీరెవ్వరూ సానుభూతిగా మాట్లాడటం గానీ, అలాంటి ముఖ కవళికలుగానీ, ఉండరాదు. మనవారందరితోటీ చెప్పు. మెల్లిగా - మెల్లిగా ప్రాకి వెళ్లు. సంకెళ్ళు చప్పుడు కానివ్వకు.'

'సరే!'

బరువైన పదార్థమేదో, నేలను రాచుకొంటూ కొంత దూర మెళ్ళి నిలిచి పోయింది. వాసవుడు నిట్టూర్చాడు.

౯

అనుకొన్న ప్రకారం అన్నీ అనుకూలించాయి. స్త్రీ లోలురయిన అంతఃపుర రక్షక భటులు 'నాగిని'ని ఉద్యాన వనములోకి తీసుకెళ్లారు. అంతటా భయంకరమైన నిశ్శబ్దం తాండవిస్తున్నది. వాసవుడు మెల్లిగా పైకి ప్రాకుతున్నాడు. (సంకెళ్లు విడగొట్టినదీ లేనిదీ ఇక్కడ వివరంగా లేదు. ముందు కథలో గూడా అతనికి నిగళములున్నట్టు లేదు. దానిని గురించి రాజుగానీ, ఇతరోద్యోగులుగానీ, విచారించిన చిహ్నాలుగూడా లేవు.) దీపాలు అలసిపోయి జోగుతున్నాయి. దీపకాంతి మీదపడకుండా, ఎలా వెళ్ళవలసిందీ; ఎటు వెళ్ళ వలసింది, ధనరాసులు ఎక్కడ ఉన్నదీ, నాగిని ఒకటికి పది సార్లు వివరంగా చెప్పింది. వాటినన్నింటినీ మననం చేసుకొన్నాడు వాసవుడు. ఆయా గుర్తుల ననుసరించి గమిస్తున్నాడు. ప్రతిదీ అతన్ని విభ్రాంతం చేసి వేస్తున్నది. ఆశ్చర్యంతో దిమ్మెరపోతున్నాడు. తిరిగి సంబాళించుకొని, కర్తవ్యోన్ముఖుడవుతున్నాడు తను ఏనాడూ—ఇటువంటి భవనాన్ని ఊహించ లేదు. కనీసం కలలోనైనా దర్శించి వుండలేదు. (ఊహాతీతమైనవి స్వప్నంలో కొస్తాయా? ఎలాంటి స్వప్నానికైనా మూలబీజాలు వాస్తవికతలోనే ఉంటాయని శాస్త్రజ్ఞులంటున్నారు.) కాలం త్వరత్వరగా గడిచిపోతున్నది. యామికుడు కాలాన్ని సూచిస్తూ ఘంటికను మ్రోయించాడు. అంతఃపుర రక్షకభటులు తిరిగి రావచ్చు. ఈలోపుగానే తను కార్యక్రమాన్ని ముగించుకోవాలి.

ఒక్కొక్క అడుగు ముందుకు వేస్తున్నకొద్దీ, చెప్పరాని కలవరమేదో మనస్సును కకావికలు చేస్తున్నది. ధైర్యాన్ని కూడగట్టుకొని ముందుకు సాగాడు. ఒక గదిలో నుండి, సన్నని వెలుగు బైటికి పడుతున్నది. నాగిని కథనం ప్రకారం, అది రాజకుమార్తె శయ్యాగారం కావాలి. జయంతి సౌందర్యాన్ని గురించి నాగిని ఎన్నోసార్లు చెప్పింది. ఏమో అవయవాలెలా ఉంటాయో, ఆమెకోసం తపించే రాజకుటుంబీకు లెందరో, వారి కామె ఇచ్చే ప్రత్యుత్తరా లేమిటో సవివరంగా చెప్పింది. జయంతిని చూడాలన్న ఇచ్ఛ అతని కానాడు లేదు. సందర్భపడ్డది గనుక ఇప్పుడా అవకాశాన్ని వినియోగించుకోవాలి. వాసవుడు మెల్లిగా కిటికీ దాపు కొచ్చాడు. అంతకన్న మెల్లిగా జయంతివైపు కళ్లు త్రిప్పాడు నాగిని అబద్ధం చెప్పిందనిపించింది. ఉన్న సౌందర్యంలో శతభాగం నాగిని చెప్పలేదు. వాసవుడు చలితుడైనాడు. ఆ మృదుతల్పంమీద నిద్రిస్తున్న ఆకారం మానవ ఆకారమని నమ్మలేకపోయాడు. అనాది మానవుని ఆదిమ విరహా గీతంలా, ప్రశాంత నిశాంత సుఖాంత స్వప్నశకలంలా, జయంతి అతనికి గోచరించింది, రతనాల దివ్వెలు వెలుగు చిమ్ముతున్నాయి. బంగారుతల్పం, ఆ వెలుగులకు సిగ్గు మిలమిలలు వెలారుస్తున్నది. వాసవునికి చప్పున ఒక విషయం జ్ఞాపక మొచ్చింది. ఆ బంగారు గనులనుండి త్రవ్వితీసిన బానిసలు, రత్నాలు భూగర్భంనుండి పెకలించుకొచ్చిన బానిసలు, కటికచీకటిలో, కాలేకడుపులతో, పశువుల్లా, గుహాల్లాంటి

చెరసాలల్లో మ్రగ్గుతున్నారు. వాటికోసం ఏ శ్రమా పడని జయంతి, వాటిని స్వేచ్ఛగా అనుభవిస్తున్నది !

కోపంతో కుతకుతలాడి పోయాడు. సమయమిది కాదనుకొన్నాడు. ఒకనాటికి తానూ ఈ స్థితికి రాగల మనుకొన్నాడు. వెలుతురును తప్పుకొంటూ ధనకోశం ప్రవే ప్రాకాడు. అట్టే శ్రమపడలేదు. మోయగలిగినన్ని సువర్ణ ముద్రికలు మూటగట్టుకొన్నాడు ఈ క్షణమో, మరుక్షణమో బయలుదేరుదా మనుకొన్నాడు. ఎన్నో భావాలు, ఉన్మత్తంగా అతని మనస్సులో లేచాయి. సౌందర్యవంతమైన భవిష్య జ్జీవితం, స్పష్టంగా కళ్ళముందు విరిసింది. ఆనందంతో శరీరం పులకరించింది. మూట సరిచూచుకొంటున్నాడు. దూరంగా... ఏదో చప్పుడు... వాసవుని గుండెలు గుభేలుమన్నాయి. చప్పున ప్రక్కకు తప్పుకొన్నాడు. ధ్వని క్రమంగా దగ్గరవుతున్నది. భవిష్యత్తు అంధకారమయంగా, భయంకరంగా, చేదుగా, తోచింది. తలతిరిగిపోతున్నది. లోపల తన్నుకొస్తున్న అలజడి.. రెండుచేతులతోనూ కళ్ళుగట్టిగా మూసుకొన్నాడు..

ఒక బలమైన కొరడాదెబ్బ అతన్ని చైతన్యవంతునిగా చేసింది.

బాధతో మెలికలు తిరుగుతూ వాసవుడు లేచి నిలబడ్డాడు. చుట్టూ రాజభటులు. అతని కేమీ తోచలేదు. పిచ్చెత్తినట్లయింది. ఇది 'కల' కాదని రుజువు చేసుకొందుకు తనను తాను పరిశీలించుకొన్నాడు. ఇంకో కొరడాదెబ్బ. చర్మం ఊడివచ్చింది. ఎర్రటి రక్తం, నేలమీదికి చారికలుగా స్రవిస్తున్నది.

'ఎలా వచ్చావ్ ?'

'ఎందు కొచ్చావ్ ?'

వాసవుడు మాట్లాడ లేదు.

మరొక్క సారి కొరడా అతన్ని చుట్టి కొంత చర్మాన్ని కరుచుకొచ్చింది.

యశపాలుడు నిప్పులు క్రక్కుతున్నాడు. 'బానిస... నీచుడు...పంది...అంతఃపురంలోకి ప్రవేశించటమా ? రాజ భటు లేమిచేస్తున్నారు ?'

రాజభటులు మాట్లాడ లేదు.

వంచిన తల ఎత్తలేదు.

యశపాలుని దృష్టి నాగినివైపు మళ్ళింది. అతని కేదో రహస్యం తెలిసినట్టు కనుబొమ్మ లెగురవైచాడు.

'అదీ సంగతి' అన్నాడు యశపాలుడు తలపంకిస్తూ 'ఈ కులటను మరిగి, వీడు అంతఃపురానికి వచ్చి ఉంటాడు.'

వాసవుడేదో చెప్పాలని ప్రయత్నించాడు. నాగిని సౌంజ్ఞ చేసింది.

'పందీ !'

నాగిని విలా విలా తన్నుకొన్నది కొరడా దెబ్బకు.

'నిజం చెప్పు'.

'ప్రభూ !' అన్నది నాగిని, 'నన్ను క్షమించండి...నా దేమీ తప్పు లేదు. రాజకుమార్తెగారి ఆజ్ఞ ప్రకారం నేనీ రహస్యాన్ని దాచాను. కాపలావారికిగూడా ఈ సంగతి

తెలుసు. అయినా అంతఃపుర రహస్యం గనుక, బైటికి పొక్కనీ లేదు.'

యశపాలుని వదనం మ్లానమయింది.

'రహస్యమా ?'

'అవును ప్రభూ !'

'ఏమిటది ?'

నాగిని నిర్భయంగా అన్నివిషయాలూ చెప్పింది. 'వాసవుడు అంతఃపురానికి రావడం ఇదే తొలిసారికాదు. కొంతకాలంనుండీ ఇతడు జయంతి శయన మందిరానికి రాకపోకలు సాగిస్తున్నాడు. అలనాడు జరిగిన బానిసల ప్రదర్శనం, భర్తృదారిక చూచినప్పటినుండీ, వాసవునిపై మమకారం పెంపొందించుకొన్నది...కాదనిగానీ, ఔనని గానీ అనగల అర్హత నాకులేదు. 'యజమాని నిర్దేశించిన పని నెరవేర్చటమే నా విధి' అని మీరు ఆజ్ఞాపించారు...కానిపక్షంలో; అంతఃపుర రక్షణ సందర్భంలో, అజాగ్రత్తగా ప్రవర్తించేవారికి మరణమే శిక్ష అని తెలిసికూడా, ఈ రాజభటులెలా ఇతన్ని లోనికి రానిచ్చారు ? ఎందుకు రానిచ్చారు ? ధనాశకు లోబడినారనుకొన్నా, బానిసలకు ధన మెక్కడిది ప్రభూ ?'

యశపాలుడు క్రుంగిపోయాడు. కోపంతో చలి పిడుగైనాడు. జయంతి నిశ్చేష్టయై చూస్తున్నది. కావలాభటులు; నాగిని చెప్పినదంతా యథార్థమేనని సప్రమాణంగా ఋజువు చేశారు—తమ ప్రాణాలు దక్కినందుకు లోలోన సంతోషపడుతూ. రాజు కారాగార రక్షకులను పిలువనంపాడు. ఈ సరికే వారికీ వార్త చేరింది. తమ పరాకునకు ఎటువంటి శిక్ష

అనుభవించాలోనని సతమతమై పోతున్న వారికీ వార్త అత్యానందాన్నిచ్చింది. వాసుగూడా నాగిని చెప్పినది యథార్థమేననీ, కుమారి జయంతి తనను స్వయంగా అంతః పురానికి పిలిపించి వాసవుని విషయం మరొక విధంగా చెప్పిందనీ అన్నాడు.



క్రమంగా ఈ వార్త పట్టణమంతటా ప్రాకింది. పూటా పూటి నడకలో రాజ్యమంతటా విస్తరిల్లింది. ఎందరో ఎన్నో విధాల వ్యాఖ్యానించారు. యశపాలుడు అంతఃపుర స్త్రీల వినియోగార్థమే బానిసలను మేపుతున్నాడని శత్రురాజు లన్నారు. వంశ పారంపర్యంగా వస్తున్న వైవాహికాచారాన్ని, యశపాలుడు ఎలా నిర్వహిస్తాడో చూడాలన్న ఉబలాటం కొందరు ప్రదర్శించారు.

అంతఃపురంలో ఇటువంటి 'ప్రేమ' వ్యవహారం జరిగి నప్పుడు, అది న్యాయసభ ఎదుట పెట్టటమూ, న్యాయసభా నిర్ణయం ప్రకారం ఆచరించటమూ, కురుదు వంశీయుల ఆన వాయితి. అలాగే ఈ నాడుగూడా న్యాయసభ ఏర్పాటుచేయ బడ్డది. వేలాది జనంతో భవనం కిటకిట లాడుతున్నది. ఇతరోద్యోగులవలెనే యశపాలుడుగూడా మామూలు జనులు కూర్చునే చోటనే కూర్చున్నాడు. ఒక వైపున వాసవుడు నిలబడి ఉన్నాడు. అతని కభిముఖంగా రాజపుత్రి జయంతి

నిలుచున్నది. రాజవంశం పక్షాన ప్రధానమంత్రి లేచి, రాజపుత్రి సుకుమారి గనుక, నిలుచోలేదనీ, కూర్చోనడానికి అనుమతించాలనీ అభ్యర్థించాడు. న్యాయమూర్తి అంగీకరించలేదు. 'న్యాయస్థానంలోనికి, రాజపుత్రిగా కుమారి జయంతి రాలేదు. దోషిగా కొనిరాబడ్డది. దోషి. దోషనిర్ణయం అయ్యేంతవరకూ కూర్చోనకూడదు. ఇందుకు న్యాయశాస్త్రం అంగీకరించదు' అన్నాడు న్యాయమూర్తి.

తరువాత సాక్షులను విచారించాడు. జయంతిని ప్రశ్నించాడు. తనేపాపమూ ఎరుగనన్నది జయంతి. ఇదంతా అన్యాయమూ, అధర్మమూ అన్నది. తరువాత, వాసవుని పృచ్ఛించాడు న్యాయమూర్తి.

'ధర్మమూర్తీ!' అన్నాడు వాసవుడు. 'నేను బానిసను. నా యజమాని చెప్పినట్లు నడుచుకోనడం నా విధి. నా కర్తవ్యాన్నుండి, నేనెప్పుడూ విముఖుణ్ణి కాలేదు. ఒక పనియొక్క పాప పుణ్యాలతో, ధర్మా ధర్మాలతో నాకు నిమిత్తం లేదు. యజమాని ఆజ్ఞ అక్షరాలా పాటించటమే నాకు న్యాయం. అదే నాకు ధర్మం.'

'మంచిది' అన్నాడు న్యాయమూర్తి. 'ఈ సాక్షులు చెప్పిన కథనాన్ని, నువ్వుగూడా రుజువుచేయగలవా?'

'మీరనుగ్రహిస్తే !' అన్నాడు వాసవుడు.

సభ యావత్తూ నిశ్చేతన మయింది.

'ఆపదలో ఉన్నానని, రాజపుత్రి జయంతి—'

న్యాయమూర్తి 'రాజపుత్రి' పదప్రయోగం చేయరాదని శాసించాడు.

'సరే' అన్నాడు వాసవుడు 'ఆపదలో ఉన్నానని, జయంతి అబద్ధమాడవచ్చు. అది ఆమెకు, ఆమెవంటి వారికి సహజమే ననుకొంటాను... పోనీండి. మరో చిన్న విషయం. నే నెవరో తన కిదివరకు తెలియనే తెలియదని, జయంతి అంటున్నారు. తెలుసుననీ, మా యిద్దరకూ సన్నిహిత సంబంధమే ఉన్నదనీ నేనంటున్నాను. ఒక్క ప్రియునికి దప్ప, మరెవరికీ తెలియజాలని కొన్ని చిహ్నాలు, కుమారి జయంతి శరీరంలో ఉన్నాయి. అవి ఇవి...' అన్నాడు వాసవుడు. 'ధర్మమూర్తులైన మీరు పరీక్షింపించి, నిజానిజాలు తేల్చండి.'

వాసవుడు చెప్పిన చిహ్నాలు అక్షరాలా, ఆయా చోట్ల ఉన్నాయని, జయంతిని రహస్యంగా పరీక్షించిన సువాసినీజనమన్నది.

'అదిగూడా కాక' అన్నాడు వాసవుడు. 'జయంతి ప్రస్తుతం కన్య కాదు. కొద్దిరోజులలో ఆమె తల్లి కాబోతున్నది.'

భిషక్కులు, అదిగూడా నిజమేనని నిర్ధారించారు.

యశపాలుడు అవమానంతో మాడిపోయాడు. వాసవుని ముఖాన చిరునవ్వు పొటమరించింది.

'ప్రభూ ! ఇంతకన్న మీకేమి రుజువులు కావాలి ? ధర్మాధర్మాలు ఇపుడు నిర్ణయించండి.'

న్యాయమూర్తి న్యాయమైన తీర్పునిచ్చాడు.

'జయంతి దోషురాలని నేను భావిస్తున్నాను. ప్రేమించటం దోషమని న్యాయశాస్త్ర మనటంలేదు. రహస్యంగా చేసిన పనినే, బహిరంగంగా, తాను చేయలేదని, న్యాయస్థానంలో అబద్ధమాడింది. ఈ దోషానికి, సామాన్యజనులు పొందే శిక్షనే ఈమెగూడా పొందాలి. ఈమె వాసవుని సొత్తుగా నేను తీర్పు చెబుతున్నాను. కుకురు వంశాచారం రీత్యా జయంతి, ఇకనుండి వాసవుని భార్యగా వ్యవహరించాలి. వంశాచార భంగాన్ని సైతం, న్యాయశాస్త్రం అంగీకరించదని హెచ్చరిక.'

## 6

ఈ తీర్పుమీద వాదోపవాదాలు, ఖండన మండనలు, తర్జన భర్జనలు జరిగాయి. కొంతకాలంపాటు దేశ దేశాలు ఈ విషయాన్ని ఆగుబ్బుగా చెప్పుకొన్నాయి.

వాసవుడు తన భార్యను వెంటబెట్టుకొని, మామూలు చెరసాలా వాసానికి ఆయత్తమయ్యాడు. నిరాకరించే హక్కు— భార్యగనుక— జయంతికి లేదు. అతనితోబాటు ఆమెగూడా చెరసాలలో ప్రవేశించవలసిందే! అయితే శాసన రీత్యా మరొక చిక్కు వచ్చిపడ్డది. బానిసలపై ప్రస్తుతమున్న కట్టడులు— కేవలం వారి కోసం మాత్రమే చేయబడ్డాయి. వాటిని బానిసేతరులపై అమలుజరపటానికి వీలుకాదు. ఈ రీత్యా—జయంతి బానిసకాదు గనుక, కారాగార వాసం చెయ్యనక్కరలేదు. కానీ వాసవుడు, తన యజమానానికి వెళ్ళి తీరాలని పట్టుబడుతున్నాడు. భర్త ఆజ్ఞను జవదాటటం మహానేరంగా న్యాయశాస్త్రం ఉద్ఘోషిస్తున్నది.

యశపాలుడు క్షోభించిపోయాడు. ఈ సంసారిక జీవితంపై రోత జనించింది. రాజ్యాన్ని వీడి, భార్యా సమేతంగా తపోభూములకు వెళ్లాడు. యశపాలుడు పుత్రహీనుడు కావడంతో, రాజ్యం జయంతికి సంక్రమించింది. ఆవిడే పరిపాలకురాలైంది. కానీ రాజవంశ స్త్రీలు పరపురుషుని కంటపడరాదు. (న్యాయ విచారణసమయంలో నలుగురిఎదుటా పడటమనేది, ఈ కోవక్రిందికి రాదు. తీర్పు కాబోయేవరకూ, ఎవరు పరపురుషులో, ఎవరు స్వీయపురుషులో ఎలా నిర్ణయించటం?) ఆమె ప్రతినిధిగా వాసవుడే పరిపాలనా భారం వహించాడు.



అప్పటినుండీ రాజ్య పాలకులుగా బౌనిసలు వచ్చారు. రాజ్యపాలకుడుగా వచ్చిన ప్రారంభకాలంలో, కొన్ని కఠిన మైన శాసనాలను వాసవుడు అమలుజరిపాడు. తన రాజ్యంలో ఎక్కడా 'బౌనిస' అన్న పద ప్రయోగం చేయరాదనీ, ఏ రూపంలో ఎక్కడ, ఎప్పుడు ఆ శబ్దం ఉచ్చరింపబడినా కఠి నంగా శిక్షింపబడతారనీ శాసించాడు. శాసన ధిక్కారులను క్రూరంగా అణచివేశాడు. ఉచిత విద్యాశాలలు దేశమంతటా నెలకొల్పాడు. అందరితో కలిసి సారంగ జాతీయులు (బౌనిస జాతీయులుకాదు) సహవిద్య నభ్యసించారు. దానధర్మాలు వారు వీరనక చేశాడు. సంగీత సాహిత్యాది లలితకళలను సమాదరించాడు. దయానిధిగా పేరుపొందాడు. కానీ వాసవు డెప్పుడూ, ఏదో మనోవ్యధతో కుములుతుండేవాడు. జయం తితో, అతడు వైవాహిక సుఖ మపేక్షింపలేదు. కొన్ని సంవ త్సరాలవరకూ ఆమెను చూడనుకూడా చూడలేదు. తనజాతి స్త్రీని వివాహమాడి, సంతానాన్ని పొందాడు. ఆ సంతానా నికే రాజ్యము నప్పగించాడు. జయంతి పుత్రుడు (వివాహం నాటికే రాజపుత్రి గర్భిణి ఈ విషయం న్యాయస్థానంలో వెల్లడయింది. ఈ బిడ్డకు తండ్రి – ఒక్క జయంతికే తెలుసు. తెలుసుకోవాలని వాసవుడెప్పుడూ ప్రయత్నించలేదు.) సారం గులచే చంపబడ్డాడు. కుకుదు వంశం జయంతి నిర్యాణంతో అంతమయింది. తమ ఈ స్థితికి కారణభూతమైన జయంతి

పేరుతో వాసన్నుగు ఒక మహాసగరం కట్టించాడు. తన రాజ ధానిని స్వర్ణపురినుంచి జయంతికి మార్పించాడు. ఆ తరువాత వచ్చిన సారంగప్రభువులుగూడా జయంతినే రాజధానిగా చేసికొని తమ భక్తి ప్రపత్తులను వెల్లడించారు.



మృత్తికా పత్రాలలో ఇంతవరకే విషయం లిఖించ బడి ఉన్నది. కాల నిర్ణయం గూడా దాదాపు నిర్ణయించటం జరిగింది. నడివీధుల్లోను, ఇతర చోట్లా లభించిన ఆయుధ శకలాలను బట్టి చూస్తే, అవి అశోకుని సైనికులవిగా తోస్తు న్నది. ఆకాలంలో, మరే సైన్యానికీ లేని విచిత్రమైన ఆయుధ సంపద అశోకుని కుండేదని చరిత్ర చెబుతున్నది. చరిత్ర వర్ణించిన అన్ని వర్ణనలూ, ఆయా, ఆయుధ శకలాలకు సరి పోలుతున్నాయి. దూషణతో కూడిన తామ్రమాది శాసనాలు గూడ అశోకునివే అయి ఉండాలని విజ్ఞులు భావిస్తున్నారు. అశోకుడు రాజ్యపాలనమున కొచ్చిన విధానాన్ని బట్టి అలా కవ్వించి, కదనంలోకి దింపి, సర్వనాశనం చేయడం అశోకునికి క్రొత్త కాదని బోధపడక మానదు. నగరాన్ని భస్మీభూతం చేసిందిగూడా అతనేనని, అశోకుని చరిత్రవల్లనూ, ఇతరా ధారవల్లనూ తేటతెల్లమవుతున్నది. కళింగ రాజ్యం వరకూ చొచ్చుకొచ్చిన అశోకుని సైన్యాలు, జయంతిని పొట్టబెట్టు కొనకుండా ఉండటం అసంభవం !

అయితే ఈ సారంగ రాజ్యాస్తమయం, క్రీస్తుపూర్వం మూడవ శతాబ్దిలో జరిగినదన్నమాట. రెండువందల సంవత్సరాలు (సుమారుగా) సారంగులు పరిపాలించారంటే, వాస పుడు క్రీస్తుపూర్వం అయిదవ శతాబ్దం వాడయి ఉండాలి జగత్పూజ్యుడైన గౌతమబుద్ధుడు ఆ శతాబ్దం వాడే!

ఒకటి మాత్రం నిజం! ప్రతి తరమూ తనకు కావలసిన వారిని తనే సృజించుకొంటుందట. అయినన శతాబ్దంలో, అమానుషమైన అటువంటి సామాజిక విధానం ఉండబట్టే, కరుణ సింధువైన గౌతము డుద్భవించాడేమో!



12)

# శ్రీ కొడవటిగంటి కుటుంబరావు

కుటుంబరావుగారు 1909 లో తెనాలిలో జన్మించారు. అన్నగారైన వెంకట సుబ్బయ్యగారు సాహితీ సమితి వ్యవస్థాపకులలో ఒకరు. తెనాలి, గుంటూరు, విజయనగరం, కాశీ హిందూ విశ్వవిద్యాలయాల్లో విద్య నభ్యసించి ఫిజిక్సులో బి. యస్ పట్టం పొందారు ఆ తరువాత బొంబాయి, సిమ్లా మున్నగు చోట్ల పలురకాల ప్రభుత్వోద్యోగాలు నిర్వహించారు. యువ, ఆంధ్రపత్రిక లాంటి దైనిక, వార, మాసపత్రికల్లో సంపాదక సహాయ సంపాదకులుగా చాలకాలం పనిచేశారు ప్రస్తుతం (1952 నుంచి) చందమామకు సహాయ సంపాదకులు. మొట్టమొదటగా వారు సంభాషణలు కూర్చిన చిత్రం 'వీరాభిమన్యు' (1936) తరువాత 'నాగుమారు' 'జ్యోతి' చిత్రాలకు కూడా కథలూ మాటలూ వ్రాశారు.

కుటుంబరావుగారు 1930 నుంచి కథలు వ్రాస్తున్నారు. వీరి కథలు ఇప్పటికి 30 సంపుటాలుగా వెలువడినాయి. ఇంకా ఎన్నో కథలు పత్రికల్లో విరివిగా ప్రచురింపబడుతున్నాయి. కథలేగాక నవలలు రేడియో నాటికలు అనువాదాలు, సైన్సు వ్యాసాలు వీరివి చాలా ఉన్నవి.



# కథ

విఠలుకు నగరజీవితం మొట్టమొదట విస్మయ కారకంగా ఉంటే తరువాత క్రొత్తగానూ ఇంకా తరువాత చప్పగానూ, ఆతరువాత అరుంతుదంగానూ తయారయ్యింది. ఇది శ్రమజగత్తులో ఉన్న మానవుని మనోవికాసదశ. విఠలుకు తల్లీ అన్నలూ ఉన్నారు. అతనికి గృహమమకారము ఉంది. అతణ్ణి మెచ్చుకునే ప్రపంచం వెలుపల ఒకటున్నదన్న ఆశతో నగర జీవితంలోకి అడుగిడినాడు విఠలు. కాని తిరిగిచూచుకుంటే ఏమీ మిగలలేదు. ఒక్క దాదమాత్రమే ఉన్నాడు. దాద అంటే ఆ విచిత్ర యాంత్రికసభ్యతలోనుంచి తయారైన పవిత్ర కుటుంబీకుడు. విఠలు తల్లీ అన్నలూ జన్మతః కుటుంబీకులు. శ్రమజీవితంలో దారుణంగా వికాసము పొందిన మానవునకు జన్మతహా ఉన్న తొలి బాంధవ్యాలు నశించి శ్రమపరంగా తయారైన ఒక విచిత్ర బాంధవ్యం ఏర్పడుతుందని ఈ కథలోని నీతి చెబుతున్నది. ఏజాతి, వృత్తి, వంశ సంస్కారాలను మన చరిత్రలూ, శాస్త్రాలు అవిచ్ఛేద్యాలు అని ఘోషిస్తున్నాయో అవి అంతికృతకాలు అని ఈ కథ నిరూపిస్తుంది. బాలకుని ఉత్సాహభరితమైన అడుగుల సవ్వడిలోనుంచి ఈ కథ వెలువడి అతని నిరాశ పొగలతో దట్టంగా కార్కొనిపోయి చివరకు ఒక కఠోరసత్యం మీద కరుడుగట్టి మన హృదయాన్ని కూడా ఘనీభవింపజేస్తుంది. జీవితపు పునరావృత్తులు కాక పునరాలోచింపబడిన జీవితపు విలువలతో కూడిన పరిణామ పరంపరలే పుష్టములై ఈకథను కరుణవర్ధకంగా అల్లివేసినాయి.

ఇది ఒక అధివాస్తవికమైన కథ.

# కొత్త జీవితం



అది ఫాక్టరీ కూలీలకోసం పెట్టిన హోటల్. అక్కడ అర్ధణాకు "చా" దొరుకుతుంది. అణాపెడితే కాసిని "భజ్యా" తిని "చా" తాగవచ్చు. సాహసించి ఇంకో అర్ధణా ఖర్చు పెట్టదలచినవాడు "పాప్-ఉసల్" తో పొట్టనింపుకుని "చా" త్రాగిపోవచ్చు. "భజ్యా" అంటే శనగ పిండితో చేసిన పకోడిలు. "పాప్" అంటే నాలుగాన్నుల రొట్టె, "ఉసల్" అంటే శనగలుగాని అల్చందలుగాని వేసి నీటితో మరగ బెట్టిన కూర, అందులో రొట్టె ముంచుకు తినవచ్చు.

ఉదయం ఏడున్నరకల్లా ఫాక్టరీ పనివాళ్ళు ఒకొక్కరే వచ్చి కూచుని హిందీలోనూ, మహారాష్ట్రంలోనూ తమకు కావలసిన ఆహార పదార్థాలు అతితొందరగా ఆర్డరివ్వసాగారు. పదార్థాలందించేవాడేకాక, గల్లా దగ్గర కూర్చున్న వాడు కూడా, తినేవాళ్ళ అవసరాలు కనుక్కుంటున్నాడు.

ఈహోటల్లోకి ఒక కుర్రాడు వచ్చాడు. అందరి కళ్ళూ వాడు తొడుక్కున్న కొత్త చొక్కామీదా, కొత్త ధోవతి మీదా పడ్డాయి. కాని వాడి పల్లెటూరి మొహం తెలిసి పోతూనే ఉంది. కుర్రాణ్ణి ఒక గుండ్రడసి బల్ల దగ్గర కూర్చొ బెట్టి వస్తువు లందించేవాడు, "కాయ్ పాహిజేతుములా ?" అని అడిగాడు.

కుర్రాడికీ ప్రశ్న అర్థమయిందిగాని వాడు వెంటనే సమాధానం చెప్పలేదు. వాడి మొహానికి అడుగున్నర దూరంలో పెద్ద గాజు జాడీనిండా తెల్లటి మజ్జిగ పోసి పెట్టి

ఉంది. బల్లమీద పరచిన చలవరాతి పలకలు నేలమీద పరచిన నున్నటి కృత్రిమ చలువరాతి పలకలూ వాడికి అత్యాశ్చర్యం కలిగించాయి. ఈ హోటలుకు జమీందార్లుకూడా వస్తారని వాడికి దృఢవిశ్వాసం కలిగింది. బల్లలదగ్గర కూర్చున్న వాళ్ళల్లో జమీందార్లెవరన్నా ఉన్నారేమో చూతామంటే మజ్జిగ జాడీ మూలంగా సాధ్యపడలేదు.

"ఏంకావాలి?" అని మళ్ళీ అడిగాడు వస్తువు లందించే వాడు.

"ఏమున్నయ్ ?" అన్నాడు కుర్రాడు, హోటలు వాడు అన్నీ ఏకరవు పెట్టాడు, "పూరీ, శిరా, బటాటా, పావ్, ఉసల్, భజ్యా, చా, లెమన్, తాక్, షర్బత్ ..."

కుర్రాడు జాగర్తగలవాడు. అన్నిటిధరలూ కనుక్కొని రెండణాలన్నర దాటకుండా ఆర్డరిచ్చాడు.

హోటలునుంచి ఫాక్టరీకి ఎంతో దూరంలేదు కొండ ప్రక్కగా వెళ్లే అందమైన రోడ్డు నేరుగా ఫాక్టరీల దగ్గరికి తీసుకుపోతుంది. రోడ్డు ప్రక్క వరసగా ఇరవై ఇళ్ళున్నాయి. కొత్తగా కట్టినవి. చాలా అందమైనవి. వాటినిదాటి ఒక అర ఫర్లాంగు అవతల మూడో ఫాక్టరీ ఉంది. ఆరోడ్డు వెంబడి వచ్చాడు కుర్రాడు. వాడికేదన్నా కూలిపని కావాలి.

మొదటి ఫాక్టరీ నిర్జీవంగా కనిపించింది. రెండో ఫాక్టరీ గేటుకెదురుగా రోడ్డుఆవలి వేపున నలుగురైదుగురు

మనుషులు నిలబడి ఉన్నారు. వాళ్లూ పనికోసమే నిలబడి ఉన్నారని మన కుర్రాడికి తెలియదు, వాడు గేటుదగ్గర నిలబడిఉన్న పఠానువాణ్ణి గమనించకుండా గేటుదగ్గరికిపోయి లోపలికి తొంగిచూశాడు. లోపల చాలా అందంగా ఉన్నది. ఒకపక్కగా చిన్న కంచెమీద అందమైన లత ఒకటి పాకుతున్నది. దాని వెనుక కొన్ని తోట్ల మొక్కలు చక్కగా పెట్టారు. ఫాక్టరీ చాలా లోపలిగా ఉన్నది.

పనిచేస్తే ఇటువంటి ఫాక్టరీలో పనిచెయ్యాలి అనుకున్నాడు వాడు. పెట్టిపుట్టిన పనివాళ్ళు అటువంటి చోట పనికి కుదురుతారనుకున్నాడు.

ఇంతలో – పఠాన్ గొంతు వినిపించింది.

"ఏయ్, ఏంకావాలి ?"

కుర్రాడికి హిందీ ఏమీరాదు, కాని ప్రశ్న అర్థమయింది.

"పని" అన్నాడు వాడు.

పోయి వాళ్ళదగ్గర నిలబడు... అదుగో యజమాని కారు వెళ్లు, వెళ్లు, వెళ్లు !

కంగారుతో కుర్రాడు రోడ్డుదాటి అవతల పడ్డాడు. వాడవతలికి వెళ్లిన తక్షణంలోనే నల్లని కారొకటి అతివేగంగా వచ్చి గేటులోకి తిరిగి లోపలికి వెళ్లిపోయింది.

ఆ కారులోఉన్న మాలిక్ తనను గేటుదగ్గర చూసి కోపం తెచ్చుకున్నాడేమో, తనకుపని ఇవ్వడేమోనని కుర్రాడికి బాధకలిగింది. ఆ నల్లకారు కిందపడ్డా వాడికంత బాధకలిగి ఉండదు.

౨

ఫాక్టరీల ముందు నిత్యమూ పనికోసం నుంచునే వాళ్లను చూస్తే ఆశ్చర్యం వేస్తుంది. ఆ ఫాక్టరీలలో ఏం చేస్తారో వారికి అవసరంలేదు. అది వనస్పతి ఫాక్టరీగానీ లోహపు ఫాక్టరీగానీ, బట్టల మిల్లుకానీ వాళ్లకు ఒకటే. చదువు వెంటపెట్టుకు పోయేవాడికి ఉద్యోగం దొరకదగిన స్థలాలూ దొరకదగని స్థలాలు అంటూ ఉంటాయి. వాడు తన వెంట ఏదో తెచ్చుకుంటాడు. పారిశ్రామిక కూలి తన వెంట తన కండలూ, ఎముకలూ తప్ప ఇంకేమీ తీసుకురాడు. గొట్టంలోంచి పొగవచ్చే ఏ చోటైనా వాడికి పోదగిన చోటే. ఏచోటు అచ్చివచ్చేదీ, ఏది అచ్చిరానిదీ దైవాధీనం ఒక ఫాక్టరీలో నాలుగు రోజులే ఉండవచ్చు, మరొక ఫాక్టరీలో నాలుగు నెలలు ఉండవచ్చు. కాని కాలక్రమాన ఏదీ అచ్చిరాని చోటే, ఎందుచేతనంటే నాలుగేళ్లు ఏ ఫాక్టరీలోనూ ఉండడు. ఆతరువాత మళ్ళీ జీవితం ఎప్పటి చోటికి రావటమంటే పనివాడు తన కండలన్నీ ఉన్నవి ఉన్నట్టు వెనక్కు

చెప్పుకుంటాడనికాదు. అది ఎన్నటికీ జరగదు. అంతో ఇంతో రక్తమూ, కండలూ ఫ్యాక్టరీకి ముట్టవలసిందే, ఫ్యాక్టరీలనుంచి బయటికివచ్చే సమయానికి పొరపాటున నాలుగు డబ్బులు జేబులో మిగిలినా అవిపూర్తిగా అయిపోతేగాని మళ్ళీ ఇంకోచోట పనికుదరదు. ఒక్కొక్కసారి డబ్బులయిపోయినాక కూడా చాలాకాలం పనికుదరదు. ఇది కూలివాళ్ళకు అమ్మవారి శాపం సులభముగా పనిదొరికే యుద్ధకాలంలోనే ఈవిధంగా ఉంటే ఇతర సమయాల సంగతి వేరేచెప్పాలా ?

ఆఫ్యాక్టరీ బయట పనికోసం నిలబడ్డవారిలో ఒకరిద్దరు చాలా రోజుల నుంచీ పని దొరకని వారున్నారు. ఫ్యాక్టరీ ప్రారంభమైన అరగంటలోగా పని దొరికేదీ లేనిదీ తెలిసి పోతుంది. ఆ తరువాత ఇంకోచోటికి వెళ్ళి లాభం ఉండదు. అంతా లాటరీ.

ఈ లాటరీలో మన కుర్రాడి అదృష్టం బాగున్నది. యజమాని కారు లోపలికి వెళ్ళిన కొద్దిసేపట్లో లోపలినుంచి ఎవరోవచ్చి నిలబడి ఉన్నవాళ్ళకేసి ఒక్కసారిచూసి "తుమ్ ఆవ్, తుమ్ ఆవ్" అని మన కుర్రవాణ్ణి మరొక యువకుణ్ణి లోపలికి పిలుచుకు వెళ్ళాడు. ఇదిబొత్తిగా లాటరీ అనటానికి కూడా వీలులేదు. ఇది ఫ్యాక్టరీ స్వయంవరం ఇందులో కండ పుష్టి, యవ్వనమూ చప్పున ఆకర్షిస్తాయి లోపలికి పోయిన తరువాత ఆమనిషి మన కుర్రవాని వంక తిరిగి చాలా తొందర పనిమీదఉన్న వాడల్లే మాట్లాడుతూ, "నీ పేరేమిటి ?" అన్నాడు.

విఠల్ పాండురంగ్

ఎప్పుడన్నా ఫాక్టరీలో పనిచేశావా ?

లేదు.

రోజుకు మూడుపావలాలు మజ్దూరీ మూడుపావలాలు మాంగాయీ. ఈ ఖాతాలో పనిచెయ్యి.

తనకు నిజంగా ఎంతో గొప్ప గౌరవం జరిగినట్టు భావించుకున్నాడు విఠల్. రోజుకు రూపాయిన్నర చొప్పున నెలకు? కనీసం 25రోజులు పనిచేసినా ముప్పైఏడున్నర అయింది! ఏడాదికి? 450 రూపాయలు! తమ ఊళ్లో ఆడా మగా పిల్లా మేకా కలిసి ఏడాది పొడుగునా వాళ్లు విదుచుకున్నా పొలంపనిలో అంత రాదే! ఎంత అదృష్టం! ... అదీకాక ఎటువంటి పని! ఎంత తేలికైన పని! ఎంత శుభ్రమైన చోటు! మట్టిలేదు. బురదలేదు. ఫాక్టరీ వొదలిన మరుక్షణం చీకూచింతా లేదు. రోజుకు ఎనిమిదిగంటలు! తమపల్లెటూళ్లో పనికి అంతూ పొంతూ ఉందా? ఎంతచేసినా తరగదు, ఈ పట్టణంలో ఎన్ని బస్సులు ఎన్ని ట్రాములు ఎన్ని సినిమాలు! ఎంత బస్తీ!

ఒకమూల ఆవరణలోనే ఒక లారీ నిలబడి ఉన్నది. ఆ లారీ నిండా లోహపు అచ్చులున్నాయి. నలుగురు పని వాళ్ళు లారీలోకి ఎక్కి ఆ అచ్చులను కిందవున్న కూలీలకు అందిస్తున్నారు. క్రిందవున్న పనివాళ్ళు వాటిని లోపలికి తీసు

కుపోయి వేస్తున్నారు. అవి రాగిదిమ్మలు. ఎర్రగావున్నాయి. వాటిని లోపలికి చేర వెయ్యమని విఠల్‌ను నియోగించారు. ప్రతి కూలివాడూ ఒక్కొక్కచేత్తో ఒక్కొక్క దిమ్మ పట్టుకుని నడుచుకుంటూ పోతున్నాడు. రెండు మూడుసార్లు విఠల్ కూడా రెండేసి చొప్పునే పట్టుకు పోయినాడు కాని ఆ దిమ్మలను రెండు చేతులకూ అడ్డంగా పెట్టేవాళ్లింటే మూడేసికూడా మొయ్యవచ్చు ననిపించింది. ఈసారి లారీ దగ్గరికి వచ్చినప్పుడు విఠల్ చేతులు రెండూ ముందుకుపెట్టి వాటిమీద దిమ్మలు పెట్టమని లారీలో నిలబడ్డ కూలీకి సూచించాడు.

"చాల్లే గొప్ప పనివాడివి! అందుకో అన్నాడు" లారీలోవాడు.

మూడేసి పట్టుకుపోతా అన్నాడు విఠల్.

అందరూ చేసినట్టు చెయ్యి అన్నాడు లారీలోవాడు. తానే విఠల్‌యజమానిలాగా. విఠల్ నిరుత్సాహపడ్డాడు.

## ౩

విఠల్ పనిలో ప్రవేశించి నాలుగురోజు లయింది. అప్పటికి వాడికి ఫాక్టరీకొత్త తీరింది. మనుష్యులుకొత్త తీరింది. కాని ఫాక్టరీ పనివైనం వాడికర్థంకాలేదు. ఇది మనిషి చెయ్యగల పనేగాని మనుషులు చేసినట్లు చేసేపని కాదు. ఈపని ఎవరో తరుముకొస్తున్నట్టుగా చెయ్యాలిసిన పని. పాటలు

పాడుతూ, మాట్లాడుతూ చేసేపని కాదు. ఇష్టమై చేస్తున్నట్లుగా చేసేపనికాదు. అందుచేత నేగామాలు ఈ ఫాక్టరీ కూలీలు తాను చేసేపనిమీద ఏదో పగ ఉన్నట్లు చేస్తారు గాని ఆప్యాయంగా చెయ్యరు. చేసేపనిగురించి మాట్లాడరు. మాట్లాడినా గుమస్తా మాట్లాడుతారు.

మిగిలిన పనివాళ్ళు మొట్టమొదటిరోజు తనను చాలా వేళాకోళం పట్టించారు. మొదటి కారణం తన దుస్తులు.

నీవు కూలీవా ముకద్దమువా ? అని అడిగారు వాళ్ళు నవ్వుతూ. ఒక పెద్దవాడు "రేపణ్ణుంచీ పనిచేసే గుడ్డలు, వేసే తెచ్చుకో - ఇక్కడ నిజంగా పని ఉంటున్నది." అన్నాడు చాలా మంచిగా నిజానికి వాళ్లందరూ కుళ్లు గుడ్డలే వేసుకున్నారు. వాళ్ళే కాదు, "సాబ్"లు కూడాకుళ్ళు గుడ్డలే వేసుకున్నారు.

మిగిలిన పనివాళ్ళు ఏ తరగతినుంచి వచ్చిందీ విఠల్ గ్రహించలేకపోయినాడు. కాని వాళ్ళెవ్వరికీ తనకున్న హోదా ఇంటిదగ్గర లేదేమో ననిపించింది. ఇంటిదగ్గర తనవాళ్లు గౌరవ కుటుంబీకులు. కాకపోతే కొద్ది పొలంమీద చాలామంది పడి తినటంచేత కొంత అప్పయింది. తన ఉత్సాహంకొద్దీ తాను పట్నంవచ్చాడుగాని తననెవరూ పొమ్మనలేదు. ఏరోజు తన కిష్టంలేకపోతే ఆరోజు తానీపని మానేసి ఇంటికిపోతాడు. కాని, పాపం వీళ్ళ గతేంటి ? వీళ్ళలో చాలామంది ఎన్నో ఏళ్ళుగా ఈచాకిరీ చేస్తున్నారు. ఈపని లేకపోతే వీళ్లు వీధిలో నిలబడి అడుక్కుతినాలి.

మచ్చుకు భయ్యా ఉన్నాడు. వాడు వెయ్యిమైళ్ళ దూరంనుంచివచ్చి ఇక్కడపడ్డాడు. వాడు వేలిముద్రగాడు. చదువు రాకపోవడమేకాక వొత్తి మట్టిబుర్ర. అందరూ ఏడిపిస్తారు. బండపని వాడికి చెబుతారు. వాడికి అలుసంటే ఏమిటో తెలియదు. వాడువచ్చి ఎన్నోరోజులు కాలేదు. పనిలో చేరింది లగాయతు వాడు అర్థణాపెట్టి టీ త్రాగిన పాపానపోలేదు ఇన్నాళ్ళవాడు తిండికూడా తినడంలేదుట. తనగదిలో - ఇంకా ఆరుగురుకూడా ఆగదిలోనే ఉంటున్నారు- వాడు శనగలు నానేసుకుని అవే తింటున్నాట్ట. వెధవకు తెగులు పుట్టుకొచ్చి మొహమంతా ఉబ్బింది. కళ్ళవెంట పుసులు కారసాగాయి.

నీకేం బుద్ధిలేదా! శనగలు తింటే చచ్చిపోతావు నీకు పెళ్ళామా పిల్లలా? సంపాదించిందంతా హాయిగా తిన లేవా? రాయంటి వొళ్లు మట్టి చేసుకుంటావు జాగ్రత్త అని "చాచా" వాణ్ణి గట్టిగా కోప్పడ్డాడు.

"చాచా" పఠాన్ పేరు రహమాన్ అందరూ "చాచా" అని పిలుస్తారు. వయస్సు 62.1914 యుద్ధంలో యుద్ధరంగాన మైళ్ళనడిచాడు. ఇప్పటికీ పుష్టిగా బలంగా ఉన్నాడు. ఒక నాడు "చాచా" విఠల్‌కు తనకథ చెప్పాడు. యుద్ధంనుంచితిరిగి వెళ్ళిన తరువాత "చాచా" తాను మిగుల్చుకున్న డబ్బుతో సరిహద్దున కొంత పొలం కొన్నాడు. పత్రాలు సాక్ష్యాలు లేవు. అక్కడి వాళ్ళకి కచేరీలలో నమ్మకం లేదల్లే ఉంది. పొలం అమ్మినవాడు ఏదో పేచీపెట్టి "చాచా"ను పొలం

మీాదినుంచి పంపించాలని చూశాడు. పొలంలోకి అడుగు పెడితే సంపుతా అన్నాడు. "చాచా" పొలం అమ్మినవాడి మనిషివచ్చి "చాచా" చెయ్యి పట్టుకుని ఒకసారి అవతలికి రా. ఒక్కమాట వినిపోదువుగాని అన్నాడు.

చెయ్యి వదులు అన్నాడు. "చాచా"

వాడువదల్లేదు. రెండో చేతిలోఉన్న కర్రతో చాచా వాడి మనికట్టుకు ఎగువగా ఒకటేదెబ్బ పెట్టాడు, వాడిచెయ్యి విరిగింది. "చాచా"ను మూడేళ్ళు ఖైదులో ఉంచారు.

ఖైదులోనుంచి వస్తూనే "చాచా" కొత్తఉద్యోగం చూసుకున్నాడు. "డాకు" ఉద్యోగం.

"డాకు"అంటే దొంగకాదుఅన్నాడు చాచా గర్వంగా. అదొక ఉద్యోగం. చాలా కష్టమైన ఉద్యోగం. నీభార్యా బిడ్డల్ని నువ్వు రహస్యంగా పోయి చూడాలిసిందేగాని వాళ్ళకు నువ్వుండేచోటు చెప్పటానికి వీల్లేదు.

డాకూలు ఎక్కడుంటారు ?

ఎక్కడుంటారు ? ఎవరికీ తెలీకుండా ఏకొండల్లోనో అడవుల్లోనో ఉండాలి.

ఎవరూ చూడరారూ ?

రావచ్చు, కాని నాకు అంతదూరంలో నిలబడాలిసిందే నా సరసన నిలబడటానికి వీల్లేదు - తమ్ముడయేది, తండ్రి అయేది !

ఏమట్లా ?

డాకు ఎవర్నీ నమ్మడు. డాకూను పట్టిస్తే సర్కారు డబ్బిస్తుంది. దగ్గరవాళ్ళే కక్కుర్తి పడవచ్చు. అందుచేత ఎదురుగా నిలబడడు! అంతే! పక్కకిరాకు! భుజంమీద చెయ్యి వేశావా?—

"చాచా" తనభుజంమీద ఎవరో వేసినచేతిని ఒక్కసారిగా తోసేసి వాడిమీద తుపాకీబారు చేసినట్టు అభినయించాడు. ఒక్కక్షణంపాటు చాచా కళ్ళల్లో డాకుచూపు కనిపించినట్టే తోచింది విఠల్‌కు.

౪

అవకాశం దొరికినప్పుడల్లా విఠల్ లెక్క వేస్తుండేవాడు. తాను నెలకు హీనంగా పది రూపాయలు మిగల్చవచ్చు. కొంచెం కష్టపడితే పదమూడు పధ్నాలుగు కూడా మిగల్చవచ్చు. ఇంటిదగ్గిర రెండువొందల యాభై బాకీవుంది. మిగిలిన డబ్బంతా ఇంటికి పంపేస్తే రెండేళ్ళలో బాకీ తీరిపోతుంది.

మొదటి నెల పన్నెండురూపాయ లింటికి పంపించినప్పుడు విఠల్ ఆనందానికి మేర లేదు. తననుగురించి తనతల్లీ అన్నలూ ఎంత సంతోషిస్తారో వాడు ఊహించుకున్నాడు. ఆ మనియార్డరుతో బాటే తానుకూడ వెళ్ళి మొహాలు చూడాలనిపించింది. ఇల్లు గొడ్లు, పొలము జ్ఞాపకము రాగానే కడుపులో ఏదో ఆవేదన కలిగింది. కాని అభిమానం అడ్డొచ్చింది. అప్పుతీర్చిగాని ఇంటికి తిరిగిపోరాదు. కనీసం సగం అప్పన్నా అధమం

యాభై (50) రూపాయలన్నా చెల్లువేసి మరీ వెళ్ళాలి. ఏమీ లేదు తనకు ఛార్జి ఎవరిస్తారు? ఒకవేళ ఇచ్చినా ఇంటికి వెళ్ళి రావాలంటే ఒక నెల మిగిల్చేదంతా ఖర్చన్నమాటే. నెలల్లా చేసిన శ్రమంతా వృథా!

రెండో నెల గడిచింది. మూడో నెలా, నాలుగో నెలా కూడా గడిచాయి. ఇప్పుడు విఠల్‌కు ఒంట్లోవున్న జవసత్వాలు లేవు. ఆ "చా" దుకాణంలో తినేది తనకు పడటంలేదు. ఒక్కసారి ఇంటితిండి తినటానికైనా వెళ్ళిరావాలనిపించింది. కాని ఎట్లా? మొదట్లో ఫాక్టరీనుంచి ఇంటికి వెళ్ళేటప్పుడే నీరసంగా ఉండేదిగాని, తెల్లవారి నిద్రలేచినతరువాత ఉత్సాహంగానే ఉండేది. ఇప్పుడిప్పుడు వాడికి నిద్రవల్ల శరీరంబడలిక తీరటంలేదు.

"వెధవ తిండి, వెధవ పని, వెధవ బతుకు!" అనుకునే వాడు విఠల్. తిండికన్నా, పనికన్నా, ఈ బ్రతుకే వింతగా ఉండేది వాడికి. తాను ఇక్కడ ఎట్లా బతుకుతున్నదీ చెబితే ఇంటిదగ్గర ఎవరూ నమ్మరు. ఈజీవితం శుద్ధ అబద్ధమట. ఇట్లా జీవిస్తూ తాను మారువేషం వేస్తున్నాడని విఠల్ భావించాడు. ఆబాకీ తీరిన మరుక్షణం తాను ఫ్యాక్టరీకి చిన్న సలాంకొట్టి ఇంటికి తిరిగిపోతాడని తనతోటి పనివాళ్ళెరుగరు. తాను ఇక్కడ ఏవిధంగా జీవిస్తున్నదీ ఇంటిదగ్గర తనవాళ్ళకు తెలేదు.

ఇప్పటికి తాను 30 రూపాయల బాకీ తీర్చేశాడు. ఇక ఇంటికి పోతేనేం? ఆబాకీ అంతా తీర్చాలని తనలో తాను శపథం చేసుకున్నాడేగాని ఎవరూ తనచేత చేయించలేదు.

అదంతా తాను తీర్చేయ్యవలసిన అగత్యంకూడా లేదు. కాని ఇంటికి పోదామని నిశ్చయం చేసుకున్నప్పుడల్లా విఠల్ అంత రాత్రి "నీవు సుహాషిని కావా!" అనిఅడిగేది.

విఠల్ ఈసందిగ్ధంలో ఉండగా ఫాక్టరీలో సమ్మె వచ్చింది. ఆరోజుల్లో సమ్మెలు చీటికిమాటికి జరగటంలేదు. ఇది కార్మికనాయకత్వంతో కూడిన అధికార సమ్మెకూడా కాదు డిసూజా అను ఫోర్మనుకూ ఒకపనివాడికి కొద్దిరోజులుగా ముసుగులో గుద్దులాట జరుగుతూ అది ఒకనాడు "నువ్వాం టే నువ్వే" అనుకునేదాకావచ్చింది. ఫాక్టరీ యజమాని డిసూజా పక్షనై ఆపనివాణ్ణి తొలగించినాడు. నోటీసైనా లేకుండ అప్పటికప్పుడు పనివాళ్ళంతా సమ్మెనిర్ణయించారు. ఎక్కడివాళ్ళక్కడ పని వదిలేసి ఆవరణలోకి వచ్చారు అందరూ తలాఒక్క మాట మాట్లాడుతున్నారు. ఇద్దరేసి, ముగ్గురేసి, నలుగురేసి ముఠాలుగాచేరి, అవుననీ, కాదనీ ఘర్షణ పడసాగారు.

ఫాక్టరీ మేనేజరు బయటికివచ్చి "ఒక్కనిమిషంలో లోపలికి వచ్చి పనిచెయ్యని వాళ్ళందర్ని బయటికి పంపించేస్తాను" అన్నాడు. కొంతమంది లోపలికి వెళ్ళారు. విఠల్ కూడా వాళ్ళతోబాటు లోపలికి వెళ్ళాడు మిగిలిన వాళ్ళను బయటికి పొమ్మన్నాడు.

తీరా లోపలికి వచ్చిన తరువాత విఠల్ ఆశ్చర్యపడ్డాడు. లోపలికి వచ్చినవాళ్ళు ఇరవైమందికూడా లేరు. దాదాపు యాభైమంది వెళ్లిపోయినారు. అందరూ లోపలికి

వస్తారనుకున్నాడు విఠల్. "'సాబ్'' మాటలకు కూలీలు ఎదురు చెప్పట మంటూ ఉంటుందని విఠల్‌కు సందేహముకూడా కలుగలేదు. ఈ సంగతి ముందు తెలిస్తే తానుకూడా బయటకే వెళ్లేవాణ్ణనుకున్నాడు.

రెండు గంటలపాటు ఫ్యాక్టరీలో ఏ పనీ లేదు. ఫ్యాక్టరీ కేదో పెద్దసుస్తీ చేసినట్టయింది. లోపల్నుంచి బయటికి, బయటి నుంచి లోపలికి ఏం రాయబారాలు జరిగాయో విఠల్ ఎరుగడు. రెండు గంటలు దాటిన తరువాత ఫ్యాక్టరీ బయట పెద్ద పెడబొబ్బ వినిపించింది. బయటికిపోయిన వాళ్లంతా పరిగెత్తుకుంటూ లోపలికి వచ్చారు, "జీత్ గయా! సాలా" అనే ముక్క ప్రతినోటా వినిపించింది. పనివాళ్లలో అంత ఉత్సాహం విఠల్ ఎన్నడూ చూడలేదు...... సమ్మె అయిపోయింది. తీసేసినమనిషినీ మళ్లీ లోపలికి రానిచ్చారు...

ఒక మహారాష్ట్రీ పనివాడు నేరుగా విఠల్ దగ్గరకు వచ్చి ఎందుకో చెప్పకుండా మహారాష్ట్రభాషలో తిట్టిపొయ్య సాగాడు నాకేమి తెలియదు బాబో, అనివిఠల్ ఎంతచెప్పినా వాడి ధోరణి ఆగలేదు. అందరు సమ్మెచేస్తే తాను చెయ్యనందుకు యజమాని తనకు మెచ్చి మేకతోలు కప్పకపోయినా పనివాళ్లకు చాలా కోపం తెప్పించినట్లు విఠల్ గ్రహించాడు. ఇదొక పీడగా తోచింది వాడికి. వీళ్లంతా ఎందుకు పని మానాలో విఠల్‌కు నిజంగా అర్థంకాలేదు. కాని పైకి ఆమాట అనలేదు.

ఈ ఫ్యాక్టరీ పనిలో పనివాళ్లు జులుం ఒకటి విధిగా ఉంటుందని మాత్రం వాడు గ్రహించాడు.

ఇంకో రెండు నెల్లు గడిచింది, విఠల్ తల్లికి సుస్తీగా ఉందని ఉత్తరము వచ్చింది. అసలే పెద్దది. విఠల్ ఆఖరు బిడ్డ, వాడికి తల్లిని చూస్తే పంచప్రాణాలు,

"చాచా, మాఅమ్మకు జబ్బుగావుంది. నేను వెళ్లాలి. ఎట్లా?" అన్నాడు విఠల్.

"శెలవు పెట్టిపో, ఫోర్మన్‌తో చెప్పు, జీతం మట్టుకు రాదు" అన్నాడు చాచా.

"వెధవ జీవితం అన్నాడు విఠల్ వాడికి వారంరోజులు శెలవు దొరికింది. ఆ రోజు సాయంకాలమే స్వగ్రామానికి బయలుదేరాడు.

ౠ

తిరిగి స్వగ్రామం కంటపడగానే విఠల్‌గుండె కేదో అయింది. అంతా నిన్న చూచినట్టే వుంది. ఒక్క రవ్వయినా మార్పు లేదు. ఎంతోమంది ఎరిగినవాళ్ళు కనిపించారు. నిన్న కూడా తనను చూసినట్టే మాట్లాడారుగాని తనను క్రొత్తగా చూడలేదు. "ఎట్లావుంది పట్నం?" ఈ ఒక్కప్రశ్నే వాళ్ళు వేసింది. కొద్దిమంది మాత్రం "ఎందుకెళ్ళావురా పట్నం?" అని అడిగారు. ఇదంతా విఠల్‌కు ఏమీ ఉత్సాహకరంగా లేదు. ఇంటికెళ్ళాడు.

నడవలో తల్లి తన రెండోకూతురి పిల్లని ఒళ్ళో పెట్టుకుని ఏదో అనిపిస్తున్నది. మనిషి మామూలుగానే వుంది. జబ్బేమీ ఉన్నట్టు కనపడలేదు.

"అమ్మా నీ జబ్బెట్లావుంది?" అని తల్లి నడిగాడు విఠల్.

"ఏం జబ్బురా!– అదప్పుడే పోయింది. వచ్చావేం?" అన్నది తల్లి.

విఠల్‌కు ఏదో అర్థంకాని బాధ కలిగింది. "వారం రోజులే శలవు తీసుకున్నా" అన్నాడు విఠల్, ఇంతేనా, అని తల్లి అంటుందేమోనని.

"అట్లాగా? అన్నది తల్లి. "అట్లా అయితే నీకు కావలసినవన్నీ చేయించుకు తిను. అక్కడి తిండి ఎట్లావుంటుందో"

"తిండిమాట అడక్కు! చాలా అసహ్యం" అన్నాడు విఠల్.

తల్లి కొడుక్కేసి జాలిగా చూసింది. కొడుక్కు కొంత ఉపశాంతి కలిగింది.

ఇంతలో పెద్దన్న వచ్చాడు. తమ్ముణ్ణి చూడగానే "అయిపోయింది నౌకరీ?" అన్నాడు, చాలా నిరాశ కనబరుస్తు. నే నసలు వెళ్ళొద్దనే అన్నాను.

"శలవు తీసుకొచ్చా. వెళ్ళితే ఏం నష్టమయిందీ? దాదాపు యనభై రూపాయ లప్పు తీరిందా, లేదా?" అన్నాడు విఠల్. తాను డబ్బు పంపిన సంగతి వాళ్ళెవ్వరు స్మరించేటట్టు లేరు.

"ఇట్లా తీరే అప్పు అది?" అంటూ అన్న లోపలికి వెళ్ళాడు.

''ఏమిటమ్మా! నేను పంపిన డబ్బుతో బాకీ తీర్చ లేదా'' అన్నాడు విఠల్ తల్లితో.

తల్లి పెద్దగా నవ్వి, ''తీరుద్దామనే అనుకున్నాంగానీ ఏదో ఓఖర్చు వచ్చింది. నువు పెద్దవాడివై సంపాదిస్తున్నా వుగా? తీర కేంజేస్తుందిలే?'' అన్నది చాలా ధైర్యంగా.

''ఒక్క రూపాయికూడ బాకీక్రింద చెల్లు వెయ్య లేదా?'' అన్నాడు విఠల్ ఆశ్చర్యంతో.

''ఇంకా లేదు'' అన్నది తల్లి నిబ్బరంగా.

''నే పంపిందంతా ఏమయిపట్టా?'' అన్నాడు విఠల్ చిరాకుతో.

''నేను పారేశానుట్రా? నీవు మొదటిసారి పంపించి నప్పుడు మీనూ వాళ్ళిక్కడే వున్నారు. దాని కూతురు చేతులు బొత్తిగా బోసిగా వుంటే ఇంకా రెండురూపాయలు వేసి చేతుల కేవో చేయించా. పెద్దకూతు రంటే పడిచస్తూం టారనీ గారి కూతురికూడ రెండో నెల్లో ఏదో చేయించా. ఆడపిల్లలకే పెడుతుం దంటారని ఇంట్లో పిల్లలికి అవీఇవీ కొన్నా. పైకం నాపేర పంపించావు కనక కాస్త నా పెద్దరి కానికి తగ్గట్టు చేశా మరి. బాకీ తీర్చమని నువ్వేమన్నా రాశావా?'' అన్నది తల్లి కొంచెం దెప్పుగా.

విఠల్‌కు చాలా ఆశాభంగం కలిగింది. చూస్తున్న కొద్దీ తనవాళ్ళంతా వొట్టి ఆశపాతకులుగాను, దోపిడిగాళ్ళు గాను, ఇతరుల కష్టసుఖాలు తెలుసుకోలేనివాళ్ళుగాను కను పించారు. తనను ఆరునెల్ల తరువాత చూసి ఒక్కరైనా

నిజంగా సంతోషించలేదు. అందరూ కలసి సంపాదించిన దంతా తానుఒక్కడూ సంపాదిస్తే ఒక్కరు మెచ్చుకోలేదు. తాను చెమటోడ్చి గడ్డి తిని సంపాదించిన డబ్బు వెనకా ముందూ చూడకుండ అలాములు పలాములు చేశారు.

విఠల్ తన ఫ్యాక్టరీని జ్ఞాపకం తెచ్చుకున్నాడు. ఒక్క కూలివాణ్ణి తీసేసినందుకు ఫ్యాక్టరీలోవున్న కూలీలంతా బయటికి నడిచారే! వాళ్ళా మనుషులు వీళ్ళా? తనమీద 'చాచా' కున్న అభిమానంలో నూరోవంతు తన ఇంట్లోవాళ్ళందరికి కలిపినా వున్నదా?

"[illegible] పని లాభంలేదు. ఇక్కడ జీవితమే [illegible]. నేను ఇటువంటి వాణ్ణేగా, ఆరు నెల్ల కిందటిదాకా! ఇక్కడ వుండి లాభంలేదు."

మరునాడే విఠల్ పట్నానికి ప్రయాణమైనాడు. 'అప్పుడేనా' అన్నారందరు. కాని వాళ్ళకు తాను నిజంగా ఉండి పోవాలని ఉన్నట్టు విఠల్‌కు తోచలేదు.

"కాదు వెళ్ళాలి! రోజుకు రూపాయిన్నర నిష్కారణంగా పోతుంది. అమ్మకు జబ్బంటే వచ్చానుగానీ, రాకనే పోదును" అన్నాడు.

"అట్లా అయితే వెళ్ళు పాపం!" అన్నారందరూ.

విఠల్ ఈసారి నిజమైన పారిశ్రామిక కార్మికుడుగా పట్నం ప్రవేశించాడు. పట్నం అతన్ని తన గర్భంలో ఏ మూలో దాచుకున్నది. అతని దగ్గర్నుంచి తల్లికి మళ్ళీ ఒక్క ఎర్ర ఏగానీకూడ మనియార్డరుద్వారా చేరలేదు.

# శ్రీ నోరి నరసింహ శాస్త్రి

కవిసమ్రాట్ నోరినరసింహ శాస్త్రిగారు 1900 సం॥లో గుంటూరుజిల్లాలో జన్మించినారు. శ్రీ దేవీ భాగవతము వీరి పద్యకృతి. ఏతత్కృతి సమర్పణసభలో సామ్రాజ్యాభిషేక పురస్సరముగా 1947 లో శాస్త్రి గారికి కవిసమ్రాడ్బిరుద మొసంగబడినది. వీరు బి. ఏ., బి. యల్. ప్యాసయి 1925 నుండి న్యాయవాదవృత్తిని చేపట్టినారు. ప్రస్తుత నివాసము రేపల్లె. వీరి ఇతర రచనలు గీతమాలిక, సోమనాథ విజయము, భాగవతావతరణము, నారాయణభట్టు, రుద్రమదేవి, మల్లారెడ్డి, కర్పూర ద్వీపయాత్ర మొదలైనవి. వీరు చారిత్రికనవలలు వ్రాయుటలో సిద్ధహస్తులు. 'నారాయణభట్టు' నన్నయకాలమును ప్రతిబింబించిన నవల. ఈ నవల 1950లో తెలుగు భాషాసమితి బహుమానము నందినది. 'రుద్రమదేవి' తిక్కనకాలమును సూచించునది. దీనిని ఢిల్లీ సాహిత్య ఎకాడమీ భాషాంతరీకరణమునకు నిర్ణయించినది. 'మల్లారెడ్డి' ఎర్రన కాలమునకు చెందిన నవల. కవిత్రయమువారి చరిత్రకాలమును నవలాబద్ధ మొనర్చి శాస్త్రిగారు తెలుగులో చారిత్రికనవలల లేనిలోటును తీర్చి ప్రముఖ రచయితలుగానూ, కవులుగానూ ప్రసిద్ధివడసినారు.

# కథ

అపరిమేయుడు అనంతుడైన భార్గవుడు పరిమితిని, అంతమును ఆశించినాడు. నిరవధికమై సర్వకాలములమీద ప్రవహించిన అతని గానము, అతని వయస్సు, అతని అనుభూతులు దుస్సహములై చివరకు స్వనాశమును కోరుకున్నవి. అనంతమైనసృష్టిలో సాంతుడుగా జీవించుచున్న మనుష్యుని ఆరాటమిదియే. విశాలసృష్టిలో విశాలముగా జీవించవలెనన్నది అతని ఆశయముకాదు. ఆ వైశాల్యమును కొన్ని గుటకలలో చప్పుచప్పున మ్రింగి క్షణికమైనను పూర్ణతృప్తిని పొందవలెను. ఈసాంద్రానుభూతులవలననే అతనిజీవితము బాల్య, యౌవన, కౌమారములుగా తునిగి చివరకు వార్ధకముగా నశించిపోవుచున్నది. తాను నశించిపోవుటకైనను సిద్ధపడును గాని ప్రత్యేకతావిహీనమైన అనంతదేశకాలములలో అతడు నిలువలేడు. ఎక్కువతైలముపోసి ఎక్కువప్రకాశముతో జీవితదీపమును వెలిగించుకొనుటయే అతనివేడుక. ఈ కథలో భార్గవుని వేణుగానము జీవునిగతి. ఆజీవునియొక్క క్రొత్తనీ, లేతనీ రాను రాను ముదురగుచు చివరకు నశించుచున్న అనుభూతులే జీవపరముగా బాల్య, యౌవన, కౌమార, వార్ధకములు, సృష్టిపరముగా భూతభవిష్యద్వర్తమాన కాలములు, వ్యాసునిపరముగా సర్వనాశనచిహ్నములు. వ్యాసుడు శుద్ధచైతన్యమునకు సంకేతము. ఈకథ పౌ రా ణి క భా వ లో కాలమునకు చెప్పబడిన వ్యాఖ్యానము.

ఇది వ్యాఖ్యాత్మకమైన కథ.



# భవిష్యత్తు

౧

ఇప్పటి కైదువేల యారువందల సంవత్సరముల క్రిందట కలిపురుషుడు లోకములో నడుగుపెట్టి యుండలేదు. ద్వాపర యుగము జరుగుచుండెను. తన రెండుపాదములు క్షీణించినను శేషించిన రెండుపాదములతో ధర్మవృషభము ఎట్లెట్లో నడయాడుచు తృప్తినందుచుండెను. ఋషుల కింకను నివాసార్థము నైమిశారణ్యము చేరవలసిన యవసరము రాకపోవుటచే, భరతఖండమందచ్చటచ్చట మనోహరములగు దివ్యాశ్రమములు నిర్మించుకొని భూత భవిష్య ద్వర్తమానములు తెలిసిన తపోధనులగు సత్యర్షులు వాసము చేయుచుండిరి.

అట్టి యాద్వాపర పుణ్యకాలమున భార్గవుడను నొక మహాకవి యుండెడివాడు. ఆఋషికుమారునికి సంసారముగాని బంధువులుగాని, స్నేహితులుగాని లేరు. తనదని చెప్పుకొనుటకు గృహమైనను, గ్రామమైనను, దేశమైననుగూడ నతనికి లేదు. అతని కెన్నేండ్లుండెనోకూడ నెవ్వరికి దెలియదు. ఎప్పుడు చూచిన నతడు బాలునివలెనే కనుపడుచుండెను. అతడు విశాలమగు ప్రపంచమునందును, అనంతమగుకాలమునందును లీన మగుటచే నతని కందు ప్రత్యేక స్థానమనునది లేకుండెను. అతడు జనపదమునుండి జనపదమునకును నగరమునుండి నగరమునకును, అరణ్యమునుండి యరణ్యమునకును ఆశ్ర

మమునుండి ఆశ్రమమునకును తన వల్లకీతంత్రులు మీటుచు నద్భుతములగు తన గీతములు పాడుచు, సర్వర్తువులయందు సంచరించుచుండును. ఆతని పాటకు స్థానములేదు. సమయము లేదు. ఒక్కొక్కప్పుడు ఆకాశము మేఘావృతమై గర్జించుచు సలిలధారలు వర్షించు నిశీథ సమయములం దతడు మహారణ్యాంతములం దేకాంతముగా బోవుచు వర్షపాత ధ్వనితో శ్రుతి మేళవించి యద్భుత రస ముట్టిపడునట్లు గానము చేయగా నచ్చటి వనదేవత నీ దివ్య డెవరా యని యబ్బురపడుచు నాలకింతురు. గ్రీష్మమధ్యందినార్కుడు నభోమధ్యమున దేదీప్యమానుడై వెలుగుచు లోకమును తపింపజేయుచుండు కొన్ని మధ్యాహ్న సమయములందును అతని గీతనాదములు వివిక్తగిరిగహ్వరాంతరముల బ్రతిధ్వనులీనుచుండ పర్వతరాజు లవి యభ్యసించుచున్నా రనిపించు చుండును. అవ్యక్త ప్రదేశమునుండి యవ్యక్తదేశమునకు బోవు సూర్యభగవానుని కెదురుగా గూరుచుండి ఉదయాస్తమయ సమయములం దాతడు పాడుచు తనరాగచ్ఛాయలతో ప్రకృతిని సమ్మోహ పరచుచుండును. మరియు నొక్కొక్కప్పు డతడు మునులు యాగము లొనర్చు యజ్ఞవాటికలకు బోయి యపర సామగానము లగు తన గీతములచే నచ్చటి ఋషుల కాశ్చర్యము కలిగించుచుండును. ఇట్టి ప్రశాంత మోహనప్రదేశములే కాక ఆతని గాన మాహాత్మ్యమును జనసమూహములతో గలకల లాడు పురములును కొన్ని వేళల ననుభవించుచుండెడివి. అతడు పురవీథుల వాడల బాడుచు బోవుచుండ వ్యర్థ చింతా పరాయణులగు పురజను లాతని గీతరాగ బ్రహ్మానందము

ననుభవించి, తాత్కాలికముగ ముగ్ధులై యిహలోక చింతలు మఱచి, కొంతవడికి సుషుప్తినుండి మేల్కాంచినవారివలె దమ పనులపై బోవుచు నీ యద్భుత బాలకు డెవడా యని యాశ్చర్యము నొందుచుందురు.

కాని భార్గవుని నొకఁడును బలుకరింపరు. ఆతని పేరు గాని, యూరుగాని, పుట్టువుగాని, కులముగాని, గోత్రముగాని తెలుసుకొను వాంఛ యెవరికిని గలుగదు. అతని కవిత్వము వలెనే యతని విషయము సాంతము నద్భుతమై యానందమును గలిగించుచుండుటచే నతని నెవ్వరు నేమియు బ్రశ్నింపరు. పంచమస్వరమున మధురాలాపములు చేయు కోయిల పేరు అడుగువా రెవరు? స్వేచ్ఛగా గంతులు వేయుచు, నొక కోన నుండి యొకకోనకు బరుగులెత్తు సెలయేటికి యూ రెక్కడిది? సత్యప్రతిపాదన మొనర్చు నోంకారమునకు పుట్టు వేల తెలుసుకొన వలెను?

లోకమున భార్గవుడు గానముచేయని విషయము లేదు. గభీరమగు సముద్రమును, అనంతమగు బ్రహ్మాండమును, విచిత్రమగు భూమియు, సదాగతియగు వాయువును, అక్షయములగు భువనములును, అశేషములగు గోళములను అతడు వర్ణించుచుండును. అతని కవిత్వమున లీనమందుట కెంతటి యుదాత్త వస్తువును గొప్పది కాదు. ఎట్టి పరమ పరమాణువైనను నీచము కాదు. సృష్టియందలి సమస్తమును అతని సంగీత రసమున నేకమై ప్రవహించును. అత డేది గానము చేసినను, సామాన్య విషయమైనను, విశేష విషయమైనను,

అద్భుత మావహింప జేయును. ఆతడు జ్ఞానియో అజ్ఞానియో యెవ్వరును జెప్పలేరు. భూమియందును, ఆకాశమందును, సముద్రమునందును, అరణ్యములందును, ఎడారియందును, జనపదమందును, అంతరాత్మయందును, బహిర్జగమునందును, దేశమందును, కాలమందును — అంతట గల యజ్ఞేయ మగు నద్భుతరస మాతని నావహించెను. ఆ యద్భుతానుభూతియే యతని కవిత్వముగా రూపొంది రాగరసస్నాతములై బ్రవహించుచుండును.

౨

బాలరూపుడై లోకమందలి యద్భుతములను గానము చేయుచు సంచరించు భార్గవునకు అంతకంతకు ఆ యద్భుతమే భారము కాజొచ్చినది. అతనికేగాక యతని మూలమున సమస్త ప్రకృతికిని, సృష్టికిని ఆనందము కూర్చుచుండిన యజ్ఞాతమగు నా సృష్ట్యద్భుతమే యతనికి గొంతకాలమునకు దుస్సహమైనది. భూత, భవిష్య, ద్వర్తమానములు తెలిసికొనినగాని యతని కా భారము తీరి తృప్తి కలుగునట్లు తోపలేదు.

ఇట్లుండగా నా ఋషిపుత్రున కొకనా డాకస్మికముగా కంఠస్వరము గద్గద మయ్యెను, హస్తాంగుళులు కంపమందెను. మనసు స్తంభించెను. తుద కాతని విపంచీతంత్రులు సడలి స్వరహీనము లయ్యెను.

భార్గవు డాపైన నొక్క క్షణమైనను అందు నిలువలేక పోయెను. సృష్టి యద్భుతమైన దను జ్ఞాన మాతనికి జాల లేదు. కాలస్వరూపములు దెలిసికొనవలె నను తృష్ణ దుర్భర మైనది.

ఎప్పుడు వీణాస్వన మాగిపోయెనో ఆ క్షణముననే యతడు త్రికాలజ్ఞుడును, సాక్షా న్నారాయణస్వరూపుడును నగు వేదవ్యాసుని సేవింప నాతురుడై పరువెత్తెను. అత డప్పు డా మునీశ్వరుని చరణారవిందములు సేవింపవలెనను చింత తప్ప ఇతరము సమస్తము మఱచియుండెను.

వేదవ్యాసుడును దీనవదనుడై పరుగెత్తుకొని వచ్చు చున్న యా ఋషి కుమారుని జూచి, 'భార్గవా! అదృష్టశాలి వగు నీ కీ దైన్యము నొంద బనియేమి?' అని సాదరముగా ప్రశ్నించెను.

భార్గవుడు వినీతుడై వ్యాసునికి పాదాభివందన మొన ర్చుచు, "మహాత్మా! భూత భవిష్య ద్వర్తమానములను దెలిసికొను శక్తి త్రికాలవేదులగు తమయొద్ద గ్రహించుట కీ దీనుడు దేవర పాదకమలము లాశ్రయించుచున్నాడు" అని విన్నవించుకొనెను.

"భూత భవిష్య ద్వర్తమాన జ్ఞానముతో నీ కేమిపని? ఇట్టి వెఱ్ఱియూహాలు మాని, అద్భుత రసమొలుకు నీ కవితా గానముతో నాకు కర్ణపేయ మొనర్పుము!"

"నేను సృష్టిలోని యద్భుతభారము సహింపజాల కున్నాను. ఈ యద్భుతము చెదరిపోవునట్లు నన్ను త్రికాలజ్ఞుని జేసి యనుగ్రహింపుడు!"

"త్రికాలజ్ఞత నీకు ప్రయోజనకారి కాదు. నామాట నమ్ముము!"

"భగవానులమాట నేను కాదనను. కాని నేనీ యద్భుత భారముతో క్రుంగిపోవుచున్నాను. నాకు లాభ మైనను, నష్టమైనను కాలజ్ఞత కలుగువరకు మీ పాదములు విడువను!" అనుచు భార్గవు డతి కరుణముగా ప్రార్థించెను.

వేదవ్యాసుడు జాలిపడెను. భగవానుడు దీర్ఘకాలము ధ్యానించి యిట్లనెను.

"వత్సా! లెమ్ము! ఆత్మఘాతియగు కోరిక నీవు కోరు టచే ఇచ్చుటకు నా మన సొప్పకున్నది. భూతకాలజ్ఞత నీ కిచ్చెదను. దీనితో తృప్తినొందుము! — నీ కన్నులు మూసి కొనుము!"

భార్గవుడు మహాప్రసాదమని కన్నులు మూసికొనెను. వ్యాసభగవానుడు తన యమృత హస్తముతో మృదువుగా నాతని కన్నులు స్పృశించి యికబొమ్మని యనుజ్ఞ యిచ్చెను.

భార్గవుడు కన్నులు తెఱచి చూచునప్పటికి వేద వ్యాసు డదృశ్యు డయ్యెను. అంతట నతడు తన్ను దా జూచు కొనగా బాలరూపము మాఱి కౌమారావస్థ వచ్చియుండుట గుర్తించి మిక్కిలి యచ్చెరు వందెను. కాని యతని కిప్పుడు

భూతవిషయము లన్నియు కన్నుల గట్టినట్లు పొడకట్టెను. సమస్తములగు పురాణములు, ఇతిహాసములు, నతనికి గరత లామలకము లయ్యెను. అతని యద్భుత భారమును తగ్గిపోవు టచే యథాప్రకార మాతడు తన వీణను సవరించుకొని సడలిన తంత్రులు సరిచేసి మనోహరముగా గానముచేయుచు బయలు దేరెను.

కౌమారావస్థ నొందిన భార్గవుని జూచి యందరు నాశ్చర్యము నందిరి. అతని గీతములును మారిపోయినవి. ప్రకృతిని సమస్తమును తనలో లీన మొనరించుకొను నద్భుతమగు మాధురిమ యతని సంగీతమున నంతరించినది. అతడును విజన ప్రదేశముల బాడుట చాలించెను. సృష్టి కథనమును. శ్రీదేవి లీలలును, శ్రీ మహావిష్ణువు నవతారములును, సాంబసదాశివుని మాహాత్మ్యమును, మహారాజుల చరిత్రములును — పురాణములును ఇతిహాసములును ఆ ఋషి కుమారుడు గానముచేయ నారంభించెను. జను లిప్పుడు గుంపులు గుంపులుగా గూడి యతనిని వెంబడించుచు భూతకాలజ్ఞు డగు నితడు పాడెడి విచిత్రవృత్తముల నానందముతో నాకర్ణించుచుండిరి.

## 3

కొంతకాల మిట్లు గడచెను. భూతకాలమున గీర్తింప వలసిన వృత్తము లన్నియు నతడు పూర్తిగా గానముచేసెను. భార్గవుని యాత్మలో నిన్నాళ్ళు నడగియున్న యసంతృప్తి

యిప్పుడు మరల దలచూపసాగినది. భూతజ్ఞత యతనికి సంపూర్ణ తుష్టి కలిగింపలేదు. అవిజ్ఞాతములై యద్భుత కౌతుక మూనహింపజేయు భవిష్య ద్వర్తమానముల భార మతడు భరింపలేకపోయెను. తుదకొకనాడు మరల నతని విపంచి పలుకుట మాని నీరవ మయ్యెను.

తత్తఱముతో భార్గవుడు మరల వేదవ్యాసుని సన్నిధికి బయగ్తైను. వేదవ్యాసుడు భార్గవుని యాగమనకారణ మెఱిగి విషణ్ణు డయ్యెను. "అయ్యో, భార్గవకుమారా! నీ యానందమును పోగొట్టుకొనుటకు వచ్చితివా?" అని భగవానుడు ప్రశ్నించెను.

భార్గవుడు వేదవ్యాసుని పాదములు వదలక, "దేవా! నా హృదయ భారమును లఘు వొనరించుకొనుటకు వచ్చితిని. మీ కరుణాతిశయముచే భూతజ్ఞుడ నయితిని. నాకు భవిష్య ద్వర్తమానము కూడ ప్రసాదింపవే!" అని కరుణముగా ప్రార్థించెను.

వేదవ్యాసుడు చేయునదిలేక చివరకు, "సరే, ఇప్పుడు వర్తమాన కాలజ్ఞానముకూడ నీ కిచ్చుచున్నాను. ఇక తిరిగి మాత్రము నాయొద్దకు రావద్దుసుమా!" అని కఠినముగా బల్కి మాయమయ్యెను

భార్గవుడు సంతోషముతో మరల దనవీణ సరిచేసికొని బయలుదేఱెను. అతని కిప్పుడు యౌవనావస్థ వచ్చినది. అతని కెల్లప్పుడును వర్తమాన స్థితి యంతయును గోచరించు

చుండెను. వర్తమానకాలమును గూర్చియు, వృత్తాంతముల గూర్చియు నిప్పు డాతడు పాడసాగినాడు. కాని గీతమునందు పూర్వ మునులకుండెడి యానంద మంతరించి యిప్పు డది సంతోష మాత్రముగా మారినది. జనులును అతని పాటలు సంతోషముతో నాలకించి ప్రత్యక్షమునను, పరోక్షమునను భార్గవుని, భార్గవుని కవిత్వమును వేవిధముల ప్రస్తుతింపసాగిరి.

"ఈ యువకుని కవిత్వము అజ్ఞాతములగు కృత్రిమ మార్గములు వదలి సుబోధము లగు ఋజుమార్గముల నిప్పటికి ప్రవేశించినది!" అని యెల్లరు ప్రశంసలు చేయుచుండ భార్గవుని కా పొగడ్తలు శ్రవణపర్వము గావించుచుండెను.

క్రొత్తగా తనకు ప్రాప్తించిన వర్తమానజ్ఞతగాని జనసామాన్యములు చేయు స్తుతిపాఠములుగాని ఆ యువకుని కెక్కువకాలము తృప్తి నీయలేదు. అవి త్వరలోనే యతనికి విసుగు పుట్టింపగ నష్టముకూడ కలిగింపసాగెను. కొలదికాలమునకే యతడు బడలినవానివలె జూపట్టెను. హస్తములు కంపించి కంపించి నిశ్చేష్టములైనవి. నాలుక తడియాఱి యెండు వాఱినది. వీణాస్వర మాగిపోయినది. భావిజ్ఞానతృష్ణ యాతని హృదయము నిప్పుడు వేధింపసాగినది. మహాత్ముడగు వేదవ్యాసుడిక తనయొద్దకు మరల రావలదని నిషేధించినది జ్ఞప్తికిరాగా, కింకర్తవ్యతా విమూఢుడై భార్గవుడు కొంతవడి సందేహించుచు నిస్తబ్ధుడై నిలుచుండెను. కాని యాతని పాదము లతనికి దెలియకుండగనే యతనిని దీసికొనిపోయి వేదవ్యాసునియెదుట నిలిపెను.

౪

కృష్ణవర్ణుడగు వేదవ్యాసుని మూర్తి యిప్పుడు చూడ మనోహరమై సౌమ్యత వహించెను. ముఖమున దరహాసము వ్యక్తమగుచుండ భగవానుడు భార్గవునివంక తీక్ష్ణదృష్టి పరపించెను.

అట్టి వ్యాసభగవానుని యాకారము గాంచి భార్గవుడు సంభ్రమించెను. అతని సర్వాంగములను స్వేదాంకురము లుదయించెను. గద్గదికనొంది కంపమొందుచున్న స్వరముతో భార్గవుడు, "భగవన్, తమ యాజ్ఞ నుల్లంఘించిన యీ శిష్యుని యపరాధము మన్నింపుడు! ఈ దీనుడు చేయగలిగినది వేఱేమియు లేక యిటు వచ్చినాడు!" అని యతి కరుణముగా బలికి రోదనముచేయ నారంభించెను. అశ్రుధార లా యువకుని నేత్రాబ్జములనుండి ప్రవహించి యతని విపంచిని కూడ తడిపివేసెను.

వేదవ్యాసు డాతని దీనాకారము గాంచి జాలినందెను. భగవానుని ముఖమున గాంభీర్య మించుక సడలెను. అజ్ఞాత విషయములు తెలిసికొనవలెనను వాంఛ యుదయించిన పిమ్మట నది యసంపూర్ణ జ్ఞానముతో తనివినందదని భగవానునకు స్పష్టముగా దెలియును. ఐనను భార్గవుని యాత్మనాశనమునకు దాను నిమిత్తభూతుడగుటగూడ వ్యాసుల కేమాత్ర మిష్టము లేదు.

"వత్సా! నీ విప్పుడు వాంఛించునది నీ సర్వస్వ నాశనమునకే సుమా! భవిష్యజ్జ్ఞానము శుభప్రదము కాదు. అంత మాత్రమైనను లోకమున నజ్ఞాతమై యద్భుత మనిపింప జేయు విషయ మున్ననే గాని కవితాత్ముడవగు నీవు జీవించుటయే దుర్లభము!"

వేదవ్యాసుడు పల్కిన వాక్యములు విని భార్గవు డేమాత్రము చలింపక స్థిరుడై "దేవా! నా కోర్కె సంపూర్ణముగా సిద్ధింపజేసి నన్ననుగ్రహింపుము!" అని ప్రార్థించెను.

వ్యాసభగవాను డామాట లాలించి యించుక సంచలించెను. భార్గవునియెడ గురుపాదులకు గల యగాధమగు ప్రేమాతిశయమే నెనుకాడించెను. కాని వెంటనే యా లోకైక గురుడు హృదయము దృఢపఱచుకొని, "ఇదిగో! నీ ప్రారబ్ధ కర్మఫల మనుభవింపుము!" అనుచు భార్గవుని నేత్రములు వడివడి స్పృశించి యదృశ్యు డయ్యెను.

భవిష్యత్ జ్ఞానము కలుగగనే భార్గవుడు కఠోర స్వర నాదముతో నార్తస్వరము చేసెను. అతని చేతులనుండి యెన్నడు తొలగని యాతని దివ్యవీణ జాఱి భూమిపైబడి బ్రద్దలై మూల్గినది. దానితంత్రులన్నియు తుత్తునియలుగా తెగిపోవుచు రోదనధ్వని యొనర్చెను.

భార్గవునికి వార్థకము వచ్చినది. అతని కేశములన్నియు పలితము లైనవి. అతడు త్రికాలజ్ఞు డయ్యెను. అతని కిప్పుడు లోకములలో నద్భుత మనునది యేదియు లేకుండ నశించెను.

అంతట గ్రీష్మాగమమున నల్పజలాశయము వలె నతని హృదయము శూన్యమయ్యెను.

* * *

మరల నీ లోకములో భార్గవుని గీతాస్వర మెక్కడను వినరాలేదు. అతని గానమాధురి శాశ్వతముగా ప్రపంచము నుండి యంతరించెను. కాని యతనిసంగీతమున బ్రహ్మానందము పొందిన ప్రకృతి పూర్వమైత్రిస్మరించి యిప్పటికిని నిరంతరము నిట్టూర్పులు పుచ్చుచు నప్పు డప్పుడు కన్నీరు కార్చుచుండును

—o—

# శ్రీ అవసరాల సూర్యారావు

శ్రీ అవసరాల సూర్యారావుగారు కాకినాడ తాలూకాలో 1923లో జన్మించినారు. విద్యార్థిదశనుండే అనేక జాతీయ, సాహిత్యోద్యమాల్లో పాల్గొన్నారు. బి. ఎ. ప్యాసయ్యారు. కొంతకాలం 'వందేమాతరం' 'విశాలాంధ్ర' పత్రికలలో సహాయ సంపాదకులుగా పని చేశారు.

వీరికథలు 'ఆకాశదీపాలు', 'అవసరాలకథలు' అనేపేరుతో రెండు సంపుటాలుగా వెలువడినాయి. దాదాపు 40 కథలు వ్రాశారు. గాలిమేడలు, నల్లబూర్లు, ఆడబోతున్న నాటకం, అనేవి వీరి నాటికలు. ఇటీవల వ్రాసిన మంజీరం (నాటకం) ఆంధ్రనాటక కళాపరిషత్తు, రాఘవ పరిషత్తులనుండి పలురకాల బహుమతుల్ని పొందింది. నాటకం చాలాచోట్ల ప్రదర్శింపబడి ప్రశంసల నందింది. ఇవిగాక సూర్యారావుగారు ఎన్నో విమర్శనావ్యాసాలు, అనువాదాలు, గేయాలు వ్రాశారు. మహాకవి గురజాడ వారి వ్రాత ప్రతుల నన్నింటినీ సంపాదించి వాటిని సంపుటాలుగా ఎడిట్ చేశారు. ప్రస్తుతం ఆంధ్రప్రభ దినపత్రికలో సహాయ సంపాదకులు.



# కథ

ఈ కథలో సాంబయ్య పోలీసు. తన పిల్లవానికి తాను ఫీజు ఎందుకు కట్టలేక పోతున్నాడో తెలుసుకోలేని అమాయకుడు. తాను పోలీసు కాబట్టి తన కొడుకు రిజర్వు పోలీసన్నా అయితే బాగుండునన్న చిన్న స్వార్థం కలిగిన చిన్న ఆశాజీవి. డెక్ కాలుతున్నా మాటనిలబెట్టుకోవటానికి ఓడమీద నుంచున్న కెసాబియాంకా నైతిక-విలువన్నీ [illegible] చేసుకోలేని అల్పుడు. ఇలాంటి పోలీసును చూచి జాలిపడాలా అసహ్యించుకోవాలా? ఈ పోలీసు నిరపరాధులమీద తుపాకి పేల్చుతున్నాడు. దీనికి కారణం పోలీసు కాదు, పోలీసుతనం. ఇంతకు ముందున్న మనస్తత్వశాస్త్ర కథకులు ఈ కారణాలను 'పరిస్థితులు' అన్న పదంనుంచి వెతుక్కున్నారు. కాని పరిస్థితిలో అస్పష్టత ఉంది. అందువల్ల అభ్యుదయ కథలకు పరిస్థితికి బదులు 'వ్యవస్థ' అనేది స్పష్టంగా కనిపించింది. పోలీసు నిరపరాధుల్ని చంపడం, మాధవుడు పుస్తకాలు కొనుక్కోలేక పోవడం, విద్యార్థులు సమ్మెచేయడం, ఇవన్నీ ఒకేరోగ బీజంనుంచి వికసించిన రకరకాల అనారోగ్యాలు. అన్నిటికీ కారణం వ్యవస్థ. ఇది ఈ కథ సర్వావయవాల్లోనూ అతిజాగ్రత్తగా సన్నివేశపరచి చూపెట్టబడింది.

తీవ్రమైన అనుభూతిలో జీవితానికి హత్తుకుపోయే సంఘటనలను సృష్టించి హృదయంలోకి చొచ్చుకుంటూ పోయే మెరుపువంటి భాషావేగంతో వెన్నలాంటి మృదువైన పాత్రలను చికిలి చేసి అతి కటు సత్యాలను అతికరుణ దృశ్యంగా చెప్పాడు అవసరాల.

ఇది రసవిపర్యాసక రసప్రధానమైన కథ.



# ఊరేగింపు

దూరంగా బుకబుక్కలవాడు 'అంబా! పలుకూ! జగదంబా పలుకూ!' అని అరుస్తున్నాడు. నర్సమ్మ కళ్లాపు జల్లుకుందుకు కళ్ళు నులుపుకుంటూ లేచింది. ఎదురుగా కుక్కి మంచంమీద మాధవుడు మూడంకె వేసుకొని పడుకున్నాడు. వీపు తట్టుతూ నర్సమ్మ 'నెగరా! నెగూ!' అన్నది.

పొయ్యిలో పిల్లిపిల్లలా ముడుచుకు ముడుచుకు పడుకున్నాడు మాధవుడు. "శనేశ్వగ్డు! సదువ్వ్యాసెత్తుతే చాలు, మొద్దు నిద్దర!"

కొడుకు బుజాలను పట్టుకుని గుంజింది తల్లి; ఉలుక్కు పడి లేచాడు కొడుకు. 'నెధనసదువు!'

'హాం! మారే! ఎదవ సదువు, అబ్బాయిగారికి! తోటి బొట్టెడు వేణులాగే సదువుతాట్రా?'

దీర్ఘాలుతీస్తూ తల్లి తన పాతచీర తెచ్చి నాలుగుపొరలు వేసింది. కొడుకు వొంటినిండా కప్పి జారిపోకుండా గొంతుకట్టు వేసింగ! మాధవుడు చిర్రు బుర్రు లాడుతూ లేచాడు. 'ఉహుహు' అని గునిసేడు. బుంగమూతి పెట్టాడు.

ఏట్రా! నీకా సీకాకూ! నువ్వు సదువు సదివి నా ఒళ్లో పోయక్కర్లేదులే. సదువుకుంటావేమో! కలెక్టేర్లు చేస్తావ్.

పెళ్ళాం ఒళ్ళో దోసిళ్ళకొద్దీ గుమ్మరించి పోస్తావ్! ఆలికష్టం పెట్టడం ఊరికే సకారమేట్రా?'

పొద్దున్నే పెళ్ళాం మాట చెవిని పడిందీ; కాస్త్రవాడికి కులుకు హెచ్చింది. రాని పెళ్ళామంటే ఎంతరోసు!

పేకేజీపెట్టెలోని పుస్తకాలుతీసి గుడ్డిదీపంముందు కూచున్నాడు కొడుకు పుస్తకం తెరిచేదాకా నుంచుని, కడ వళ్ళో పేడ్నీళ్ళు పట్టుకొని బయటకు వెళ్ళింది, గదిలో కాస్పటికి కప్పుడే తిన పెసిమిటి లేచి చుట్టకాల్చుకుంటున్నాడు. బయట గుమ్మంలో ముక్కుతో కూనిరాగం తీస్తున్న భార్య గొంతుల గణగణ చదువుతున్న కొడుకు. ఇద్దరూ మనసులో మసలి నట్లయి కళ్ళు మూసుకుని చుట్టపొగవొదులుతున్న సాంబయ్య చిరునవ్వు నవ్వుకున్నాడు.

మాధవుడు 'ది బోయ్ స్టుడాస్ట్ బర్నింగ్ డెక్ ... బర్నింగ్...బర్నింగ్ డెక్' అని చదువుకుపోతున్నాడు. ఇంటి వాసాలు ఎగిరేటంతగా గొంతుక హెచ్చించాడు. చదువుకుం టున్న కొడుకుజుత్తు గాలి కెగురుతూంటే ముచ్చటగాచూస్తూ మురిసిపోతున్నాడు తండ్రి. చుట్టపొగవదిలి నోరెళ్ళబెట్టాడు పొగ గదిలో సున్నాలు చుడుతోంది.

బయట చలిగాలి రొప్పుకొస్తోంది. ఉబ్బసం వాడిలా గురగురమంటున్న గాలి; దిక్కుమాలినగాలి. వొళ్ళంతా సూదులు గుచ్చుతున్నట్టు వెధవ గాలి. గాలిని తిట్టుకుంటూ సాంబయ్య మొహం కడుక్కుంటున్నాడు. బయట కల్లాపు జల్లి ముక్కుతో కూనిరాగాలు తీస్తోంది నర్సమ్మ.

నాలుగక్షరాలనీ అటూ ఇటూ కొట్టిపారేస్తాడు. మాధవుడికి నరనరం తెగిపోతున్నట్టే మరి!

ఆపూటనుంచీ తనపేరు పిలువకపోతే ఎంత 'యిది' గా వుంటుందనీ! అందర్నీ పేరుపేరునా పిలుస్తూంటే అంతా 'హియర్ సార్! ప్రెజంట్ సార్' అంటూంటే' తను చిట్ట చివారి బెంచిలో సత్రకాయలా కూచుంటున్నాడు. కుర్రాళ్ళంతా తనకేసి చూస్తూంటే ఆ చూపులు కమ్మరి పుగుల్లా తనమూలంచి పాకుతున్నట్టే వుంటాయ్!

కొత్త పుస్తకాలు స్కూలుస్టోర్సుకురావడమేతరవాయి, కుర్రాళ్ళంతా వెంటనే కొనుక్కుని అట్టలు వేసుకుని మహా విరగబాటుగా క్లాసుకు వస్తారు. కొత్త పుస్తకాలు! యించక్కని ఎంత కమ్మని వాసనవి!

తనకెప్పుడూ ఎరువు పుస్తకాలే. సెకండుహేండ్ పుస్తకాలే. ఛ...ఛ... స్కూలు బంట్రోతు సీతన్నగాడికికూడా తను లోకువే!

వేణు చాలా మంచివాడు. అడగడమే తడువు, పాపం తన కేమి కావాలంటే అది యిస్తాడు. సగం సగం చదువుతున్నా సరే, పుస్తకం యిమ్మంటేచాలు, చదువు మానుకునైనా మాధవుడి కిస్తాడు. వేణు హిస్టరీ చదువుతూంటే తను జాగ్రఫీ వాడు తెలుగుబుక్కు చదువుతూంటే తను ఇంగ్లీషూ చదివి సరిపెట్టుకుంటున్నాడు.

మాధవుడి గొంతుక కుంచుకుపోయింది. కళ్ళమ్మటనీళ్లు తిరిగి నోటికి ఉప్పగా తగిలాయి. గుటకలు మింగాడు.

'బర్నింగ్; కాలుచున్న; నౌన్; హా హాహాః! కాదురా బాబూ! కాదూ... యాడ్జెక్టివ్; క్వాలిఫయింగ్‌దీ నౌన్; జెక్; డెక్' కళ్ళెగరేశాడు. నిద్రతూలుతున్నది. చీపురుపుల్ల తీసి ముక్కులో పెట్టుకుని నాలుగు తుమ్మాడు.

'ఎప్పుడూ యింగ్లీషేనా?' అని ప్రశ్నించాడు తండ్రి.

'మరి పుస్తకాల్లేవ్! ఏంచేయమంటావ్?' బుంగమూతి పెట్టాడు కొడుకు.

'ఏదైనా వుంటే ఆతిప్పి మనమీదే తోసేస్తాడు వెధవయ్య!'

నర్సమ్మ లోపలకు వస్తూ 'వేణు నీకు బొక్కులీయడం లేదురా!' అంది.

'స్కూల్లో నా పేరే తీసేశారు!' మాధవుడి గొంతుక తెక్కపడింది.

'బోయ్స్టుడాస్సీ... యీ... యి... యి...' కళ్ళ నీళ్ళతో పుస్తకం తడిసిపోతూంది.

'ఏడుపెందుకురా?'

'ఆడి జీతమేదో పెతీనెలా ఏరేతీసి ఓకాడెట్టరాదా?'

సాంబయ్య కోడిపుంజులాగ మెడసాచి చూశాడు. గొంతుక ముడి అటూ ఇటూ ఆడింది. 'అంతా నా సేతుల లోనే వున్నట్టే టానిందా?

' ఎధవయిదురూపాయలు మిగల్సనేక పోతన్నాం!' తప్పు యిద్దరిదీ అన్నట్టు నర్సమ్మ మొగుడికేసి చూసింది.

మాధవుడు అక్కణ్ణుంచే 'యీ నెలనుంచీ జీతాలెచ్చించారు' అన్నాడు.

'ఎంతా!'

'ఆర్రూపాయలు ముచ్చవకా!'

'మీ ఎడ్మాష్టర్గారికీ మతిపోనాదేట్రా! తాటినీసినులా బుర్రా యీడూను!'

తనకంటె పెద్దవాడైవుండి జీతాలు ఎవరు హెచ్చిస్తారో తెలియనందుకు తండ్రిని చూసి నవ్వుకున్నాడు.

'మా హెడ్మాష్టరు కేమీ పవర్సు లేవు!'

'అయితే ఎవరా ఎచ్చించేవాళ్ళుంట?'

'డైరెక్టుగా గవర్నమెంటే!'

ఈ నెలనుంచీ ఏడురూపాయలు నెలనెలకీ మిగల్చాలనే సరికి సాంబయ్యకు మతిపోయింది. తన జీతంచూస్తే ఏభై. నెలకు యిరవై రూపాయల బియ్యం; తాలింపుకు నూనె, తలకి నూనె, ఉప్పుగల్లూ, మిరపకాయలు, చిల్లరఖర్చుల కిరవై రూపాయలు. తనకి టీ ఖర్చుకీ బీడీలకీ పదీ...శాస్...సరిపోయింది. దుబారాఖర్చు ఎక్కడా కనబడ్డంలేదు.

'నాకు కనక యీ మాయముండా సంసారాన్నీదుకొస్తున్నా'

'పెతి మగోడు అలాగే అనుకుంటాడు. అషుమంటి విషయాలు నా దగ్గిర సెప్పకు. నానేమన్నా దూబరాచేత్తానా నీ ఉద్దాసం!'

'అహాఁ! ఎంతార్జిస్తోన్నా సాలకుండావుందని!'

నిజమే సాంబయ్య ఎంత ఆర్జిస్తోన్నా చాలడం లేదు. తనెంతో తెలివైనవాడు కనక యీ మాయముండా సంసారాన్ని ఈడిసుకు వస్తున్నాడు. చుట్టుపక్కల జమీందార్లకీ రైతులకీ తగాదాలు వస్తాయి. రైతుల పంటల్ని జప్తు చేయించుకు పోతూంటే రైతులు ఎదిరిస్తారు. జమీందారులు ప్రభుత్వానికి కబురు తోలేస్తారు లారీలు వేసుకొని రిజర్వ్ పరుగెడుతుంది. ఓ! అప్పుడు చూసుకోవాలి, రిజర్వ్‌వాళ్ల కుషీ! మేకపోతులూ, గొర్రెలూ, కోళ్ళూ ధుమాధుమా! అల్లరంతా అణచిపెట్టి లారీల్లో పట్టణం వచ్చేస్తున్నప్పుడు దారిలో కనిపించిన ప్రతీ గుట్టమీదా ఆగి కనిపించిన పిండెల్ని తెంపుకుంటారు. ఆనపకాయలు వంగపిండెలు, బీరకాయలూ, మిరపకాయలూ, ఏవి కనిపిస్తే అవీ! రైతెవడైనా ఎదురయితే ముఖం లెడివేఁ అవతలికి పంపించడంకూడా కద్దు. ఆడది కనిపించిందా, 'అబ్బ దాని సోకో! జెబ్బల్దాకా జాకెట్టు'! ఆ పూట గొర్రెపోతును వేయాల్సిందే!

'ఆణ్ణి రిజర్వులో వేయిత్తా'

'ఏనాగో ఓనాగ ఆణ్ణి ముందు సదివిద్దూ!'

చదవడంమాని చెవులు రిక్కించి తండ్రి అనేమాటల్ని వింటున్నాడు. 'రిజర్వ్' అనేసరికి మాధవుడి గుండెలలో రాయి పడింది. ఛా... వెధవ నౌకరీ... నెత్తిమీద వొకపక్కకు వంగిన టోపీ పక్షవాతంవాడి మూతిలాగ. తుత్! రైలు డ్రైవరుద్యోగమైతేనా ఎంచక్క!

తల్లి 'సదవరా సదువు' అనేసరికి కొడుకు 'ది బోయ్ స్టుడ్ స్టిల్ బర్నింగ్ డెక్' అంటూ చదువుతున్నాడు.

'ఇన్ని మాసమూ ఆయిక్కే.. సదువుతున్నావ్; ఏట్రా దానర్థం?'

తండ్రి తనను అర్థం అడగడం చూసి ఎంతో సరదా అనిపించి కొడుకు 'కాలిపోతున్న పడవమీద ఆ పిల్లవాడు నిలువంబడేరు.'

'ఇదేట్రా యీ సిత్రం! కాలిపోతోన్న పడవమీద నిలబడ్డమ్మేటా పారిపోక!' రిజర్వులో చేరాక సాంబయ్య గడించిన అనుభవం అక్షరాలా బయటకు వచ్చింది. నర్సమ్మ పెదవులమీద చిర్నవ్వు వెలసింది.

'నిలబడ్డాడంటే, అంత ధైర్యమన్న మాట కుర్రాడికి!'

'అంత ధైర్యం ఎక్కడా వుండదురా మాధవా!'

'ఉండదంటావేటి? ఈ యింగిలీసు బొక్కులో రాసుంటే?'

'ఏవోయీ సదువులు, మన బుర్రలకి బోదపడవు' అంటూ నర్సమ్మ మగణ్ని వెక్కిరించింది. సాంబయ్య చుట్ట పొగ గుప్పున వదిలేడు.

'అదికాదే అమ్మా! తండ్రి తనొచ్చేదాకా వుండమని కొడుకుతో చెప్పేడే. ఈలోగా పడవ కాలిపోయిందే. తండ్రి వొచ్చేదాకా కొడుకు అలాగా నిలబడ్డాడు. తండ్రిమాటంటే అంత భక్తన్న మాట కొడుక్కి!'

సాంబయ్య ఏదో అనబోతూవుంటే బారకాసులో బిగిలు వినిపించింది. సగం సగం మాటలంటూ సాంబయ్య డ్రిల్లుకు పరుగెత్తుతున్నాడు. పరుగెత్తుతోన్న భర్తని నర్సమ్మ 'ఈపల ఎలాగైనా జీతాలు కట్టేయాల' అంది.

---

౨

'ఈ వేళనుంచీ యింక స్కూలుకి వెళ్ళక్కర్లేదురా!' అన్నాడు వేణు మాధవుడికి ప్రాణం లేచివచ్చింది. కాని వేణు మాట నమ్మడానికి వీల్లేదు.

'ఇప్పుడేం సెలవలమ్మా!'

'అంతా మానేస్తే అవే సెలవులూ!'

'వాస్నీ! మానేయడం మనచేతిలో వున్నట్టు!'

'మరింక ఎవరి చేతుల్లో వుందేవిఁటి?'

'అంతా మానేస్తున్నారా?'

'ఎవరూ రారని కృష్ణ చెప్తేనే యిందాకా,

'బడి మానడం దేనికని?'

'జీతాలు హెచ్చించడం మొదటి కారణం'

'నే నింకా జీతవేఁ కట్టలేదూ!'

'మంచిపనిజేశావ్. కట్టినాళ్ళకి ముద్దిచ్చారేవిఁటి? అందర్నీ తన్నారు.'

"ఎవర్ని"

'గుంటూరులో సృగాడేటున్నా!'

'పోలీసాళ్ళకి పొగరుగా వుందే'

"అందుకే సమ్మె"

"పెద్ద కాలేజీ కూడానా!"

"రాత్రంతా లాఠీ లాఠీ తిరిగి పెద్ద పెద్ద బి. ఎ. వాళ్ళి బడికి రావద్దని చెప్పేశారు కాదుట్రా"

'మరి మాయింటికి రాలేదేం?'

"మీ యిల్లు తెలియదేమో లే!"

"అయితే జీతాలు తగ్గించేస్తారన్న మాట?"

"తగ్గించేవరకు మనం స్కూలుకు వెళ్ళమన్న మాట!"

"హాయ్ హాయ్, హాహాయ్!"

నర్సమ్మ కడిగిన చేపలు డాకలో వేసుకొని వెడుతూ వెడుతూ వేణుని చూసి ఆగింది. "సేపల పులుస్సెట్తా. కూతంత బువ్వ తినరాదటయ్యా!"

"ఛీ" అన్నట్లు వేణు అదోలా మొహం పెట్టాడు.

'పోనీ వొంజరం ముక్కలు కాసిన్ని కాసిన్నంటే, కాసిన్ని తిను.'

తన తల్లి తన స్నేహితునితో చనువుగా మాట్లాడు తున్నందుకు మాధవుడు సరదాగా నవ్వేడు.

'మీ పప్పుకూడుకన్నా మా సెడ్డ రుసిగా ఉంటుంది లే!'

"అయితే పెట్టండి మరి" వేణు కిలకిలా నవ్వాడు. గాజులు గలగల చప్పుడు చేసుకుంటూ చేతులు తిప్పుతూ నర్సమ్మ 'అమ్మో! మీా అమ్మ సంపేయదా?' అంటూ వెళ్ళిపోయింది.

'సాయంత్రం పెద్ద కాలేజీవాళ్ళు మీాటింగులు చేస్తారట'

'ఎందుకూ?'

"అడిగింటే అడుగుతాడూ! రా పోదాం!"

'రైలు స్టేషనుకా?'

'కాదు, స్కూలుకి. ఏం జరుగుతుందో చూద్దాం తమాషా!'

వేణూ, వాడి వెనకాల మాధవుడూ వృత్తి చేతుల్లోంచి బయటకు వెడుతున్నారు. నర్సమ్మ వృత్తి చేతులతో వెడుతున్న కొడుకును చూసి "పుస్త కాలు పట్టుకెళ్ళ తేంరా?" అంది.

'ఈవాళ మా బడికి శలవే అమ్మా!'

మాధవుడు యీాలవేశాడు.

'ఎందుకనీ?'

'మా మాస్టారు చచ్చిపోయారండీ!'

'అయ్యో పాపం!'



## 3

కాలేజి ముందర విద్యార్థులంతా బారులుతీసి నుంచున్నారు. ముందు పెద్ద పెద్దవాళ్ళూ తరువాత పోమాదిరివాళ్ళూ, ఆ వెనక చిన్నవాళ్ళూ వరుసవరుసలుగా క్రైలుపెట్టెల్లా కదిలి వెడుతున్నారు. అట్లాగా జెండాలూ పట్టుకొని ముందున్నవాళ్లు పాడుతున్నారు. మొదటి వరసవాళ్లు పాట పాడగానే వెనకాలవాళ్లు అందుకుంటున్నారు. పాట అంచీగుటూంచ వెళుతున్నది గాలి పాటను తనతో కలుపుకుని దూరంగా ప్రవన్న సరుగుడుతోట సంగీతానికి పోటీపడుతోంది. ఊరేగింపు పాటనుమించి పరుగులు తీస్తున్నది. ఊరేగింపులో కృష్ణ అట్టపట్టుకుని అందరికన్నా ముందే నుంచున్నాడు. నిక్కరు జేబులో చెయ్యిపెట్టుకొని అందరి గొంతులతోనూ తనూ గొంతుకలుపుతున్నాడు. ఊరేగింపు షరాఫ్‌ఖానావారి వీధిలో ప్రవేశించింది. రోడ్డుమీద బంగారపు పొడిలాగా ధగధగ మెరుస్తూ ఎగురుతోంది. వేణూ మాధవుడూ రోడ్డువారనే మెల్లమెల్లగా అడుగులు వేస్తున్నారు. నినాదాలు గింగుర్లు తీస్తున్నాయి. జెండాలు రెపరెపలాడుతున్నాయి. కరపత్రాలు గాలిలో పిట్టలకుమల్లే ఎగురుతున్నాయి. ఊరేగింపు సాగిపోతూంది. పాటలతో నినాదాలతో వీధివీధంతా ప్రతిధ్వనిస్తోంది. కోట గోడలను చీల్చుకుంటూ నినాదాలు తుపాకిగుండుల్లా దూసుకుపోతున్నాయి. కండకంలో కూచున్న మనిషి చిలక్కొట్టు సర్దుకుని గబగబ రోడ్డుమీదకు వచ్చేడు. ఆడవాళ్ళు మేడలమీంచి తొంగి తొంగి చూస్తున్నారు. కుర్రవాళ్ళు గర్రాగా ముందుకుపోతున్నారు.

ఊరేగింపు పోస్టాఫీసుదాకా వచ్చి సాగి సాగి మూడు లాంతర్ల స్తంభంవరకూ సాగి గలగల మంటున్నది. సెలయేటి పాయ నదా ప్రవాహంలో నురుగు తిరిగింది. పెద్దబజారు; సముద్రమంత బజారుకేసి అడుగులు వేసింది. జయజయమని బజారంతా అరుస్తోంది. చొక్కాకుట్టే దర్జీవాడు మిషనాపి తొందర తొందరగా వరండాలోకి వచ్చాడు. సెలూన్‌లోంచి వొక ముసలాయన గడ్డంనిండా సబ్బునురగతోనే రోడ్డుమీదకువచ్చి రెండు చేతులతోనూ నడ్డిపట్టుకొని మెడ పొడగించి మరీ పరికిస్తున్నాడు. ఆయన్ని వెంబడిస్తూనే మంగలికత్తి నూరుకుంటూ తోసుకుతోసుకు వచ్చాడు. గంటస్తంభం ఎప్పుడూ వొకటే గంట. చీమలబారులా ఊరేగింపుసాగిపోతోంది. ఊరేగింపులో కృష్ణ 'విద్యార్థుల మహాసభ! బహిరంగసభ. ప్రముఖుల ఉపన్యాసాలు' అంటూ మెగఫోనులో అరుస్తున్నాడు. బజారు గగ్గోలుగావుంది.

మాధవుణ్ని మోచేత్తో పొడుస్తూ వేణు 'చూడు చూడు కృష్ణగాడూ!' కృష్ణుడు వేణుని చూశాడు. వేణు కొంచెం దగ్గరపడేసరికి చొక్కాపట్టుకొని వొక్కలాగు లాగి ఊరేగింపులో కలిపాడు.

వేణు అట్టపట్టుకున్నాడు. మాధవుడు వాడి వెనకాల నిలబడ్డాడు. ఊరేగింపు గల గల మంటూ గజ్జలమ్రోతలు పెడుతోంది.

రేగతోట కూరకాడ బుజాన వేసుకొని ముసలాయ
నొకడు 'ఎంత హుషారీ కుర్రవాళ్ళకి' అన్నాడు. పక్కనేవున్న
జోగానారాయణ కనిస్టాబ్బు ఎగరేస్తూ 'రైటో రైట్!' ఫ్రీడాచేసినా
యీ టూడెంటు కుర్రోళ్ళే సెయ్యాలయ్యా' అని బుజా లెగ
రేస్తున్నాడు. ఊరేగింపులోకల్లా 'పోలీస్ జులుం నశించాల'న్న
కేక వాడికి బాగా నచ్చింది. 'తుత్, పోలీసు నాకొండెలు!'

'హాసి తస్సాగొయ్యా! ఎంత పౌసెన న్నగదీసినారు!'
అంటున్నాడు మిల్లుకూలీ, ఊరేగింపు రబ్బరుతాడులాగా జరిగి
పోతోంది.

గంటస్తంభందగ్గర కొచ్చేసరికి ఊరేగింపుకిబ్రేకుపడింది.
మాధవుడు ఊరేగింపెందుకాగిందోనని ర్వేళ్ళమీదనిలబడి తల
ముందుకు సాచి చూశాడు. జ్రిపోతులా రెండువ్యాన్లు వచ్చి
నిలబడివున్నాయి. వేణు నినాదం యిస్తూనే వున్నాడు. తాను
యిస్తున్న నినాదాలను పెద్దపెద్ద బిద్యోవాళ్లు అందుకుని తన
ఆజ్ఞ పరిపాలిస్తున్నందుకు వాడికెంతో హుషారుగా వుంది.
పోలీసులువ్యానుదిగి నలుపక్కలకూ ఊరేగింపును చెదరగొడు
తున్నారు. నినాదాలు, జైజై నినాదాలు గిలిగిచ్చకాయల్లా
గళ్ళుగళ్ళుమంటున్నాయి మాధవుడి పిల్లిగొంతుక పెగలడం
లేదు. కృష్ణమాత్రం 'పోలీసు జులుం నశించాల'ని కేక
వేశాడు. ఊరేగింపందుకుంది. మంత్రోచ్చారణలాగ నినా
దాలు వినిపిస్తున్నాయి.

'నూటనలభైనాలుగు డిస్పర్స్! డిస్పర్స్!

ఊరేగింపు పాదరసంలా ప్రవహిస్తున్నది. ముందూ వెనకా లారీలు చుట్టుముట్టాయి. భయంతో మాధవుడు గజ గజ వణకిపోతున్నాడు.

'ఊరేగిం పాగదు'

'ఇంక్విలాబ్'

'జిందాబాద్'

లారీలు ఎగుస్తున్నాయి. మాధవుడి ప్రాణం గుటుక్కు మంటున్నది.

'పారిపోదాం రారా' మాధవుడిమాట వేణు వినిపించుకో లేదు. ఊరేగింపునాలుగుపాయలుగా చీలిపోయింది. చిన్న కుర్రాళ్ళు పరుగెత్తుతున్నారు. వీధులలో బూట్లచప్పుడు వినిపిస్తున్నది.

ఊరేగింపుసందుల్లోకి మళ్లీమళ్ళీ రోడ్డుమొగను కలుసుకుంది. వేణు నినాదాలిస్తూనే వున్నాడు. మాధవుడు చల్లగా కిల్లీషాపు బడ్డీకిందకి తప్పుకొని గలిగాడు. కృష్ణుడు జెండావట్టుకు వూపుతున్నాడు. రైలును కదలమని గార్డు జెండా వూపుతున్నట్టు! ఊరేగింపు కదిలింది.

మాధవుడు గబగబ కాళ్ళకి స్పీడెక్కించాడు; పరుగెత్తి పరుగెత్తి వొగర్పుకింక ఆగలేక 'హమ్మా' అంటూ నిల

బడిపోయాడు. వేణు తనతో కూడా పరుగెత్తుకొచ్చేడేమోనని ఆత్రుతగా నలుదిక్కులా కలయచూశాడు. వేణు కనబళ్ళేదు!

దూరంగా కోలాహలం. అడుగులధ్వని, గొంతుకలు. నినాదాలు, లారీలపరుగు, పోలీసుల ఈలలు, భయం భయంగా మాధవుడు చూస్తున్నాడు.

రెండుసార్లు తుపాకీ పేలిన చప్పుడు. ఇంకొకసారి. మళ్ళీ వొకమాటు. తిరిగి పేలుడు. గుండె నీరైపోతోంది.

వేణుకు తుపాకీ తగిలివుంటుంది. తనతో పరుగెత్తరా బాబూ' అంటే వినిపించుకోలేదు. ఈడుపుకాళ్ళతో సందమ్మట నడుస్తూ మాధవుడు బిక్కచచ్చిపోయి బావురుమని యేడుస్తున్నాడు. మసీదు వచ్చింది. బజారులోని జనం పరుగెత్తుతున్నారు. విద్యార్థులు, నినాదాలిస్తుంటే వ్యాను పోతున్నది. జయ్ మని రొదచేస్తూంది. పోలీసువ్యాను వొక వూరేగింపులావుంది. దౌర్జన్యం నశించాలని కేకలు.

కళ్ళెగరేస్తు జట్కావాడు కొరడాకర్ర విదిలించాడు. 'ఎంతన్నేయం!'

'విశేషపంలాంటి కుర్రాడయ్యా. నిష్కారణంగా ... కారుణం!' అన్నాడు గుమాస్తా.

'ఈళ్ళకి మతి పోనాది సార్!'

మాధవుడు కొయ్యబారిపోయి అలాగునే నించున్నాడు. వేణుకోసం మళ్ళీ చూచాడు. చూపులు కాస్త దూరం వెతికి మళ్ళీ తన దగ్గరకే వచ్చాయి.

వేణు ఎంత మంచివాడు! తనను విడవకుండా ఎక్కడికీ వెళ్ళేవాడు కాడు. తనూ వాడూ ఒక్క బెంచీలోనే కూచునేవాళ్ళు. కృష్ణ మరీ మంచివాడు. మాష్టారు ప్రశ్నలు వేసేవారా, తనకు సమాధానం తెలియక క్లాసులో వేలిపోకుండా జవాబు మెల్లిగా అందిచ్చేవాడు! కృష్ణకి పాపం తనకిలాగే జుబ్బాలన్నీ చిరుగులు. వేణు యిస్తానన్నా పుచ్చుకునేవాడే కాదు. 'వున్నాయిలేరా'

'నేనిస్తే పుచ్చుకోకూడదేంటమ్మా!' 'ఒట్టమ్మాఒట్టు, కాకల్లి చేప్పు తెస్తుందిగా.'

పడవ, కాలిపోతోన్న పడవ. మంటలు-! మధ్యఅలాగే నించున్న కేసబియాంకా. తను కేసబియాంకా పద్యం చదువుతుంటుంటే 'కాలిపోతూంటే పారిపోక అలా నిలబడడమేట్రా!' అన్నాడు తన తండ్రి. 'అలాటి ధైర్యం ఎక్కడా వుండదురా!' అన్నాడు పైపెచ్చు.

అవును. అలాటి ధైర్యముంది. కొడుతోన్నా పట్టుకున్న జెండాలు వదలలేదు. నినాదాలువినిపించడం మాన్లేదు.

జీతాలు కట్టలేక అమ్మా నాన్నా యిబ్బంది పడుతున్నారు. ప్రతినెలా తనపేరు స్కూలులోంచి తీసిపారేయడ వే

మాష్టరుగారు. వేణుపేరు యెప్పుడూ తీయనే లేదు. జీతాలు నెలనెలకూ కట్టే వేణు ఊరేగింపుకెళ్ళాడు. తనకి వేణు పుస్తకా లివ్వడమే కాదు. చాకులెట్లు కొనిపెట్టడమే కాదు. తుపాకీ దెబ్బలు తిన్నాడు. అబ్బే! వేణుకి తగిలివుండదు తుపాకీ!

మాధవుడి కళ్ళలో నీళ్ళు తిరిగాయి. ఎదురుగా కంటినీళ్ళ మధ్య వేణూ.కృష్ణా నించున్నారు. కళ్ళనులుముకొని చూశాడు. అంతా వుత్తిదే!

---

౪

'ఉట్టి ఎదవపనే' అన్నాడు అన్నంముద్ద ఎగరేస్తూ సాంబయ్య.

'ఏటాపనీ?' అంది వొంజరం ముక్కలు వడ్డిస్తూ నర్సమ్మ. తను ఊరేగింపు కెళ్ళినట్లు తెలిసిందేమోనని మాధవుడి గుండె బితుకూబితుకూ మంటోంది. పుస్తకంతీసి చదువుకొంటున్నట్లు నటిస్తున్నాడు.

"అసలు నాకా కుర్రాణ్ని కాల్చాలని లేదు!'

'ఎవర్ని?'

మాధవుడి గుండెలో రాయిపడింది.

'ఏమోకానీ... వేణులాగే వుంటాడు!'

తుపాకీదెబ్బ వేణుకి తగలలేదు. మాధవుడు తనను తాను సముదాయించుకున్నాడు.

‘అసలీ స్ట్రైకెందుక్కు చేశార్రా?’

‘జీతాలు హెచ్చించారని’

‘మంత్రులయ్యాక కాంగ్రెసోళ్ళు చేసిన నిర్వాకమే యిది?’

‘ఆళ్లు కాల్చమంటే మీరెలా కాలుస్తారయ్యా?’

‘మొత్తంమీద ఎవణ్ణోవొకణ్ణి కాల్చడంతప్పడంలేదే!’

మొగుడి కంచంలో పులుసుముక్కలు వడ్డించింది. పరధ్యానంగా తింటున్నాడు సాంబయ్య.

‘కూటికి రారా’

మాధవుడికి కూడు తినాలనిలేదు. బాబు తింటున్న అన్నంకేసి చూస్తే ఆ అన్నపు మెతుకులు పురుగుల్లా పాకుతున్నట్లు కళ్ళముందు మెదుల్తున్నాయి.

‘తింటాన్లే బాబుని తిననీయ్’

సాంబయ్య యిదేమీ వినుపించుకోకుండా ‘కొడుతున్న కొద్దీ రెచ్చిపోతున్నారు’ అన్నాడు.

‘రెచ్చిపోక మరి!’

కాలేజి కుర్రాళ్ళని కొట్టామంటే మిల్లుకూలీలు బయల్దేర్తారు!’

'హాఁ'

'దుకాణాలన్నీ మూసేశారే!'

'...దగ్గర్నుంచే!'

'గుర్రపు బళ్లోళ్ల సమ్మె'

'ఇంక నువ్వింటిపట్టున వుండవన్నమాట'

'అంతా మనోళ్ళే. ఏటికాల్సనా?'

నర్సమ్మ ఏదో అనబోతూంటే బయట ఏదో గోల విని పిస్తోంది.

'ఏట్రా ఆ గోల?' అన్నాడు సాంబయ్య.

మాధవుడు చెవులు రిక్కించి వింటున్నాడు. బయట సముద్రంలా హోరు. కోలాహలం. నినాదాలు; తను ఇందాకా అరిచిన నినాదాలు! గాలి తనలో ఆ నినాదాలను కలుపుకుని యిటే వస్తోంది.

'ఇంక్విలాబ్'

'జిందాబాద్'

ఊరేగింపు దగ్గిరపడినట్లుంది. తన చేతుల్లో ఊరేగింపు గింగురుమంటున్నది. ఎవరో అరుస్తునారు. ఒక గొంతుక వేణు గొంతుకే అచ్చం. అవును. ముమ్మాటికీ, ముచ్చం ముమ్మాటికీ అదే! అనేక గొంతులు అందుకొంటున్నాయి. గుండెల్లో జయభేరి మ్రోగినట్లు గొంతులు!

'నువ్వుమాత్రం పయికెళ్లకురోయ్' 'సదువుకోరా సదువుకో'

మాధవుడు హిస్టరీనోట్సు తీశాడు. వేణు దస్తూరి ఆడ పిల్ల దస్తూరీ!

ఊరేగింపు చాలా దగ్గరసా జరిగింది.

'ఏట్రా ఆసణుగుడూ?'

'పైకి సదవరా సదువు!'

ఊరేగింపు చాలా దగ్గరసా జరిగింది.

'ఇంక్విలాబ్'

'జిందాబాద్'

మాధవుడు వెక్కి వెక్కి యేడుస్తున్నాడు. పుస్తకంలో ఒకొక్క బొట్టే జల జల రాలిపడుతోంది. అక్షరాలన్నీ అలికేసినట్లున్నాయి. అవికూడా కన్నీళ్లు కారుస్తున్నట్లు కరిగి పోతున్నాయి. ఊరేగింపు చాలా దగ్గరసా జరిగింది.

ఏడవకురా! జీతం రేపిచ్చేస్తాలే!'

మాధవుడు వెక్కి వెక్కి ఏడుస్తున్నాడు. మధ్యమధ్య చెక్కుతున్నాడు. ప్రశ్నల్నీ సమాధానాల్నీ చదువుతున్నాడు.

సిపాయిల తిరుగుబాటుకు...తిరుగుబాటుకు...కు... కారణ... మేమి?' 'సిపాయిల తిరుగుబాటుకు కారణమేమ నగా...ఏమనగా...ఏ...'

బయట బారకాసునుంచి బిగిలి వినిపించింది.

'ఏట్రా ఆ బిగిలు' అంది నర్సమ్మ. సాంబయ్య బయ టకు దొడు తీస్తున్నాడు.

'ఎవర్నీ కాల్సనకు. నీ పుణ్యముంటుంది?

ఊరేగింపు చాలా దగ్గరసా జరిగింది.

'సదవరా సదువ్రా'

'అసలే సహనమును గోల్పోయిన ... గోల్పోయిన సిపాయిలకీ వార్త...వార్త...అగ్నికి వాయువు తోడై... నట్లాయెను!

మాధవుడు చదువుకుంటున్నాడు. బయట గొంతు కలు. జయభేరి లాంటి గొంతుకలు!

మాధవుడు చదువు కుంటున్నాడు.

ఊరేగింపు చాలా దగ్గరసా జరిగింది. ఉత్సవం లాంటి ఊరేగింపు! దేవతల ఊరేగింపు!



# శ్రీ బుచ్చిబాబు

బుచ్చిబాబు గారు (శివరాజు వెంకట సుబ్బారావు) 1918 లో ఏలూరులో జన్మించారు. మద్రాసు, నాగపూరు విశ్వ విద్యాలయముల నుండి ఎమ్.ఏ. ప్యాసయి 1943—1945 వరకు అనంతపురం, విశాఖపట్నం కళాశాలల్లో ఆంగ్లోపన్యాసకులుగా పనిచేశారు. 1941 నుంచి కథానికలు వ్రాస్తున్నారు. ఇప్పటికి వీరి కథలు తొమ్మిది సంపుటాలుగా వచ్చినాయి. వీరి ప్రసిద్ధమైన నవల 'చివరకు మిగిలేది'. 'దివ్యరక్షిత, 'ఉమర్ ఖయ్యాం' 'ఆత్మవంచన' లాంటి నాటకాలు నాటక కళా పరిషత్తు వారి ఎన్నికల్లో ఉత్తమ రచనలుగా విజయం పొందినాయి. 'నన్ను గురించి కథ వ్రాయవూ' 'నిరంతర త్రయం' 'దేశం నాకిచ్చిన సందేశం' 'చైతన్య స్రవంతి' లాంటివి తెలుగు సాహిత్యంలో అమూల్యమైన కథలుగా ప్రసిద్ధి చెందినాయి.

ప్రస్తుతం బుచ్చిబాబు గారు ఆలిండియా రేడియో హైద్రాబాదు కేంద్రంలో ప్రోగ్రాం ఎగ్జిక్యూటివ్ గా పని చేస్తున్నారు. చిత్రకళ వీరి అభిమాన విషయం.



# కథ

అందం అనేది మానవ జీవితంతో తరతరాల నుండి పెనవేసుకుపోయి మానవునితో పాటు వస్తున్న చెప్పరాని బాధా గాథ. బుద్ధుడు కూడా అందంకోసమే సంసారాన్ని వదలిపెట్టి ఉండవచ్చు. మనకు కష్టాలుగా ఉన్నదంతా జ్ఞాతమైతే బాగుండును. కన్నులు, ముక్కు, చెవుల్లాంటి వాటిని ఎవరైనా అమ్మటం జరిగితే ఈ దాంపత్య జీవితాలు ఇంత అధ్వాన్నంగా ఉండవు అని ఈ కథ చెబుతుంది.

జీవితావసర వస్తువు ఇంగువ. జీవితాభిలాష అందం. అందం ఇంగువలా అయితే ఈ ప్రపంచం క్యూలో నిలబడగలదు. పార్వతీ పరంధామయ్యలు భగవత్పదార్థం కోసం అన్వేషిస్తున్నారు. ఆ పదార్థం సంతృప్తి. అసంతృప్తి ప్రాణివేదన. ఈ అసంతృప్తి వేదనతో బగాలు చేరిన మానవునకు ఇంగువలాంటి ఆభాసలు, భ్రాంతులు, ఎండమావులు తటస్థపడుతాయి. ఏ తెలియని చిక్కుల్లోబడి మానవుడిలా తన జీవితంతో తాను దోబూచులాడుతున్నాడు! ఈ తెలియని రహస్యాలూ, తృష్ణలూ, భావాలు, అన్నీ, క్రయసాధ్యాలు, శాస్త్ర సాధ్యాలూ అయి నీటికి కారణభూతుడెవడైనా ఉంటే అతను అందం మాక్కు ఇంగువ అమ్మే వాడి కంటే అధికుడు కాకుండా ఉంటే బాగుండును. ముక్తిలాంటి శాశ్వత పదార్థంకోసం అన్వేషించే కోమనుష్యుణ్ణి, తాత్కాలిక మైనది, తుచ్ఛమైనదిగా భావించబడే సౌందర్యం కోసం అన్వేషించేవాడిలా చిత్రించడం ఈ కథలోని సాహసం. మనుష్యుణ్ణి ఒక భావాత్మక మైన ప్రశ్నచుట్టూ త్రిప్పి సన్నని కథా తంతువుల జిలుగువలిపెంలో నుంచి కదలుతూ ఉన్నట్టు అతని భావస్పందనాన్ని కదిలించి చూపించడం బుచ్చిబాబు విశిష్టత.

ఇది భావప్రధానమైన కథ.

# సౌందర్యాన్వేషణ

ఇంట్లోకి సరుకులు తెద్దామని బజారుకి బైలుదేరాడు పరంధామయ్య. కాస్త చల్లబడిం తర్వాత వెడతానన్నాడు. కాదు వెంటనే వెళ్ళమంది ఆయన భార్య పార్వతమ్మ. ఎందుకో అతనికి వెళ్ళాలనే వుంది కాని, భార్య తొందరగా వెళ్ళమంది. కాబట్టి కొంచెం ఆలస్యం చెయ్యడంలో కాస్తంత తృప్తి. అదేం చిత్రమో ! తరతరాలుగా మొగాడు తన ఆధిక్యతని ప్రకటించు కుంటాడు కాబోలు ననుకున్నాడు, వెడుతూ. శెలవురోజు కోసం వారం అంతా ఎదురు చూస్తూ తీరావొచ్చిం తర్వాత ఏమీ చెయ్యక వృథాగా గడిపేశామే అని బాధపడుతూ మళ్ళా పని ప్రవాహంలో కొట్టుకు పొయ్యే మధ్య తరగతి వ్యక్తి పరంధామయ్య. శెలవురోజున తన వ్యక్తిత్వానికి అనువైన పని ఏదో చెయ్యాలి. ఏం చెయ్యాలో అతనికి తెలియదు. ఇంట్లో గడపడం మాత్రం కూడదు. తనూ, భార్యా యింకెవ్వరూ లేకుండా, అల్లా అల్లా షికారు తిరిగి సినిమాకెళ్ళి, ఏహోటల్లోనో భోజనం చేసి, పార్కులో పెళ్ళినాటి సంఘటనలను స్మరించుకుని, గేట్లు మూసేసి అందరూ ఇళ్ళకెళ్ళి పోయిం తరువాత గడ్డిలో ఆమె తొడమీద తల ఆనించి పడుకుని ఏమీ మాట్లాడకుండా ఆకాశంలో నక్షత్రాలకేసి నిశ్చలంగా చూస్తూ విశ్వంలోని నిశ్చలత్వాన్ని తనలో నింపుకుని క్రొత్త సౌందర్యాన్ని ఆనందాన్ని పొంది......

అనుకుంటాడు; అంతే. ఆమె పుట్టింటికి వెళ్ళినప్పుడు యీ ఆలోచనలు వొక ప్రణాళికస్వరూపం దాలుస్తాయి. ఆవిడతో వున్నప్పుడు వీటిల్లో ఏదీ ఆచరణయోగ్యంగా కనబడదు. ఎందుకో —కొత్త ఆనందం, కొత్త సౌందర్యం.

అదే పేచీ — వారిజీవితాల్లో ఆనందం సౌందర్యం లేవు. శారీరకసౌందర్యం అంత ముఖ్యమైంది కాదంటారు. మరేదో శీలంలో సౌందర్యంట — మనస్సులో వుంటుందిట బాహ్య సౌందర్యం వుంటేనే ఆ మిగతావికూడా వుంటాయి. అనాకారులైన కొందరు పెద్దలు, సుందరాకారులు విగ్రవీగుతోంటే చూసి వోర్వలేక, యీ సిద్ధాంతం ప్రతిపాదించి అమాయక ప్రజపై రుద్దారు. ధనికవర్గంరోగం కుదర్చాలని బీదతనంలో ఆనందాన్ని పొగిడిపారెయ్యమని కవులను ప్రోత్సహించారు. సూదిరంధ్రంలో వొంటె దూరడం ఎంతకష్టమో, భాగ్యవంతుడు స్వర్గద్వారంగుండా దూరడం అంత కష్టంట. ఇదంతా వెనక. ఈరోజుల్లో యీ దగా అంతా బైటపడిపోయింది. ప్రతివాడికి తిండి, బట్ట, కొంప, విశ్రాంతి, భార్య, పిల్లలు — కావాలి. నలుగురూ కూడబలుక్కుని, వాటాలు నిర్ణయించుకుంటే శాంతియుతంగా పరిష్కారమయ్యే పని యిదంతా. నేటి దేశాలు ఈ పనికి పూనుకున్నాయి.

సౌందర్యం ఎట్లా వొస్తుంది? డబ్బుంటే ఏదిపడితే అదే వొస్తుంది. ఆధునిక విజ్ఞానశాస్త్రజ్ఞులు కనుక్కొన్న నూతన పరికరాలద్వారా అందాన్నికూడా పొందవచ్చు. సినిమాతార

లని చూడండి. కృత్రిమమైన నైనా, ఆకర్షణీయంగా వుంటారా లేదా? ఉంటారు.

తన అందంగూర్చి పరంధామయ్యకి బోలెడన్ని శంకలు. మొగాడిఅందం ఎవడికాక్కర్లేదు అని తృప్తిపడే ఘటం కాడు. అందం స్త్రీది, తెలివి పురుషుడిదీ అనుకునే రోజులు వెళ్ళిపోయినై. ఇరువురూ సమంగా ఎంచబడే రోజుల్లో తనలాగే స్త్రీ కూడా మొగాడు అందంగా వుండాలని కాంక్షించడంలో ఆక్షేపణ వుండ నక్కర్లేదు. కొంచం పొడుగాటి ముక్కు-కాస్తంత పొట్టిదిగా వుంటే ఎంత బావుండును. ఎన్నోసార్లు అద్దంలో ముక్కుని వేళ్ళతో నొక్కిపట్టి పొట్టిదిగా చేసి చూసుకొని లోలోన సంతోషించేవాడు. పెదవులు కొంచెం వంకర.ఏవంకరా లేకుండా ఎవ్వరిపెదవులూ వుండవు - దాన్ని వొదిలేద్దాం జుత్తు - పాపిడ తిన్నగా రాదు. - అన్నీ సుళ్ళే. వెంట్రుకలు లేచి నిలబడతాయి. బ్రిలియంటైన్లు అవీ రుద్ది నీళ్ళురాసి అదిమితే వో పది నిమిషాలపాటు అణిగి పడుంటాయి అంతే. మళ్ళా తడి ఆరగానే, విశ్వంలోకి పయనంచేసే రాకెట్లాగా తిన్నగాపైకి నిలబడతాయి. దాని కేదో చెయ్యొచ్చు. చెయ్యాలి. విజ్ఞానశాస్త్రజ్ఞులు యీపాటికి కని పెట్టేవుంటారు, ఏదో సాధనం, కాని అది మనదేశం చేరుకొని నలుగురికి తెలిసి, అందు బాట్లో కొచ్చేసరికి వున్న జుత్తుకాస్తా వూడిపోదని అనుకోడం ఎల్లాగ? ఈ జుత్తువూడే జాడ్యానికి ఏదన్నా మందు కనుక్కున్నారా శాస్త్రజ్ఞులు? ఆమధ్య ప్రపంచములో పెద్ద డాక్టర్లు వొకచోట సమావేశమై జుట్టు

పుణ్యశ్లోకి మంగ లేదని తీర్మానించినట్లు పత్రికలో చదివి, బెంగెట్టుకున్నాడు పరంధామయ్య.

కాఫీహోటలుకి చేసుకున్నాడు. ఆలోచనలతో అతనికి దూరమే తెలియ లేదు. హోటల్లో బల్లముందు కూర్చున్నంత వరకూ అక్కడికి చేరుకున్నట్లే తెలియదు. టిఫిన్ తీసుకున్నాడు. టీ త్రాగాడు. మళ్లా బైలుదేరాడు.

తనమాట వొదిలేద్దాం. పార్వతమ్మఅందం విషయం ఆలోచించు. ఆలోచించేటందుకేముంది? ఏమీలేదు. ఆమె అందంగావుండదు. ఏ అవయవానికా అవయవం, విడమర్చి పరిశీలిస్తే ఏలోటూ కనబడదు.

నుదురు, జెడ, కళ్ళు, నోరు, చెక్కిళ్లు, చెవుల మీద జుత్తు,— అన్నీ దేనికవి బాగానేవుంటాయి అన్నీ కలిపి మొత్తంగా చూడండి. ఏదో తిరకాసుంది. ఎందు కల్లా దగా చేసుకోవడం — విడివిడిగా ఏ అవయవానికా అవయవం బాగుండనగలవా? కనుబొమ్మలకి ఆకారంలేదు. అర్థచంద్రాకారం ఆకృతి కలిగి దట్టంగా, నల్లగా, స్ఫుటంగా వుండాలి. అల్లా లేవు. ఆ ముక్కు? కాస్తంత పొట్టిదనే వొప్పుకోవాలి. వేళ్ళతో ముందుకి లాగి చూసినప్పుడు, ఆ తేడా తెలిసొచ్చేది. మళ్ళా ఎంతో అక్కర్లేదు సుమాండి. కాస్తంత తనముక్కులో పొడుగైన ఆ కాస్తభాగం కోసేసి, ఆవిడముక్కు మొనకి అతికించివేస్తే, ఆహా! ఎంత బాగుంటుంది! ఈ రకం ప్లాస్టిక్ సర్జరి వుందని చెబుతూవుంటారు. కాస్తంత ముందుకొచ్చిన పళ్ళని

వూడగొట్టించి. చక్కగా కొత్తపళ్ళని అమర్చుకుందిట వొక సినిమానటి. ధన్యురాలు!

ఇంతకీ తను ఎక్కడికి నడుస్తున్నట్లు? ఇంట్లో సరుకుల కోసం! ఏం సరుకులు? జ్ఞాపకానికొస్తున్నాయి. ఎక్కడెక్కడ దొరుకుతాయోకూడా అతనికి తెలుసు. ముందు ఆ కొట్లో కెడదాం. అదుగో. ఆ సందుమలుపులో.

సందుమలుపు తిరగగానే. వొకరి వెనక వొకరు వరుసగా నిలబడ్డ జనం – గోడ్డంతా కమ్మేశారు. ఓ, ఏం జనం, ఏం జనం! ఏదేనా ఊరేగింపు కాబోలు. వరుసగా క్యూలో నిలబడడం దేనికో? మన ప్రజలకి ఎంత డిసిప్లిన్! ఇవతలప్రక్క మొగాళ్ళ క్యూ ఫర్లాంగు పొడుగు. అవతలప్రక్క స్త్రీల క్యూ. ఈజనం ఎందుకు నిలబడ్డారో; క్యూచివరలో ఏముందో? ఈ క్యూ మోఘుల పరమావధి ఏమిటో? వీరారాధించే దైవం ఎవరు చెప్మా.

'ఏ అబ్బాయ్ – ఏమిటిదంతా?' సమాధానం చెప్ప కుండా, ఆ కుర్రాడు పరుగెత్తికెళ్ళి క్యూలో దూరుకుపొయ్యాడు పైన పేలి ఊబిలో కూరుకుపోయిన విమానంకి మల్లే.

ఏమిటండీ ఈ జనం అంతా?'

'అవును జనం'

అన్నాడాయన. అనడమూ, వెళ్ళి,క్యూలో మునగడమూను. – ముక్కుమూసుకుని గ్రహాణంనాడు. సముద్రస్నానం చేస్తూ మునిగినట్లు, భక్తుడు. తనకెందుకు, తనదోవను తనుపోక ఇందరు మనుష్యుల్ని వొదిలి ఎల్లా వెళ్ళడం? వారి రహస్యాన్ని

ఛేదించకుండా మానవుడు అడుగు ముందుకి వెయ్యలేడు. అదే మానవత్వం అంటే. తోటిమానవుడి రహస్యాన్ని పంచుకోడం.

ఏమండీ యీ క్యూ దేనికండి?' పరంధామయ్యనే అడిగాడు వో పెద్దమనిషి.

'అదే నేనూ అడుగుతుంట'

'రండి వెడదాం.' అంటూ ఆ పెద్దమనిషి క్యూ రంగ భూమిపైకి దుమికాడు. అదొక రణరంగంలాంటిది. ముందు వాణ్ణి కొంచెంగా ముందుకి నెట్టాలి. – తోపు సరియైన వొత్తిడితో జరగాలి. జో రైందంటే ఫెడీల్మని చెంపమీాద కొడతాడు. వెనకవాడితో పిడిని తను తట్టుకోవాలి. వెనక్కితిరిగి మంద హాసం చెయ్యాలి. ముందాయన్ని మంచిచేసుకోవాలి. ముందాయన చుట్టనోట్లో పెట్టుకుని అగ్గిపుల్లకోసం తడుముకుంటుంటే, అగ్గిపుల్ల తనుగియ్యాలి. లేకపోతే వీపుమీాద లాల్చీకి లేని బూజుని దులపాలి. ముందు వ్యక్తి అంగుళం ముందు కెడితే యుగం గడిచినట్లే.

క్యూ ప్రభావంసుడిగాలిలా పరంధామయ్యని చుట్టేసింది. మానవహృదయం దేన్నో ఆసించి రోదిస్తుంటే తాను చెవులు మూసుకోగలడా! ఆర్తనాదం వినబడటంలేదా? తోటి మానవుడు చిక్కులోవున్నాడు. క్యూలో పడిపోయ్యాడు. క్యూ అనేది సంసారం కుళ్ళులాంటిది. అది రొంపి. ఒకమాయ. భ్రాంతి. అందులోంచి బైటపడే మార్గం చూసుకోమనే వేదాలఘోష.

'క్యూ చివరలో ఏముం దబ్బాయి?' కుర్రాడు వాగు రుస్తున్నాడు. క్యూసమరంలో గాయపడి వెనక్కి తిరిగొచ్చిన బాలవీరుడు.

'చంపిపారేశారండి – నిలబడి కాళ్ళు మండుతున్నాయి. అడుగో అ బొండుకాకిలా వున్నాడే ఆయన నెట్టిపారేశాడు. ఇట కామడగాడు;'

'ఇంతకీ ఏమిటట?'

'అందం అమ్ముతున్నారుటండి.'

అని బాలవీరుడు కుంటుకుంటూ నిష్క్రమించాడు. పరంధామయ్య పరధ్యాన్నం కట్టిపెట్టి వొక్క గంతేసి క్యూ చివరలో నాలుగంగుళాలు చోటుచేసుకుని స్థావరం ఏర్పరచుకున్నాడు. అమ్మయ్య! ఒక మజిలీ గడిచింది. మదీనా చేరాడు. మక్కాకి పోవాలి. వెనక మరో పదిగజాల పొడుగు జనం గొలుసు కట్టేసుకున్నారు. అందులో నిలబడు; కదలకు; అదే రాసిపెట్టాడు దైవం. ఓపిగ్గానిలబడు. దైవంనిన్ను పరీక్షిస్తున్నాడు. సహనం స్త్రీ సొత్తా? మొగాడిదీను. ఋజువుచెయ్యి, నిలబడు.

నిలబడ్డాడు పరంధామయ్య, కాసేపీకాలు, కాసేపా కాలు. ఆఖరికి రెండుకాళ్లూను. చేతులని ఏంచెయ్యడం? కట్టేసుకున్నాడు. కాసేపు బుజంపైన వేళ్ళాడతీయడం, కొంచెం సేపు మెడచుట్టూ వురిపోసుగోవడం చేతులు పైకెత్తు. దించు రెండుచేతులూకట్టుకో: అదొకశిక్షణ, డ్రిల్లు, యోగాభ్యాసం, క్యూ ఆసనం అనొచ్చు.

పరిసరాల పరామర్శ ముగించుకుని పరమావధిని గూర్చి ఆలోచించసాగాడు పరంధామయ్య. అందం అమ్ముతున్నారట. అందుకనే యింత జనం. చిత్రం. తనుఇంతకుముందు అందాన్ని గురించే ఆలోచిస్తూవుంట. కోయిన్సిడెన్స్‌కి తెలుగు తెలీదు జరుగబోయే ఘట్టాలు నీడల్ని ప్రసరిస్తాయిట. తనుసౌందర్యం గురించి ఆలోచించడం, ఆ సౌందర్యం లభ్యంకావడం — ఎల్లా వుందంటే — సత్యాలలోకి గొప్పసత్యం. సత్యం సంభవం కావడమే — లాగుంది. అందం అమ్ముతున్నారా ? అందుకనే అంతమంది స్త్రీల క్యూ అబ్బో! — రెండు ఫర్లాంగులు పొడు గుగల క్యూలో స్త్రీలు, బాలికలు, కన్యలు, యువతులు, నడి వయస్కులు, వృద్ధనారీలు — అందరికీ అందం కావాలికదా ! అందం చర్మంఅంత లోతే అనడానికి వీల్లేదు. అందంక్యూ అంత మందంగలది.

క్యూలో కాలక్షేపం కాదు. నిజమే. ముందువాడి వెన్ను ఎంతసేపని చూడగలం? వ్యక్తిత్వం లేనిదీ, ఆకర్షణ పరిపూర్ణంగా లోపించినదీ ఏదయ్యా అంటే మనిషివీపు — మొగాడివీపు ఎంతసేపని చూడటం. వెనక్కితిరిగే, ఆసామీ మీసాలమధ్య నలిగిన చుట్ట — అబ్బో! ఆయన కనుబొమ్మలు చూడు — అదొక పిల్లఅడివి — ఋషులు అడవిలో తపస్సు చేసుకుంటుంటే రాక్షసులు వారిని చావదన్ని తరిమి, ఆశ్రమం ధ్వంసంచేసింతర్వాత, మిగిలిన అడివిలాంటిది. అందుకనే ఆడా ళ్ళకి వేరే క్యూ పెట్టారు. బాగుంది. పౌరసత్వ బాధ్యతలు గుర్తెరింగిన ప్రజ. ఏమీ తోచకపోతే, స్త్రీలకేసి చూస్తూ కూర్చోవచ్చు. క్యూ చివరలో అందం మాట ఎల్లావున్నా

వారిఅందం చూసి అనుభూతి పొందితే తప్పేముంది? క్యూలో నిలబడింతర్వాత, ముందువారిని, వెనకవారిని ఈ క్యూ ఎందుకని అడిగే అధికారంలేదు. పెరుగుట విరుగుట కొరకే అన్నట్లు చివరిదాకా అనుభవించి, తనకుతానే సత్యం తెలుసుకుని, హాతమవ్వాలి.

అయినా, అందం అమ్మడం ఏమిటో! సరిగ్గావిన్నానా? సందేహం వొచ్చింది పరంధామయ్యకి. అందం కాకపోతే యింకేమనివుంటాడు ఆ బాలపేరయ్య? అంగం, అండం, ఆలింగనం, అంబలి, అల్లం, అందం, అంధత్వం, అంకం, – విజ్ఞాన సర్వస్వంలో 'అ' తో ప్రారంభమైన మాటల్ని స్మరించాడు. ఏదీనప్పడం లేదు. అందమే ఖాయం.

ఏమీ సందేహం లేదు – అందమే. లేకపోతే యింత మంది స్త్రీలు, పురుషులు యీ క్యూలో అవతరించరు. ఎందుకు కాకూడదు? ఈమధ్య జర్మనీ, అమెరికా మొదలైన పాశ్చాత్య దేశాలనుంచి ఎందరెందరో ప్రముఖ విజ్ఞానశాస్త్రజ్ఞులు వొస్తున్నారు. అనేక పారిశ్రామిక రంగాల్లో పనిచేస్తున్నారు. ఆమధ్య నెవరో కళ్ళడాక్టరొచ్చి, ఏవో ఆపరేషన్లుచేసి దృష్టి ప్రసాదించాట్ట. మరెక్కడో మరో సర్జన్‌గారు చెవి ఆపరేషన్ చేసి చెముడు కుదిర్చి వెళ్ళాట్ట. ఈయనెవరో అందాన్నిచ్చే మూలికో పరికరమో తయారుజేసి అందజేస్తున్నాడు. అందం అమ్మడమేమిటి నా సెత్తి, అంటే అందంగా చేసే పరికరాన్ని అమ్మడం అని. వాక్యంలో ఏదో లోపించింది.

'శ్రీమద్రమారమణ గోవిందో హారి' - క్యూ మో అడుగు ముందుకు కదిలింది. వేడిలో వేడి మరో అడుగు నెట్టి, జగద్రక్షకా, ఆపత్ బాంధవా - మరో రెండడుగులు.

అమెరికాలో క్యూలో కూర్చుని పేపరు చదువుకునేం దుకు కుర్చీలుంటాయి, క్యూకోసం కొన్ని గ్రంథాలుంటా యిట. నమిలేటందుకు 'చ్యూయింగ్ గమ్' తయారుచేసి అమ్ము తారట. ఎడంకాలు నెప్పిచేస్తే, కుడిదవడ కిందకి ఫిరాయించి చప్పరించడం, కుడికాలు నెప్పిచేస్తే ఎడమ్మవైపుకి ఫిరాయించి చప్పరించడం.

సౌందర్యాన్వేషకుల అత్రుత పెరుగుతోంది. వెనక నుంచి వొక ప్రవాహం త్రోసుకొచ్చి, మరో రెండుగజాలు ముందుకి కదిలారు. ఆ ముసలమ్మకి అందం ఎందుకు? వెంట్రు కలు నెరిసిపోయ్యాయి, చర్మం ముడతలు పడింది. 'వార్థక్యం' చిత్రించే ఛాయాచిత్రాల పోటీలో ప్రథమ బహుమతి పొందే మొహం ఆ మెది. ఈవార్థక్యం, జాడ్యం, మృత్యువు, యివన్నీ లేకుండాచేసే మార్గం కనుక్కునేటందుకే సిద్ధార్థుడు సంసారం త్యజించి, ఏదో చెట్టుక్రింద కూర్చుని ధ్యానం సాగించి బుద్ధు డుగా అవతరించాడట. నిజంగా బుద్ధుడు సాగించినది సౌంద ర్యాన్వేషణే. - అది సాధ్యంకాకపోయినప్పుడు, వేరే లోపల అందం, నిర్వాణం శాంతి అంటూ తత్వచింతనలో పడ్డాడు. హాలీవుడ్ లో తయారవుతున్న అందం పరికరాలు 'మేకప్ మెటీ రియల్స్' ఆరోజుల్లో వుంటే, సిద్ధార్థుడు ఎంతవరకూ సంసారం పరిత్యజించేవాడో చెప్పలేం. కళ్ళకిందముడతలు, అక్కడక్కడ

తెల్ల వెంట్రుకలు, కంఠంలో గీతలు – ఏటిల్లో దేన్నో వొక దాన్ని సిద్ధార్థుడి సతీమణి నవ్వుతూ అవహేళన చేసివుండాలి. లేక భాగ్యలో అయన ఏదో వొక వార్ధక్యచిహ్నం గుర్తించి వుండాలి. ఆ మెన్నీ, యవ్వనంలో బంధించి వెయ్యాలి – అని తీర్మానించుకునే తపస్సు కొనసాగించాడు. అందుకనే తరతరాలుగా చిత్రకారులకు అభిమానపాత్రుడయ్యాడు బుద్ధుడు.

మరో రెండుగజాలు పురోగమనం. మరో మూడు. ప్రజ యింక ఆగరు. తోసుకుపోతున్నారు – అందం ఆకర్షించి ముందుకు నెట్టివేస్తోంది. ఏదో వాసన –ఏమిటి చెప్మా! ఆ వాసనకి ఏవేవో జ్ఞాపకాలు. బందరు నడిబజారులో కాలనులో ఖాళీ మిఠాయిపొట్లాలు పారేస్తే, రేగిన వాసన. పట్నంలో వాన వెలిసింతర్వాత తారురోడ్డు మధ్య ఇనపగొట్టం తలుపు తెరచినప్పుడు లోపలినుంచి వొచ్చే వాసన, అంతర్వేది తిరణాలలో రాత్రి మంటపెట్టిన చెత్తవాసన.

‘అబ్బ ఏంవాసనండి!’ ఒక భక్తుడి కంఠం.

‘కలరావుండలా?’

‘ఏమో. గసగసాలు’.

‘అబ్బే – కర్పూరందండలండి,’

‘ఛఛ! – కానేకాదు.’

‘మరి?’

‘చమురుకంపు’

'కాదు మహానుభావా - అతిగా కాగిన పాలకోవు - ఆ హోటల్లోంచి.'

'సరే, ముందుకి నడవండి.' మళ్ళీ తోసుకుపోతున్నాను. ఒక్కసారిగా పదిగజాలు. అమ్మయ్య! - ఎదురుగా క్యూలో ఆవిడెవరు? ఎరుగున్న మొహంలావుందే - రమణయ్య గారి చెల్లెలా? ఆవిడే. చాలా అందమైంది. ఈమధ్యనే భర్త కాలం చేశాడు. అంత అందమైనభార్యకు భర్తగా వుండేందుకు తగని ఆత్మహత్య చేసుకున్నాడని చెప్పుకుంటారు. ఎవరు చెప్పు కుంటారు - తీరాచేసి, పనిపిల్ల, సరే, ఇప్పుడదంతా ఏందుకు? ఆవిడ కేం కావాలో? ఇంకా అందంగా వుండాలనా? ఎవరు చెప్పగలరు!

తనముందు చైనాగోడ చివర కనబడుతోంది. మనం తొయ్యకూడదు. వెనుక ఎవడో తోస్తూవుంటే, ఆపదనుచూసు కుని మరొక్క గట్టితోపు. ఎవరికి తెలియకుండా - ఊ కాని- ఇంకెంత. రెండుగజాలదూరంలో శిఖరం, దైవంసాక్షాత్కారం. కొబ్బరికాయ కొట్టి పూజారిసళ్ళెంలో అలావుంచినట్లు ప్రతి వాడూ ఆ కిటికీముందు నిలబడటం, డబ్బు సమర్పించుకోడం. వాడిచ్చిన ప్రసాదం కళ్ళ కద్దుకొని,- పత్రి పూలు వగైరా మామూలు బిల్లు చీటి యిస్తాడు - దాన్ని చేవులో బదులు జేబులో వుంచుకుని బైటపడటం - అల్లా జరుగుతోంది ఒకొక్క భక్తుడే దూరంగా వెళ్ళిపోతున్నాడు. వారి మొహాలలో శాంతి ఆనందం తాండవిస్తున్నాయా? అందంతో నేత్రాలు మెరుస్తు

న్నా యా? అటు కేసి చూసేటందాకు వ్యవధి లేదు. ఇంక ముందు యిద్దరే వున్నారు.

'కదలవయ్యా' ఎవరో వెనకనుంచి. కదిలాడు పరంధామయ్య. సింహద్వారంచేరుకున్నాడు. ఎదురుగా గోడ. దానిలో వో కంత. దాని వెనుక పరమాత్మ అందంఅమ్మేవాడు. చెంపలు వేసుకో. హరహర శంభో! పాపాలన్నీ క్షమించు, అందం ప్రసాదించు కళ్ళుమూసుకో. పర్సు తీ- చిల్లర.

'పావలా, అన్నాడు దైవం.

'ఇదుగోనండి'

'ఇంక'

ఇంత పొట్లం ఏదో చేతిలో పెట్టాడు.

'గులు'

కదిలాడు పరంధామయ్య – పొట్లం గట్టిగా పట్టుకొని. అది విడిచేశావా మళ్ళా మైలు వెనక్కి వెళ్ళి క్యూలో నిలబడి మళ్ళా తంతంతా జరగాల్సిందే. మరో జన్మ ఎత్తడంలాంటిది. జన్మరాహిత్యం జరిగింది. బైటపడ్డాడు. మళ్ళా క్యూలో జన్మించ నక్కర్లేదు. 'నడు'

నడిచాడు. దూరంగా, తొందరగా నడిచివెళ్ళాడు. ప్రాణం కుదుటపడాలి. ముందు విశ్రాంతికావాలి. దాహంగాం

వుంది. చెమట్లుపోశాయి. మనుషులవాసన చొక్కాలో ప్రవే శించింది. చేతిలో పొట్లం, పెద్దదే - ఏదో వాసన. నడిచి నడిచి ఇందాక కాఫీ తాగినహోటలుకి చేరుకున్నాడు. మొహాన నీళ్ళు కొట్టుకున్నాడు. అద్దంలో మొహం చూసుకున్నాడు. అదేమొహం. వెనుకటిదే. ఏమార్పూ లేదు. అనుకున్నంత వికృతమైన మొహంకాదు. అందులో కొంత అందం లేకపోలేదు. అదుగో ఆ ముక్కుంది చూశారూ, వేళ్ళతో వెనక్కినొక్కి పట్టిచూసుకున్నాడు. ఎవరో అద్దంలో అతని మొహంకేసి చూస్తున్నారు. ఫరవాలేదు. ముక్కు చీదుతున్నట్లు అభినయించవొచ్చు. అల్లా నొక్కిపడితే ఎంత బాగుండనుకున్నారు!

పొట్లం విప్పాడు. అందులో అట్ట పెట్టె - ఆరంగుళాల పొడవు. నాలుగంగుళాల వెడల్పు. మూతతీశాడు - గుప్పున వాసనకొట్టింది. అందులోవున్నది ఇంగువ. దాన్ని వర్ణిస్తూ కాగితం వుంది. అందంమూక్కు ఇంగువనేఎల్లప్పుడూ వాడండి. ఇంగువ పరిమళానికి పేరుపడ్డది. అందంమూర్కు ఇంగువకి ఆ రకం వాసనలేదు. అంతమాత్రంచేత పరిమళం అసలే లేదని కాదు. సువాసన, నూతనమైన మూలికలు, అత్తరులుజోడించి సమకూర్చిన పరిమళం. భుజించిన మర్నాడుకూడా దాని పరిమళం వొదలదు. ఇంత బాగుంది - ఏమిటండి? అని నలుగురూ మిమ్మల్ని అడుగుతారు. అభినందిస్తారు. అప్పుడుమీరు 'నన్ను

అభినందించకండి. అందంమార్క ఇంగువని అభినందించండి' అని చెప్పండి. దాన్ని మెచ్చుకుంటూ దేశంలో పెద్దలిచ్చిన అభినందన పత్రాలు మా కార్యాలయానికి వొచ్చి స్వయంగా చూడొచ్చు.

అందంమార్క ఇంగువ మీ వంటకాలలో వాడితే మీ ఇల్లాలిపట్ల ప్రేమ, ఆదరణ పెరుగుతాయి. అన్యోన్యం ఎక్కువవుతుంది. ఆ అనుభవం మీ దాంపత్యజీవితానికి ఆనందాన్ని సమకూరుస్తుంది. అదే జీవితంలో అందం. అందుకనే దాన్ని అందంమార్క ఇంగువ అన్నారు. పండక్కి చీరకొనలేదు. ఆ మొతమ్మోడికి ఉద్యోగం చూడ లేదు. ఆవిడ మేనమామకు ఉత్తరానికి జవాబు వ్రాయ లేదు మీరు. కిరాణాకొట్టులో యివ్వవలసిన పైకాన్ని పేకాట్లో ఖర్చుపెట్టి, ఆలస్యంగా ఇంటికి వెళ్ళి స్నేహితులతో సినిమాకెళ్ళానని అబద్ధమాడారుమీరు. ఆవిడ వేచివుంది. అట్లకాడ తీసింది. నెత్తిన కొట్టడానికి. ఆవిడ కోపగృహంలో వుందని తెలుసు మీకు. రాచిప్ప పగులుతుంది. కప్పుప్లేటు గోడకి విసిరికొడితే, అవి కిందపడి ముక్కలై, నాట్యంచేసి మధుర బృందగానంచేస్తాయి.

అట్లాంటప్పుడు ఏం చెయ్యాలో తెలుసా? దూరంగా నిలబడి గుప్పెట్లో పెట్టికేసి చూపించి 'ఇదేమిటో చెప్పుకో' అనండి. ఆవిడ చెప్పుకోలేదు. 'ఇంగువ' అనకండి. కేవలం

ఇంగువ అంటే అట్లకాడ. మీ మీద ప్రయాణంచేస్తుంది. అందు చేత 'అందంమార్క్ ఇంగువ' అనండి. అని చూడండి. ఆవిడ అట్లకాడ నేలమీద వాలిలేస్తుంది. ఆనందంతో ఆవిడనేత్రాలు మెరుస్తాయి. పెదవులు వొంకరతిరిగి నవ్వుకోసం పెనుగులాడు తాయి. ఆవిడ సౌందర్యమూర్తి, ప్రేమరాశి. మీ పాదదాసి. అనురాగం వొలకపోస్తూ, మీదగ్గరకు వొస్తుంది.

'మీరెంత మంచివారండి, మిమ్మల్ని కాసేపు పొగడ నివ్వండి'

'నన్ను పొగడకు అందంమార్క్ ఇంగువను పొగుడు' అనండేం.

పరంధామయ్య చాలాసేపటివరకూ తేరుకోలేదు. కాని తనొక్కడేకాడు. వేలమంది పురజనులలో తనొకడు. వాళ్ళం దరూ చేసినపనే తనూ చేశాడు. ఇందులో కించపడేటందు కేముంది?

సరుకులు కొనుక్కొని మెల్లిగా ఇంటికి చేరుకునేటప్పటికి మరోగంట గడిచింది. ఇంటికి చేరుకున్నాడు. పార్వతమ్మ వంటింట్లో వుంది.

'ఇంత ఆలస్యమైందేం?'

'ఏమీ లేదు.'

'క్షబ్బుకెళ్ళారా?'

'లేదు.'

'మరి?'

'మెల్లిగా నడుచుకుంటూ వొచ్చాను.'

'ఇదేమిటి – యీ పొట్లం!'

'చూడు.'

'ఇంగువ.'

ఆవిడ మొహంలో చిరునగవు లేదు. కోపంతో మొహం చిట్లించింది. అసంతృప్తిని వొక్క చూపులో వ్యక్తం చేయగల కళాజీవి ఆమె.

'ఇంత ఇంగువ తెచ్చుకుంటారా ఎవరేనా?'
'అంతే యిచ్చాడు వాడు'
'చిన్న పొట్లం అడగలేక పోయ్యారా?'
'చిన్న పొట్లం వుంటుందని నాకు తెలియదు'

'ఇంకెప్పుడూ ఇట్లాంటి పని చేయ్యకండి' అని పార్వతమ్మ వంటింట్లోకెళ్ళింది. అంతసులువుగా బైటపడినందుకు లోలోన సంతోషపడ్డాడు, పరంధామయ్య.

'ఇదిగో చూడండి. నేనుతీసుకొచ్చాను - చిన్న పొట్లం. అన్నదామె, మరోచిన్న పొట్లాన్ని ప్రదర్శిస్తూ.

'నువ్వా ఆక్యూలో నిలబడ్డావా?'

'ఆహా, పనిపిల్ల చెప్పింది ఇంగువ చవగ్గా అమ్ముతున్నారని. వాసన గట్రా వుండదుట. జనం ఎగబడుతున్నారుట. ఆదేమిటో చూద్దామని దాన్ని తీసుకొని బయలుదేరాను. క్యూలో నుంచోడం లేదు, ఏం లేదు. ఎలాగో నలుగురి మధ్యా సందు చేసుకొని జొరబడి యీపొట్లం లాక్కొనొచ్చింది. సర్లెండి. ఈచిన్న పొట్లం దానికిస్తాను. మీరు తెచ్చింది మనకుంటుంది.

పార్వతమ్మ ఎంతవరకు నిజం చెప్పిందో పరంధామయ్యకి తెలుసు. తనెంత నిజం చెప్పాడో ఆమెకూడా అంతే. ఇది అన్యోన్యంకాక మరేమిటి?



# శ్రీ మునిమాణిక్యం నరసింహారావు

నరసింహారావుగారు 1898 లో గుంటూరు జిల్లా సంగం జాగర్లమూడి గ్రామంలో జన్మించారు. గుంటూరులోనూ, విజయనగరంలోనూ విద్యాభ్యాసంచేసి బి. ఎ. యల్. టి. పట్టంపొంది బందరు హిందూ కాలేజీ హైస్కూలులో చాలకాలం చరిత్రోపాధ్యాయులుగా పనిచేసి విరతినిబొందారు. నరసింహారావుగారు 1922 నుంచి కథలు వ్రాస్తున్నారు, ఇంతవరకు 30 కథల సంపుటాలు వెలువడినాయి. దీక్షితులు, తిరుమాళిగ, బుచ్చ్కితల్లి మొదలైనవి చాలా ప్రసిద్ధమైన రచనలు. కాంతం కథలతో మునిమాణిక్యం వారు తెలుగు పాఠకులకు మరుపురాని కథకులు, ఆత్మీయులు అయినారు. గార్హస్థ్య జీవిత సౌందర్య చిత్రశాలలో వీరి కథారచనా కౌశలం అనితరసాధ్యమన్నా అత్యుక్తి కాదు.

నరసింహారావుగారు ప్రస్తుతం ఆకాశవాణి హైదరాబాదులో విద్యావిషయిక ప్రసార ప్రయోక్తగా పనిచేస్తున్నారు.

# కథ

సుందరానికి తనభార్యమీద పెత్తనం చెలాయించడానికి ఒకసలహా కావలిసి వచ్చాడు. పెత్తనం చెలాయించడం అనే అంశం సంసారంలో ఎంతఉంటుందో చెప్పడం కష్టం. సంసారమంటే సుఖదుఃఖాల పుట్ట. ఆనందాల తికమక. ఆనంద విషాదాలు దాంట్లో ఎంతో దగ్గరదగ్గరగా ఉంటాయి, ఆటల్లోలాగా. ఒక్క క్షణం గెలుపు ఒక్క క్షణం ఓటమి. అందువల్ల నిజమైన, స్వచ్ఛమైన జీవితం దాంపత్యంలో తొణికిసలాడుతుంది. ఇక్కడ కల్లకోసం కల్ల, కపటంకోసం కపటం, దర్జాకోసం దర్జా, దుఃఖంకోసం దుఃఖం ఉండదు. కల్ల, కపటం, దర్జా, దుఃఖం అన్నీ ఆనందంకోసం పుట్టి ఆనందంలో విలయమొందుతాయి. అందువల్లనే ఈ లౌకిక గుణాలు దాంపత్యంలోకివచ్చి అభినయాలు, తమాషాలుగా మారిపోతాయి. మునిమాణిక్యంవారు కథల్ని ఈరహస్యం మీదనుంచే నడుపుతారు. ఆయన పాత్రలలోని చిరుకోపం, ప్రణయకలహం, భర్త అనుమానం, భార్య కొంటెతనం మొదలైనవాటి మాటునుండి ఎన్నో ఉరకలుకట్టిన ఆనంద ప్రవాహాలు విరుచుకుపడుతూ ఉంటాయి. సుందరానికి భార్యదగ్గర దర్జాగా ఉండటం నేర్పాలని అతని ఇంటికి వెళ్లిన పెద్దమనిషి, సుందరం పడినపాట్లన్నీ పడి తిరిగి వస్తాడు. ఈకథలో ఇదిఒక సజీవమైన చమత్కారం.

జీవితం లోతుపాతుల్ని అంటక, అతిదూర భవిష్యత్తుకోసం అర్రులు చాచక చిన్న చందనం బరిణె వంటి అందమైన దాంపత్యంలో లేలేత పాత్రలను గుడుగుంచములు త్రిప్పించి పాఠకులను బులిపించి నవ్వింపించడం నరసింహారావుగారి విశిష్టత. ఈకథ అలాంటివిశిష్టతకొక మచ్చుతునక.

ఇదిరసప్రధానమైన కథ

# సుందరం భార్య

నాకు సుందరాన్ని చూస్తే కోపము. ఎన్నిసార్లని చెప్పేది, మాట వినేరకం అయితే అనుకోవచ్చు. ఎబ్బే! ఈ రకం మనుష్యులను బాగుచేయ లేము.

వచ్చి ఎదురుగా కూర్చున్నాడు. తీరా అతనిని చూచే టప్పటికి జాలివేసింది. ఈ తభా కూడా గట్టిగా చెప్పి చూస్తాను. ఇదే ఆఖరుసారి కూడాను. వింటాడా సరే, సరి. వినడూ, ఇక వాడికర్మానికి వాడిని వదిలేసి ఊరుకొంటాను. ఇల్లా అనుకొని 'ఏమోయ్...ఏమంటున్నది మీ ఆవిడ.' అని పలకరించాను.

సుందరం నవ్వి ఊరుకొన్నాడు.

'నీవు ఏమీ మారినట్టు లేదే!'

ఏమన్నా జవాబు ఇస్తా డనుకొన్నాను. అతడేమీ మాట్లాడక నవ్వి, తల వంచుకొని ఊరుకొన్నాడు.

'ఒరేయ్ వాజమ్మా! ఇంకా ఎన్నాళ్లు చెప్పాలె నీకు భార్యమీద కాస్త అధికారం చెలాయించాలని! తోడి వాళ్ళను చూచి అయినా నేర్చుకోరాదూ! నీవు ఇల్లాగ అయిపోవటం నాకు తలవంపుగా ఉంది. నాకేమిటి? మొగ జాతికే తలవంపుగా ఉంది!' అన్నాను మా వాడితో.

మా వాడు అంటే, ఈ సుందరం నాకేమీ బంధువు గాడు. ఒక విధంగా శిష్యప్రాయుడు. నాకంటే వయస్సులో

చాలా చిన్నవాడు. భార్య కాపరానికి వచ్చి మూడేండ్లు అయింది. ఒక ఆడపిల్ల.

సుందరం వట్టి వెర్రిబాగులవాడు. ఆ పెళ్ళాం ఎంత జెపితే అంత! ఆ అమ్మాయి చెప్పినట్లు వింటూ, ఆవిడకు సాహాయ్యంగా అన్నిపనులూ చేస్తూ ఉంటాడట! ఆడ వాళ్ళంతా చెప్పుకొని ఊహూ నవ్వుకొంటూ ఉంటారు. సుందరం సంగతి ఇల్లా ఉందని మా ఆవిడ చెపితే విని, నేనూ ఎంతో నొచ్చుకొని వాడిని కాస్త మంచిదారిలో పెడదా మని ప్రయత్నం చేస్తున్నాను. అందుకనే అంత గట్టిగా కోప్ప డ్డాను. నేను కోప్పడితే వాడు ఏమీ అనుకోలేదు. జాలిగా చూస్తూ నన్ను ఏంజేయమంటావు'—? అని అడిగాడు.

'నా బొంద నీకు ఎన్నిసార్లు చెప్పానురా! భార్య ఎదుట కాస్త దర్జా చూపమని?' అన్నాను

'దర్జాచూపడం అంటే ఏమిటో నాకు బొత్తిగా తెలి యదు'...అన్నాడు సుందరం దీనంగా.

నాకు వాడిమీద జాలి కలిగింది. చిన్నతనం! తెలి యదు! నలుగురి నోళ్ళలోపడి నవ్వులపాలు కాకుండా, వాడికి కొన్ని చిన్న చిన్న విషయాలు చెప్పడం అవసరం అని తోచింది.

'చూడూ, ఒరేయ్ అయితే చెబుతాను విను. ఇప్పు డు ఏదైనా పని కావాలనుకో, ఆవిడను చెప్పు చెయ్యమని, అంతేగాని నీవు స్వయంగా చెయ్యబోకు'...అన్నాను.

ఇట్లా సూత్రప్రాయంగా, ధర్మనిర్వచనం చేస్తే వాడి కేమీ అర్థమైనట్టు లేదసు. ఏదో బిక్కముఖంపెట్టి అల్లాగే

కూర్చున్నాడు. విపులంగా చెప్పాలన్న ఉద్దేశంతో నేను మళ్ళీ ఇట్లా అన్నాను.

'మంచినీళ్లు కావాలె అనుకో, నీవే వంటఇంట్లోకి వెళ్లి, చెంబు వెతుక్కొని నీళ్ళు ముంచుకొని తెచ్చుకోకూడదు,.........నీధి వసారాలో కూర్చుని 'ఏయ్, మంచి నీళ్లు కావాలె. చప్పున తీసుకురా!' అనాలె!

'ఆవిడ తీసుకొని రాకపోతే?' అని అడిగాడు సుందరం.

ఇంత వెర్రివాడేం పీడు!

'ఎందుకు తీసుకురాదురా! తప్పకుండా తీసుకొస్తుంది. నీవు అడగడంలో ఉంది! అంతగా తీసుకు రాకపోతే, కొంచెం కోపం నటిస్తూ, 'ఏయ్ ఏమిటది, నీకుగదూ, చెప్పటం? మంచినీళ్ళు కావాలె! ఏంజేస్తున్నావ్' అని అనాలె, తెలిసిందా! అన్నాను. తెలిసిందని తలఊపాడు సుందరం.

'బట్టె కట్టుకొని బైటికి వెళ్ళాలనుకొంటావు. నీవే దర్జాగా వెళ్ళి, పెట్టె తీసుకొని బట్టలు తీసుకోకూడదు. స్నానం చేసిన తరువాత దర్జాగా కేవిగా అనాలె, 'ఏమేయ్, బట్టలు తీసి ఇయ్యి' అని.

ఆవిడ ఏదైనా పనిమీద ఉండి తొందరగా రాకపోతే, 'ఏమిటా ఆలస్యం! వెళ్లాలి నేను' అని కాస్త కేక వెయ్యాలె," అనికూడా చెప్పాను. వాడు తెలిసినట్లు తల ఊపాడు, కాని ఏదో అడగాలని అడగలేక బాధపడుతున్నట్లు నాకుతోచి 'సందేహాము ఏమన్నా, ఉంటే అగడరా' అన్నాను.

వాడు ఇంకా సందేహిస్తూనే అడిగాడు. 'స్నానానికి నీళ్లు ఆవిడనే తోడమనాలా?' అని

'అవును. ఎందుకూ సందేహం!' అన్నాను.

'బావి చాలాలోతు. ఆవిడ తోడటం కష్టం. అందు కని'...అన్నాడు ఏదో సిగ్గుపడుతూ.

"కొన్నాళ్ళదాకా అల్లాంటి భావాలు పెట్టుకోబోకు. అంతగా అయితే పనిమనిషిచేత తోడించమను. అంతేగాని నీవుమటుకు తోడబోకు' అని చెప్పాను.

'సరే ఆ పనిచేయిస్తా' అని తనకున్న ఒక్క సందేహ మూ తీరిపోయినట్టు సంతోషించాడు సుందరం.

సంతోషించాడు కాని ఇంకా ఆలోచిస్తూ ఉండటం చూచి నేనన్నాను. 'ఒరేయ్, భయంలేదు. ఏ విషయంలో నైనా సరే, ఏమాత్రం సందేహం ఉన్నా సరే నన్నడుగు. చూచినవారంతా ఫలానివారి స్నేహితుడు పెళ్ళానికి భయ పడుతున్నాడని చెప్పుకోటం నాకు తలవంపులుగా ఉంది. పది మందిలో నిన్ను మనిషిగా నిలబెడదామని నా ఉద్దేశం'

ఈ మాటలు విని మావాడు చాలా సంతోషించి కృతజ్ఞత చిలుకుతున్న చూపులు చూశాడు.

అయినా వాడికి ఇంకా ఏవో సందేహాలు బాధిస్తూనే ఉన్నట్లు ఉన్నయి. వాడి ముఖమే చెపుతున్నది ఆ విషయం. వాడికి మంచి ప్రోత్సాహము ఇయ్యాలన్న సంకల్పంతో నేనే అడిగాను 'తమలపాకులు వేసుకొంటూరా మీరూ?' అని. 'ఆ రెండు పూటలా వేసుకొంటాము' అన్నాడు. అయితే మీ ఆవిడే నీకు తమలపాకులు ఇస్తుందా?' అని అడిగాను.

వాడు తల అడ్డంగాతిప్పుతూ చెప్పుకొన్నాడు. 'అఁహా ఆవిడా నేనూ, ఒకసారే భోజనం చేస్తాము. ఆవిడ ఇల్లు సద్దుకు వచ్చేలోపున నేను తమలపాకులకు సున్నంరాచి, చుట్టి ఉంచుతాను. ఆవిడ వచ్చిన తరువాత ఇద్దరం కలిసి వేసుకొంటాము.'

నేను వాడికి విప్పి చెప్పాను ఇల్లాగ, 'అల్లాకాదురా! నేను చెప్పినట్లు చెయ్యి. భోజనం చేసివచ్చి పడకకుర్చీలో హాయిగా పడుకో, ఆవిడగారు వచ్చిందాకా. ఆవిడ వచ్చిన తరువాత తమలపాకులు చుట్టి ఇయ్యమని అడుగు. ఆమెగారే సున్నంరాచి, ఈనెలు తీసి చిలకలు చుట్టియిస్తే నీవు వేసుకోవాలె. ఈమాత్రం తెలియదురా నీకు! ఎన్నని చెప్పేది?' అని విసుక్కున్నాను.

'ఇంకెందుకూ యిక తెలిసింది' అని చెప్పి సుందరం లేచి గబగబా నడచి వెళ్ళిపోయినాడు.

౨

ఆ తరువాత నాలుగు రోజులు గడిచింది. వాడు మా యింటిఛాయలకు రాలేదు. ఏమిజరుగుతున్నదో ఎట్లాఉన్నాడో చూద్దామని వెళ్ళాను, నేనే వాళ్ళయింటికి.

వీధితలుపు వేసిఉన్నది. లోపల ఏదో చాలా గొడవ జరుగుతున్నది. నేను ఆ వరండాలోనే నుంచుని విన్నాను.

వాడి పెళ్ళాం అంటున్నది......'మరీ ఇల్లాగ తయారైనారేం అమ్మా! కాస్త ఏదైనా సాహాయం చేయండీ అంటే, ఊఁహూ అని మూతి బిగించుకొని కూర్చుంటున్నారు.

నేను ఒక్కదాన్నీ ఎంతని సద్దుకుపోనూ - ఆ పనీ, మొగపనీ కూడా! కాస్త లేవండి'-

సుందరం ఏమీ మాట్లాడటం లేదు. ఆవిడ ఎన్ని కేకలు వేసినా వీడు మాట్లాడక ఊరుకొంటున్నాడు.

ఆ అమ్మాయి మళ్ళీ అంటున్నది ... 'లేవండి. నా మాట వినండి. బొమ్మలన్నీ తీసి బైటపెట్టాను. కాస్త గుడ్డతో తుడిచి బల్లమీదపెట్టండి. అట్లా భీష్మించుకు కూర్చుంటే ఎల్లాగ చెప్పండి. బొమ్మలన్నీ పెడితే చూచి అమ్మాయి ఎంత సంతోషిస్తుంది చెప్పండి!'

'ఇటువంటి పనులు నావల్ల కాదు'...అని నిష్కర్షగా అన్నాడు సుందరం.

'ఎటువంటి పనులు మీవలన అవుతెయ్యి?' అని అడిగింది ఆ పిల్ల.

'నాపని అల్లా యింత సంపాదించి తెచ్చిపడెయ్యటమే. ఆ తరువాత సంసారం జరిపే బాధ్యత అంతా నీదే' అని అనేశాడు సుందరం.

'ఈ బొమ్మలు సద్దాలె! అవతల వంటపని చూచుకోవాలె! పిల్లను సద్దుకోవాలె! ఇవన్నీ నేను ఒక్కదాన్నే చేయగలనా? మీరు నాకు కాస్త సాయపడకూడదూ?' అన్నది ఆ అమ్మాయి.

'ఇన్నాళ్ళనుంచీ అల్లాగ అనుకొనే నెత్తిమీదకి తెచ్చుకొన్నాను. అందరూ నన్ను జూచి నవ్వుతున్నారట!' అన్నాడు.

'అవ్వ! ఎక్కడన్నా ఉందా, ఇంత అన్యాయం! సంసారంలో మొగుడికి పెళ్ళామూ, పెళ్ళానికి మొగుడూ

సాయంచేసుకోటం తప్పని ఎవరండీ మీకు చెప్పింది? నా దగ్గ రకు తీసుకురండి, చెపుతా!'

'అవసరమైతే అల్లాగే తీసుకొస్తాను. కాని ఇప్పుడు... ఆ బొమ్మలు తుడవటం, అల్లాంటి పనులేమీ నేను చెయ్యను'-

సుందరం నాసలహాను అనుసరించాడు. కాని చాలా దూరం పోయినాడు. మళ్ళీ వెనక్కు త్రిప్పుకురావటం కష్టం!

ఇంతలో సుందరం వీధితలుపు తీసుకొనివచ్చి నన్ను జూచి, చాలా ఖంగారుపడి తెప్పరిల్లి, లోపలకు రమ్మని పిలి చాడు. 'వస్తానుగాని...ఏమిటి సంగతి ఏదో గొడవ జరుగు తున్నది?' అని అడిగాను.

'గొడవేమీ లేదుగాని...మీరు లోపలికిరండి, వచ్చి మామనిషితో కాస్త చెప్పండి' అని దీనంగా అడిగాడు.

'ఏం చెప్పేదోయ్?' అన్నాను.

సుందరం తలవంచుకొనే జబాబు ఇచ్చాడు.

'ఏంలేదూ, నాకు చెప్పినట్లుగానే ఆమెకు కూడా చెప్పండి...భర్తచేత, భార్య ఏమీపనులు చేయించకూడ దనీ, అల్లాగచేస్తే పాపమనీ—ఇల్లాంటి విషయాలు'

'అల్లాగే చెబుతాను' అని లోపలికి వెళ్ళాను. సుంద రం భార్యను కేకవేసి, నేను ఎవరైంది ఆ అమ్మాయికి చెప్పాడు

నేను ఎవరైంది సుందరం చెప్పగానే 'ఓహో! రండి. బాబాయిగారూ' అంటూ పిలిచింది ఆ అమ్మాయి.

కూర్చుంటానికి అక్కడేమీ లేదు. ఆ ఉన్న ఒక్క కుర్చీ, ఎందుకో స్నానాలగదిలోకి పోయింది.

'కుర్చీ ఏదండీ?' అంటూ ఆ అమ్మాయి అటూ ఇటూ తిరుగుతూ ఉంటే 'ఎందుకులే అమ్మాయి ఇక్కడ కూర్చుం టాను' అంటూ నే నే మూలనున్న చాప తీసుకొచ్చి, వేసు కొని కూర్చున్నాను. సుందరం గబగబా వెళ్ళి కుర్చీ తెచ్చాడు నేను చాపమీదే కూర్చున్నాను.

ఆ అమ్మాయి అయినా నాకేమీ కొత్త పిల్ల కాదు. ఆ అమ్మాయి తల్లి తండ్రులూ, మేమూ గుంటూరులో ఒక ఇంట్లోనే ఉండేవాళ్ళం. అప్పటికి ఈ అమ్మాయి బొత్తిగా పసిపిల్ల. ఈసంగతులు ఆ అమ్మాయికి చెప్పాను ఆ అమ్మాయి ఎక్కువగా సంతోషించి నాతో, తండ్రితో మాట్లాడినట్లు చనువుగా మాట్లాడింది.

'చూచావా బాబాయి, పిల్ల బొమ్మలు పెట్టుకుని ఒక్క తీరానగోలచేస్తున్నది. బొమ్మలన్నీ తీసి బైట పెట్టాను. ఇవి కాస్త తుడిచి ఆ బల్లమీద పెట్టకూడదూ! నేను వంట పనే చూచుకోనేదా, ఈపనే చూసేదా! కాస్త సహా య్యం చేయమంటే, ఆయన ససేమిరా అని కుర్చీలో పడుకొని లేవటంలేదు. ఇంత అన్యాయం ఎక్కడైనా ఉందా? ఇంటి పనులు చేసుకొంటే, ఎవరో నవ్వుతారట! విన్నావా బాబాయి!' అని నావంక చూచింది జవాబు చెప్పమన్నట్లు.

'ఎందుకు నవ్వుతారమ్మా. ఎవరింటి పనివాళ్ళు చేసు కొంటే తప్పేముంది!—' అని అనాలిసి వచ్చింది నేను.

ఈ మాటలు విని సంతోషించి ఆ అమ్మాయి అన్నది,
కాస్త ఆ మాట ఆయనకు చెప్పు బాబాయి!'

'చెప్పేదేమిటి లేఅమ్మా వింటున్నాడుగా!, అన్నాను.

'అయితే ఇవన్నీ నేను ఒక్కదాన్ని చేస్తూ కూర్చుంటే
వంట ఎప్పుడు చేస్తారు? ఎవరైనా పెద్దవాళ్ళు ఉన్నారు గనక
కనా? మొగవాళ్ళయితే నిమిషంలోకి చేశేస్తారు. చూడు
బాబాయి ఆయిన లేస్తారేమో!' అన్నది.

నాకు జాలేసింది. నే నన్నాను 'నే సాయం చేస్తాలే
అమ్మా. నీవు వెళ్ళి వంటపని చూచుకో'. ఆ అమ్మాయి
సంతోషంతో అన్నది. 'మీరు ఈ పూట ఇక్కడే భోజనం
చెయ్యాలె. నేను నిమిషంలోకి వంట పూర్తిచేస్తాను.'

వెళ్ళమ్మా, నీవు వెళ్లు. ఈపని మేమిద్దరం చూస్తాంలే'
అన్నాను నేను.

ఆ అమ్మాయి స్నానానికి వెళ్ళగానే లోపున మేము
ఇద్దరం కలిసి, బొమ్మలన్నీ తుడిచి బల్లపైని చక్కగా పెట్టాము.

ఆ తరువాత స్నానంచేసి భోజనం చేశాము. ఆమె
పాకులు నక్కలు తెచ్చి అక్కడ పెట్టింది సుందరం పెళ్లాం

'ఏయ్, నీవు వచ్చి, ఆకులకు సున్నంరాచి చిలకలు
చుట్టి ఇయ్యి' అని దర్జాగా అన్నాడు సుందరం.

'చెయ్యి ఊరుకోలేదండీ. పిల్లదానికి అన్నం పెడు
తున్నా' అన్నది ఆవిడ లోపలనుండే!

'ఎందుకోయి ఈ మాత్రం పనికి ఆ అమ్మాయిని పిలు
స్తావు?' అంటూ నేను వక్కలు నోట్లో వేసుకొని ఆకులకు
సున్నం రాచుకొన్నాను. సుందరంకూడా ఆ పనే చేశాడు.

ఇంతలో వాడి భార్యకూడా భోజనంచేసి పిల్ల నెత్తుకొని వచ్చి మాకు ఎదురుగా నిలబడ్డది.

'భోజనం చేశావా అమ్మా?' అని అడిగాను. చేశాను బాబాయి! పిల్ల ఏడుస్తున్నది. దాన్ని నిద్రపుచ్చాలె' అన్నది. ఆ అమ్మాయి ఆ తరువాత నాతో అన్నది; 'ఈ నవారు మంచం చూశావా బాబాయ్. ఇది తెగిపోయింది. కుక్కి అయిపోయింది. నాలుగు రోజులనుంచీ నెత్తిని నోరు పెట్టుకొని అరుస్తున్నాను. దీనిని కాస్తవిప్పి అల్లండి అని. వింటేనా? పసిది చంక దిగదు. దానికోసం ఓ దాసీదాన్ని పెడితే, సంసారం గడుస్తుందా? ఏమంటావ్ బాబాయి, మన పని మనం చేసుకోవాలె అవునా?'

'అవును, అవును' అని నేను తల ఊపాను.

'ఇది ఏమంత కష్టమైనపని! అయిదు నిమిషాలలో అయిపోతుంది!'

ఇల్లా అంటు ఆ అమ్మాయి మంచాన్ని విప్పింది.

'రండి, మీా ఇద్దరూ కూర్చుంటే నిమిషంలో అయిపోతుంది' అని భర్తవంక చూచింది. నేను ముందు వెళ్ళి అక్కడ కూర్చుని సుందరాన్ని రమ్మన్నాను. తెగిపోయిన నవారంతా కుట్టి, సాయంత్రం నాలుగు గంటలకల్లా మంచం అల్లేశాము. ఆ అమ్మాయి వచ్చి చూచి సంతోషించి, 'చూడు బాబాయి ఎంతలోకి అయిపోయిందో' అని నాతో అని, 'అవతల వాళ్ళను చూచిఅయినా నేర్చుకోవాలె, అని భర్తతో అన్నది. దీర్ఘాలు తీస్తూ మేము ఇద్దరం నవ్వి ఊరుకొన్నాము.

ఆ తరువాత మాకు కాఫీ ఇచ్చింది ఆ అమ్మాయి. ఇద్దరం పుచ్చుకొన్నాము.

నేను లేచి 'ఇక వస్తానమ్మా!' అన్నాను.

'ఇల్లంతా చూశావా బాబాయి-ఇది పడకగది. ఇది హాలు. వంట ఇల్లు చూశావుగా! ఇది స్నానాలగది' అంటూ అన్నీ చూపించింది.

'బాగుందమ్మా అంతా సౌఖ్యంగా ఉంది అన్నాను నేను.

'అన్నీ బాగానే ఉన్నాయి కాని ఈ రోలు వంట ఇంట్లో ఉంటే ఎంతో బాగుండేది. ఇక్కడ వేశారు! వర్షం వస్తుందనుకోండి, అప్పుడు నాకెంత కష్టం! వర్షంలో తడుస్తూ పచ్చడి నూరుకోవాలె. ఏమంటావు బాబాయి! నేను అన్న మాట నిజం అంటావా కాదా? అని అడిగింది.

'నిజమేనమ్మా అన్నాను నేను.

'నిన్నటినుంచిగోలపెడుతున్నా ఆయన చెవి కెక్కించు కోటంలేదు బాబాయి. కాస్త లోపల వేసిపెట్టరూ?' అని నవ్వుతూ అడిగింది. నేను కాదనలేక పోయినాను.

నేను ఒకన్నే ఆ రోలు ఎత్తి ఎట్లాగో అవస్థపడి వంట ఇంట్లోకి చేర్చాను. సుందరం నవ్వుతూ నుంచున్నాడు.

నేను వెళ్ళటానికి సిద్ధమైనాను. చెప్పులు తొడుక్కొని కర్రతీసుకొని గడపదాటుతూ ఉంటే ఆ అమ్మాయి అన్నది. 'ఎప్పుడన్నా వస్తూఉండు బాబాయి. ఈయన సంగతి ఏమీ బాగాలేదు. పూర్వం అన్ని విషయాలలోనూ ఎంచక్కా

సాయం చేస్తుండేవారు. నాలుగు రోజులనుంచీ భీష్మించుకు కూర్చుంటున్నారు. ఏమన్నా కాస్త సాహాయ్యం చేయమంటే చేయనని! ఎల్లాగ గడుస్తుంది ఒంటరి సంసారంలో! నిజమా అబద్ధమా బాబాయి?' అని అడిగింది.

'నిజమేనమ్మా! సంసారంలో ఒకరికొకరు సాయం చేసుకోకపోతే ఎట్లాగూ?' అన్నాను. ఆ అమ్మాయి నాకు దగ్గరకు వచ్చి 'ఈ సంగతి విన్నావా బాబాయి! ఇంట్లో పనులు చేసుకుంటేనట ఎవ్వరో నవ్విపోతున్నారట! అన్నది.

'ఏడిశారులే! ఎవరమ్మా నవ్వేది?' అన్నాను నేను.

'చెప్పు బాబాయి ఆయనతో కాస్త చెప్పు' అన్నది.

'చెపుతానమ్మా, నేను తప్పకుండా చెబుతాను' అని రోడ్డుమీదికి వచ్చేశాను. సుందరం కూడా బట్టలు వేసుకొని నాతో రావటానికి బయలుదేరాడు. వాడిభార్య వీధివాకిట్లో పిల్లను ఎత్తుకొని నుంచొని భర్తను ఉద్దేశించి, "ఏమండోయ్ మీరు బాబాయితో కలిసి షికారు వెడితే కాదు. ఇట్లా రైలు స్టేషను వైపుకు వెళ్ళి ఒక బండి కేకేసుకు రండి. నేను నాయుడిగారి భార్యను కలుపుకొని సినిమాకు వెడదామను కొంటున్నాను" అన్నది. సుందరం నావంక చూశాడు నవ్వుతూ. నేను, 'వెళ్ళవోయ్, వెళ్ళు. నేను ఇట్లా వెడతాను' అని చెప్పి యింటిదారి పట్టాను. ఆఅమ్మాయి, నామాటలూ విన్నది. మొగుడు గిరుక్కున రైలు స్టేషను రోడ్డుకు తిరగ టమూ చూచింది. ముసిముసి నవ్వులు నవ్వుకుంటూ లోప లికి వెళ్ళిపోయింది.



# శ్రీమతి ఇల్లిందల సరస్వతీదేవి

సరస్వతీదేవిగారు 1918, జూలైలో జన్మించారు. 1938నుంచి కథలు వ్రాయడం ప్రారంభించి ఇప్పటివరకు ఎన్నో కథలు, సాహిత్య సాంఘిక వ్యాసములు, ప్రముఖ పత్రికలలో ప్రచురించినారు. 'జాతిరత్నాలు' వీరి జానపదగేయరచన. 'పిల్లల పాటలు,' 'బాలవీరులు' 'గాంధీజీ జీవితచరిత్ర' 'పండుగ బహుమానము' అచ్చుపడిన రచనలు. బాలవీరులకు హైదరాబాదు ప్రభుత్వమునుండి బహుమతి లభించింది. బాల, మహిళాసాహిత్యములు సాంఘిక కార్యకలాపములయెడ వీరికి ఆసక్తియున్నది. రెండు సంవత్సరములు ఆంధ్రపత్రికలో వనితాలోకమును నిర్వహించినారు. ఆంధ్ర యువతీ మండలికి సెక్రటరీ, ఉపాధ్యక్షురాలుగా పనిచేసినారు. ఆంధ్ర సారస్వత పరిషత్తుకు, శ్రీకృష్ణదేవరాయ భాషానిలయమునకు కార్యనిర్వాహక సభ్యురాలు.

సరస్వతీదేవిగారు ఆంధ్ర ప్రదేశ్ లెజిస్లేటివ్ కౌన్సిలుకు తిరిగి ఎన్నికఅయి రాజకీయ రంగమునందుకూడా ఆసక్తి చూపుచుండుట ప్రశంసార్హమైన విషయము.



# కథ

కుటుంబంలో వచ్చే చిన్న చిన్న పొరపులు పెద్దవై మితిమీరినవై ఒక శరీరాన్ని గాయపరచి పశ్చాత్తాపానికి పాలవడం ఇందులో కథ. కొన్ని కారణాలు పరిణామాలంత పెద్దవై యుండవు. చంద్రయ్యకు అన్న అయిన చలమయ్యతో విరోధం పెట్టుకునే అంత దుర్ఘటన ఏమీ జరగ లేదు. కాని మనుష్యుడు ఎప్పుడూ కొండరాళ్ళతోనే తల బ్రద్దలు కొట్టుకోడు. మనస్సుబాగాలేనప్పుడు కంకర రాయినికూడా కల్పించి దెబ్బతిని హాహాకారాలు చేస్తూ ఉంటాడు. తనలోపాలతో తానే పోటీపడి మానసికమైన దెబ్బలు తింటూ ఉండటం మనిషికి సహజం. ఇలాంటి నిప్పుల్ని వెళ్ళగ్రక్కడానికి కుటుంబం అనువైన ప్రదేశం కాదు. కుటుంబంలో ఈ నిప్పుల్ని ఆర్పే స్నేహ యంత్రాలు ఎప్పుడూ పనిచేస్తూ వుంటాయి. అందుకని రచ్చకెక్కాలి. ప్రస్తుత కాలంలో ఈ రచ్చ రాజకీయాల పార్టీ. ఇంట్లో నరరూపంతో ఉన్నవాడు రాజకీయంలో నారసింహ రూపం ఎత్తుతాడు. చంద్రయ్య నారసింహరూపం ఎత్తాడు. ఊరిమాడు. చల్లబడ్డాడు. అందువల్లకూడా ఈ కథ రక్తికట్టింది. ముందు సరళంగా సాగి రానురాను వేగాన్ని హెచ్చించి, బలాన్ని పెంచుకొని అవక్రంగా నడిచి చరమస్థాయిని అందుకున్న కథ ఇది.

మనస్సు క్రీడల కథగాదు. మనస్సు ప్రవృత్తులకథ. సాంప్రదాయిక మానసిక ప్రవృత్తులు సాంప్రదాయిక ఘటనలకు చుట్టుకొనివచ్చి కరుణాంతంగా కథను రక్తికట్టించినాయి.

ఇది ఘటనా ప్రధానమైన కథ



# సహోదరులు

వీరాస్వామి సంధ్య చీకటి వేళ చంద్రయ్య ఇంటితలుపు కొట్టినాడు. తెలుగు దినపత్రికను ఎడమచేతితో పట్టుకునే కుడి చేతితో తలుపు తెరచి...వీరాస్వామిని లోపలికి రమ్మన్నాడు చంద్రయ్య.

"చంద్రయ్యా! మన ప్రయత్నాలన్నీ వ్యర్థమై పోయే టట్లు కనబడుతున్నాయి. ఏభయిమందిని పోగుచేసుకొని... చలమయ్య ఆ ఊరు వెళ్ళనే వెళ్ళినాడు. మనము ఖర్చు పెట్టిన సొమ్మూ—పడిన శ్రమా వ్యర్థమైపోతాయేమో నని పిస్తున్నది. ఏదో ఉపాయము చూసి నన్ను గట్టునపడ వెయ్యి" నిలువబడే చంద్రయ్య ముఖములోకి చూస్తూ అతడి రెండు భుజాలమీదా చేతులు వేశాడు వీరాస్వామి.

"చలమయ్య ఆ ఊరు వెళ్ళాడనేనా నీ భయము? నేను ఆ చలమయ్యకంటె ముందుగా- అంతకంటె ఎక్కువ మంది జనముతో - తెల్లవారకముందే వెళ్ళి - నీవు కోరి నంత ప్రచారము చేసివస్తే సరికదా! భారమంతా నాపైన పెట్టి — నీవు నిశ్చింతగా ఇంటికి వెళ్ళు. కాని ఒక్కమాట మాత్రము మనసులో ఉంచుకో. మనకు సహాయపడుతున్న వాళ్లకు కాస్త విరివిగా డబ్బు ఖర్చుచేయవలసి ఉంటుంది... చూసుకో...రేపు ఈ వేళవరకూ...ఎంతపని జరుగుతుందో! ఆ చలమయ్యను చూస్తేనే అంత భయపడతా వెందుకు? వాడు లెక్కపెట్టతగిన మనిషనా నీ అభిప్రాయము?" చంద్రయ్య తనతోపాటు వీరాస్వామిని కూడా మంచముమీద

కూర్చోబెట్టుకొని ... 'ఏం వీరాస్వామీ! నా మాటమీద నీకు నమ్మకము కుదరటము లేదా?' అన్నాడు.

'లేకేం! చాలా ఉన్నది. ఆ చలమయ్య తగనివాడు. అతడి వాక్కు ఎటువంటిదోగాని ... ఒక్క మాటతో అందరూ అతనికి లోబడిపోతారు. చిల్లిపైస చేతిలో లేకుండానే ప్రచారము సాగించుకొని వస్తున్నాడు. ఆ జిల్లా సాంతము అతడి మాటమీద నడుస్తుందని అందరూ అనుకుంటున్నారు" అని ఒక్కసారి దీర్ఘముగా ఊపిరి తీసుకొని విడిచాడు వీరాస్వామి.

"ఇదిగో స్వామీ! నీవు ఇప్పటినుంచీ ఊరికే దిగులు పడుతూ కూర్చోకు. జయాపజయాలు మొదలు పెట్టిన దగ్గర నుండే లెక్కచూసుకుంటూ దిగులు పడకు. నేను ఆ చలమయ్య అంతుకనుక్కోనిది ఈసారి విడిచిపెట్టను. నీకు చేసిన వాగ్దానము ఏమాత్రము మరువను. ఆ భారమంతా నామీద ఉంచి నీవు నిశ్చింతగా ఉండు."

మంచముమీదనుండి ఇద్దరూ లేచి వాకిటిముందుకు వచ్చి నిలుచబడ్డారు. వీరాస్వామి పది నూరు రూపాయల నోట్లను రెండుసార్లు లెక్కపెట్టి చంద్రయ్య షర్టుజేబులో పెట్టి-అతడి ముఖమువంక చూశాడు.

"రేపు పని పూర్తిచేసుకొని నా దగ్గరికి రా. ఇప్పు డిచ్చినవి రేపటి ఖర్చుకేలే" చంద్రయ్య ముఖము చూస్తూ ...మనసులో ఆలోచించుకొంటూ వీరాస్వామి వెళ్ళిపోయి నాడు.

ఆ జిల్లాలో మోతుబరి రైతు అయిన చలమయ్య ...శాసనసభకు రంగయ్యను అభ్యర్థిగా నిలబెట్టవలెనని తీవ్ర

ముగా కృషి చేస్తున్నాడు. ప్రజలను సమావేశపరచి ప్రచారము చేస్తున్నాడు. ఆ జిల్లా ప్రజలకు మొదటినుండీ చలమయ్యమీద అపరిమితమైన భక్తి గౌరవాలు ఉన్నాయి. ప్రజలకు ఆయన వరము లిచ్చే దేవరగా కనబడుతున్నాడు.

స్వతంత్రముగా ఆ జిల్లాకు అభ్యర్థిగా నిలవబడ దలచుకొన్న వీరాస్వామికి — చలమయ్య చేస్తూఉన్న ప్రచారము వలన కలవరపాటు హెచ్చినది.

'రంగయ్య తెలివికి శాసనసభా సభ్యత్వము తక్కు-వైనది కాబోలు! నిజంగా సభ్యుడు కావడమే తటస్థించినట్లయితే — వాడిని పట్టపగ్గాలు ఉంటాయా? రంగయ్య! వట్టి పనికిమాలినవాడు. వాడి చదువెంత — వాడి రాజకీయ పరిజ్ఞాన మెంత? నలుగురిలో నిలువబడి నాలుగు మాటలైనా మాట్లాడలేడు! అప్పు డెప్పుడో దోచినధనముతో — ఇప్పుడు ప్రచారము చేసుకొని — ఎన్నికలలో నిలువబడుతున్నాడు. ఒకవేళ — గెలవటమే నిజమైతే — పట్టపగలే దారులు దోయించడూ? ... వాడిని గెలువనిస్తే ... నేను కోటయ్య కొడుకునే కాదు!' అనుకున్నాడు వీరాస్వామి. తెల్లవార్లూ కంటికి నిద్రలేకుండా యోచించసాగినాడు. తెల తెల వారుతుండగా చిన్నకునుకు పట్టినది. ఆ పట్టీపట్టని నిద్రలో వీరాస్వామి కంటికి చంద్రయ్య ప్రత్యక్షమైనాడు. మెలికలు తిరిగిన వెంట్రుకల తల. స్వదేశీ వస్త్రధారణమూ — పట్నం వాసపు పాపోసులూ — చేతిలో కర్ర. ముఖము పైకెత్తి చూస్తేనేగాని చూపందని విగ్రహము — ముఖముమీద చిరు

నవ్వు. టకటక తలుపుకొట్టి 'స్వామీ! అన్నిటికీ నేనున్నా నుగా!' అని చంద్రయ్య చెప్పిన ట్లనిపించింది వీరాస్వామికి.

చంద్రయ్య పదిమంది గ్రామస్థులకు జవాబు చెప్పగల దేహ దారుఢ్యము కలవాడు. మాటలతో ప్రజల నాకర్షించ గలిగినవాడు. అదిగాక — ఆ జిల్లా మొత్తముమీద చల నయ్య పేరు వినగానే అసహ్యించుకొని పళ్లుకొరికేవాడు ఒక్క చంద్రయ్యే!

ఇతడే తన కన్నివిధములా అనుకూలమైన వ్యక్తి అని వీరాస్వామి భావించుకున్నాడు.

*　　　　*

అది నవభారతములో ప్రజాప్రభుత్వపు ప్రథమ ఎన్ని కల సంరంభకాలము. అత్యుత్సాహముతో ప్రజలు కేరింతలు కొట్ట నారంభించినారు. ఏభయి సంవత్సరాల శాంతిసమరము తరువాత...నేడు సంపూర్ణ స్వాతంత్ర్యము! ప్రజాస్వామ్యము!

తెలిసినవారికీ తెలియనివారికీ ఒకటే సందడి! ఎన్నికల సందడి. ప్రతి గ్రామములోనూ ఎన్నికల ప్రచారము అఖండ ముగా సాగిపోతున్నది. జీపుకార్లూ...పెద్దకార్లూ ...లౌడ్‌స్పీ కర్ల నలంకరించుకొని...ప్రచారకులతో తిరుగనారంభించినవి.

'కడుపునిండా అన్నమూ...ఒంటినిండా బట్టా మీకు దొరకవలెనంటే మన జిల్లాలోకి సమర్థుడైన రంగయ్యకే మీ ఓటు ఇవ్వండి అని కేకలు వేస్తూ ఏభయిమంది జనము కాగి తాలను పంచుతూ వీధులవెంబడి బయలుదేరినారు. ఆ గ్రా

మములోని పిల్లలు వారిని వెంబడించినారు. ఊరిబైట రచ్చ బండ దగ్గర పెద్ద సమావేశము జరిగినది. రంగయ్య ప్రతిభా సామర్థ్యములను గురించి సుమారు ఒక గంటసేపు ఒకరు ఉపన్యసించినారు. గ్రామస్థులకు రంగయ్య పేరు బాగా మనసున పట్టినది.

ఆ గుంపు ఆ దినము అక్కడినుండి బయలుదేరి నాగు నాటికి మరొక గ్రామములో ప్రచారము చేయుటానికి ఏర్పాటు చేసుకున్నది.

ఆ మరునాడు ఆ గ్రామములోకి మరొకగుంపు బయలుదేరి వచ్చింది. 'బీదజనులకు న్యాయము జరుగవలెనంటే—బీదలు మానవులుగా భావింపబడవలెనంటే — దీన దయాళుడైన వీరాస్వామికే మీ ఓటు నివ్వండి. దాంభికులను నమ్మబోకండి!'

జనసమూహము ముందుకు సాగిపోతున్నకొలదీ- ఆ నినాదాలు ప్రజల హృదయాలలో నాట్యము చేయసాగినవి. 'ప్రతి మనిషికీ కడుపులోకి అన్నమూ, ఒంటికి బట్టా ఏర్పాటు చేయగలిగినవాడికే మా ఓటు' అని నిశ్చయించుకొన్న ప్రజలకు - రెండవసారి జరిగిన ప్రచారముతో ప్రథమంలో కలిగిన అభిప్రాయము మారిపోయినది. బీదల కష్టాలను తొలగించి — బీదలనుకూడా మానవులుగా భావించే మహానుభావుడున్నట్లయితే తమ ఓటును ఖండితముగా ఆయనకే ఇవ్వవలెనని ప్రజలు నిశ్చయించుకున్నారు.

మూాడవనాడు ఆ గ్రామవీధులలో మరొక జనసమూహము తిరిగినది.

ఆ సాయంత్రము మరొకటి సంచారము చేసినది. తాము అంతకు పూర్వము చేసిన ఘనకార్యములను విపులీకరిస్తూ కొన్ని జీపుకార్లు గ్రామ సంచారము చేసినవి.

ఆ గ్రామములోని ప్రజల ఓట్లకు వారసు లనేకు లయినారు. ఒక్కొక్క సంస్థ ప్రచారము చేసుకొని...ఓట్లను ఖాతాపరచుకొని - సాగిపోయినది.

భుజ బలముగల ఏభయిమంది జనముతో చంద్రయ్య బంధులు చేరి గ్రామగ్రామమూ సంచారము సాగించినాడు.

మార్గశిరమాసపు చలి మానవులను గడగడ వణకించి వేస్తున్నది. పుచ్చపువ్వువలె వెన్నెల విరియకాస్తూ ఉండగా చంద్రయ్య వెంబడి బంధులు చేరినజనము ఏలపదాలు పాడుకుంటూ నడుస్తున్నారు. ఇంకా కోసెడు దూరము నడిస్తే నేగాని గమ్యస్థానము చేరుకొనరు. త్వరపడి చలమయ్యకంటే ముందు ఆ గ్రామము చేరుకొని ప్రచారము చేసుకోవాలి.

పొడుగుపాటి కర్రలను చేతపట్టుకొని నలుగురు మనుష్యులు ముందు నడుస్తున్నారు. చంద్రయ్య లంకపొగాకు చుట్టను వెలిగించి గుప్పుగుప్పున పొగ విడుస్తూ - తల వంచుకొని ఆలోచించుతూ - నడుస్తున్నాడు. తక్కినవారంతా ముందుగా వెళ్ళినవానిని అనుసరించుతున్నారు.

గ్రామము కనుచూపు మేర వరకూ వచ్చినది. పొలి మేర సమీపములో - ఒక పాకలోనుండి జనసందడి చంద్ర య్యకు వినవచ్చినది.

ఆ సందడి చలమయ్య పార్టీది కాదుగద!

చంద్రయ్య మనసు ఉద్రేకించినది. చలమయ్యకంటె ముందుగా గ్రామము ప్రవేశింపవలెనని అతడి సంకల్పము. ఆ చలమయ్య అదేమి మనిషో - జనాన్ని ఋణాలమీద కూడ గట్టుకొని - తన చేతిక్రింద పెట్టుకుంటాడు! ఎక్కువగా డబ్బ యినా ఖర్చుచేయడు!

చంద్రయ్య రక్తము ఉడుకెక్కినది. జేబులోని పైకము గలగల లాడినది. వెంటనే తలమీది ముసుగుతీసి-చంద్రయ్య తన జట్టువారి కందరికీ చేతిసైగ చేసినాడు.

అందరూ ఒక్క పరుగున పాకమీద పడినారు.

* * *

ఎన్నికలు జరిగేవరకూ చంద్రయ్య ఊళ్ళమీద తిరుగు తునే ఉన్నాడు. ఎన్నికలబాపతు పైకము అతడి సంచిలో ఏమాత్రమో నిలచి - అతడిని కలకత్తా పట్టణము వరకు లాగుకొని పోయినది.

క్రొత్తగా పట్టణపు విశేషాలనూ, వింతలనూ చూసి ఆనందిస్తున్న చంద్రయ్య...తిరిగి గ్రామము చేరుకొనటానికి కావలసిన పైకము మాత్రము అట్టిపెట్టుకొని-మిగిలినదంతా ఖర్చుచేయ నారంభించాడు. అతడి కా సంబరములో ఎన్ని దినాలు గడచినవో గమనికే లేదు.

ఒకనాటి ఉదయము హోటలులో కాఫీ త్రాగుతుం డగా తెలుగు పత్రికలో ఎన్నికల ఫలితాలు పెద్ద అక్షరా లలో కానవచ్చినవి.

ఓట్లు ఎక్కువ సంఖ్యలో సంపాదించుకొని ... ఎన్ను కొనబడిన వ్యక్తి చంద్రయ్య పార్టీ కాదు – చలమయ్యాది అంతకంటె కాదు – మూడవపార్టీ వ్యక్తి!

చంద్రయ్య మనసు ఒక విధముగా సమాధానము చెం దినది. తాను నిలువబెట్టదలచిన వ్యక్తి ఓడిపోయినా చల మయ్యపార్టీ మనిషిమాత్రం గెలువలేదని!

* * *

చంద్రయ్య ఇంటికివచ్చి విశ్రాంతి తీసుకుంటున్నాడు. ఈ సంగతి వీరాస్వామికి తెలిసి చూడటానికి వచ్చాడు.

'నేను రెండుసార్లు మీ యింటికి వచ్చాను ఆ మధ్య. నీవు ఊళ్లోలేవా ఏం...కనబడలేదు' అన్నాడు వీరాస్వామి.

'ఆ రోజులలో తిరిగిన తిరుగుడుకు శరీరము చాలా అలసిపోయినది. గాలి మార్చితే బాగుంటుం దేమోనని బయ లుదేరి వెళ్ళాను' తల వంచుకొని అన్నాడు.

వీరాస్వామికి చంద్రయ్యతో ఏమి మాట్లాడవలెనో తోచలేదు. 'అట్లాగా! ఇప్పుడు ఆరోగ్యము బాగున్నదికదా!' ఈ మాట మాత్రము నిర్వికారముగా అనగలిగాడు.

అయిదు నిమిషాలపాటు ఇద్దరిమధ్య నిశ్శబ్దము భరించ రానిదిగా తయారు అయింది. చివరకు చంద్రయ్య 'చూస్తు

న్యాయముగా వీరాస్వామీ! న్యాయముగా గెలవటము చాలా కష్టమైన పని' అన్నాడు ఇంటి కప్పును చూస్తూ.

"అవును. ఓడిపోయినాను గనుక న్యాయము నావైపే ఉన్నదనుకోవాలి." తల ఆడిస్తూ వీరాస్వామి గడపదాటి వెళ్ళిపోయినాడు.

చంద్రయ్య మాట్లాడకుండా భోజనము చేసి పడుకు న్నాడు.

రాత్రి పన్నెండుగంటలవేళ చంద్రయ్యకు నిద్రలో మెలకువ వచ్చింది నిశ్శబ్దాన్ని చీల్చుకుంటూ ఎక్కడినుండో ఎవరో మూలిగిన శబ్దము చంద్రయ్యకు వినపడ్డది.

మొదటిసారి రెండవసారి పరాకుగా విన్నాడు.

మూడవసారి నాలుగవసారి బాగా స్ఫుటముగా విన బడ్డది.

మనసుపెట్టి విన్నకొలదీ సమీపమునుండే వినవస్తున్న ట్లుగా చంద్రయ్యకు తోచింది. భార్యను లేపి అడిగాడు.

"మొదటి ఎలక్షను గడబిడలో బావగారికి బలమైన దెబ్బలు తగిలాయట. తలమీద పెద్దగాయమైనదట. కాలి ఎముక విరిగినదనుకుంటున్నారు. నిలబడలేరట. చాల బాధ పడుతున్నారట' కండ్లు నులుపుకుంటూ జంకుతూ చెప్పింది భార్య.

'నీకెవరు చెప్పారు?' అన్నాడు ఆశ్చర్యముతో.

'బావగారి రాము చెప్పాడని మన పనిమనిషి అన్నది. వాళ్ళమ్మ నిద్రాహారాలు లేకుండా ఏడుస్తున్న'దని చెప్పాడట!

అంతలో 'అబ్బా' అని బాధకొద్దీ మూలిగిన శబ్దము తిరిగి వినపడ్డది.

చంద్రయ్య బలవంతముగా నిగ్రహించటానికి ప్రయత్నించాడు. మూలుగు చెవిన పడినప్పుడల్లా దేహము జలదరించి మనసు కలతపడ నారంభించింది.

ఆశబ్దానికీ ఈహృదయానికీ ఏమి సంబంధమో - ఆ మూలుగునకు చంద్రయ్య హృదయములోని నరాలు తోడు పలుక నారంభించినవి.

రెండు చేతులతో తలపట్టుకొని చంద్రయ్య బోరగిల పడుకున్నాడు.

ఈసమయములో తనతల్లి ఉన్నట్లయితే ఆమె హృదయమెంత తరుగుకొని పోయేదో! చలమయ్యనూ చంద్రయ్యనూ గన్న తల్లి శంకరమ్మ ఇద్దరిని చెరి ఒక కన్ను అనుకొనేది. కుమారద్వయము జన్మించిన నెలకే తండ్రి హృద్రోగముతో అకస్మాత్తుగా చనిపోయినాడు. ఆయింటా—ఆ యింటా పనిచేసి—వంటలుచేసి బిడ్డలను పెంచుకొన్నది ఆ తల్లి. ఆమె నోటి మంచితనమువల్ల బిడ్డలకు రెండు అక్షరపు ముక్కలు అంటి జీవనోపాధులు కలిగినవి.

బాల్యములో అన్నదమ్ములిద్దరికీ - ఇతరులకు అసూయను పుట్టించేంత వాత్సల్యము ఒకరిపైన ఒకరికి ఉండేది. పాతికేళ్ళ కిందటకూడా - తమ్ముడికి జ్వరము రాగానే -ఆదుర్దాతో రెండు మైళ్ళ దూరము నడిచివెళ్ళి అన్న మందు

తెచ్చియిచ్చేవాడు. అన్న పథ్యములోకి కావలసిన అప్పడాలు పొరుగూరునుండి - సూర్యోదయానికి పూర్వమే తమ్ముడు తెచ్చియిచ్చేవాడు. తనకు లభ్యమైన చిరుతిండిని చేతబట్టు కొని అన్న వచ్చేవరకూ ఎదురుచూస్తూ తమ్ముడు వాకిట్లో నిలువబడేవాడు. తమ్మునితో పంచుకొననిదే అన్నకు ఏ వస్తు వూ నచించేదికాదు. వాళ్ళ హృదయాలు పరస్పరమూ మార్మ్రోగుతూ ఉండేవి.

యౌవనము పొడసూపి వ్యక్తిగత జీవితము లారంభ మయేవరకూ ఏ మార్పూ ఉన్నట్లు కనబడలేదు. ఒకనాడు చంద్రయ్య సామానులకొరకు బజారుకు వెళ్లాడు. బేరము కాగానే - సెట్టి 'బేరములో అన్నయ్యగారిని మించిపోతు న్నారే!' అన్నాడు.

'అంటే?'

'అంటే ఏం లేదులెండి. అన్నయ్యగారిని అదోక మాదిరి మనసు' అన్నాడు సెట్టి.

ఇంటికి వస్తూనే చంద్రయ్య తల్లిని భోజనము పెట్టమ న్నాడు. 'నాయనా! వంట సాంతమయిన తరువాత భోజనము చేతువుగాని. అన్నయ్యకూడా తొందరపడుతున్నాడు. పావు గంట తాళితే అయిపోతుంది' అన్నది.

మాట్లాడకుండా చంద్రయ్య వెళ్ళి గదిలో పడుకు న్నాడు. అన్నగారి గదిలోనుంచి కిలకిల నవ్వులు వినబడుతు

న్నాయి. రెండేండ్ల పిల్లవాడు వచ్చీ రాని మాటలలో తండ్రితో దాగుడుమూత లాడుతున్నాడు.

చంద్రయ్య కానాడు మనసు స్వాధీనములో లేదు. కారణ మేమో అతడి ఊహ కందలేదు. బాలుడి కేరింతలు ఒకప్పుడు అతనికి ఆనందాన్ని కలిగించినవే గాని యిప్పుడు చిరాకు పరచాయి. అంతలో తల్లి భోజనానికి పిలిచింది ... 'అన్నయ్య పీటమీద కూర్చున్నాడు. నీవుకూడా రా నాయనా!' అని

చంద్రయ్య అన్యమనస్కుడై మెల్లగా లేచి పీటమీద కూర్చున్నాడు. చంద్రయ్య భార్య నెయ్యి వడ్డిస్తున్నది. గిన్నె పట్టుకొని చంద్రయ్యదగ్గర ఒక నిమిషముసేపు నిలువబడ్డది. అతడు పరధ్యానములో ఉండగా చూసి బావగారికి నెయ్యి వడ్డించి వచ్చి మళ్ళీ నిలువబడ్డది. చంద్రయ్యకు నెయ్యి వేయించుకొన బుద్ధి పుట్టలేదు.

అప్పటికి నాలుగేళ్ళక్రింద పొరుగూరినుండి రామయ్య తన కూతురిని ఈ యింటికి యివ్వవలెనని అడుగుదామని వచ్చాడు. తల్లి రెండవ పిల్లవాడికి ... వచ్చే సంవత్సరము ఆ పిల్లను చేసుకొంటామని చెప్పింది. అతడు వినక వచ్చే సంవత్సరమైనా పెద్దపిల్లవాడికిగాని యివ్వనన్నాడు. తల్లి కాదనలేక పోయినది. నిజానికి ఆ పిల్లదగ్గర వరుడు హీనముగా కనబడుతాడు.

చంద్రయ్యకు ఆ విషయము తలవనితలంపుగా అప్పుడు జ్ఞాపకము వచ్చింది. ఆ రామయ్యకు ఇద్దరన్నదమ్ములలో

కనబడ్డ వ్యత్యాస మేమిటి! తాను తరువాత ఎకరపు పల్లపు భూమి కట్నము తీసుకొని చక్కని పిల్లనే పెళ్ళిచేసుకొన్నాడు. ...కాని ఆ విషయము మాత్రము మరపుకు రావటము లేదు.

లోతుగా ఆలోచించి తే ఆ సంఘటనలలో ఒక్కటైనా పెద్దకారణ మనిపించుకోదు కాని ... ఇవన్నీ అతడిమనసులో ఒకమూల కాపురము చేస్తూనే ఉన్నాయి ... ఇప్పటికీ.

మధ్యాహ్నము నిద్రపోయి లేచేసరికి భార్య గదిలోకి వచ్చి ... కాఫీ గ్లాసు చేతికందించింది. 'చక్కెర చాలలే దన్నా'డు, ఆమె అమాయికముగా ... 'ఎవరూ తక్కువైన దని అనలేదే!' అన్నది. వెంటనే 'అన్నయ్యేనా అననిది?' అన్నాడు.

మరునాటి నుంచీ అన్నగారి పిల్లవాడినిఎత్తుకొని ముద్దు లాడుతున్న తన భార్యను ... అ కారణముగా కోప్పడి ... పిల్లవాడిని వదిలిపెట్టి రమ్మని అన బుద్ధి పుట్టింది అతనికి.

మనసులో బయలుదేరుతున్న ఆ విప్లవ మేమిటో దాని నామరూపా లేమిటో అతడికి తెలియలేదు. కాని ... ఆనాటినుండి అతడి మనసులో ఒక భావము సంచారము చేయ నారంభించినది. సాంసారికముగా ... సాంఘికముగా తమ యిద్దరికీ గల వ్యత్యాసమూ...తారతమ్యమూ బాగా ప్రచారానికి వచ్చినాయి కదా? ఆ భేద సాదృశ్యాలు ఏవేవి?

దాని జవాబు ననుసరించుకొని మరొక ప్రశ్న ఉదయించింది. ...'అయితే ఏది ఎక్కువ?' అని. స్వాభిమానము నిర్ణయానికి రానివ్వలేదు.

తల్లి పోయిన తరువాత ... చంద్రయ్యకు ఏడాది బిడ్డ చనిపోయింది. ఆ ఊరిలో ఎరిగినవాళ్ళంతా ఆడా... మొగా ...వచ్చి దంపతులను పలకరించి ... సానుభూతి వాక్యాలు పలికి వెళ్ళారు అన్న చలమయ్యమాత్రము నోటితో తమ్ముణ్ణి నేవిధా పలుకరించలేదు కాని ... అతని ఒడిలోనే ఆ బిడ్డ కన్నుమూసింది. చలమయ్యే ఆ బిడ్డను తీసుకొని వెళ్ళాడు. పది రోజులపాటు తమ్ముడినుంచమురుదగ్గర మంచము వేసుకొని పడుకొన్నాడు. తమ్ముడిని తన పంక్తికి భోజనానికి కూర్చుండబెట్టుకొని తమ్ముడు నోట్లో ముద్ద పెట్టుకొన్న తరువాతనే తాను మెతుకు కొరికేవాడు. అప్పుడు ఇతరుల సానుభూతి వాక్యాలతో తాను అన్న సానుభూతిని పోల్చి చూచుకున్నాడు. అన్న నోటివెంట మాటే రాలేదు.

ఆ తరువాతనే ఆ యింటిని రెండు భాగాలుగా పంచుకొని మధ్య తలుపులను బంధించుకొన్నారు. క్రమాగతముగా ఒకరిని చూడగానే మరొకరు ముఖము త్రిప్పుకోవటము కుటుంబములోని శుభాశుభ కార్యములలో ఒకరినొకరు పలుకరించుకొనకుండా ఉండటము జరుగుతూ వచ్చినది. బిడ్డలు మాత్రము ఇంటి ఆవరణలో తప్ప బయట మాట్లాడుకోవడము నిలుపుకొన్నారు.

'అబ్బా! తలపోటు!'

తిరిగి మూలుగు వినపడ్డది.

మంచముమీద పడుకొని సోదరునకూ తనకూగల గుణ భేదాలను గురించి ఆలోచిస్తున్న చంద్రయ్య మూలుగును విన్న తరువాత మంచముమీద లేచి కూర్చున్నాడు.

గోడ గడియారము ఖంగు ఖంగున రెండుగంటలు కొట్టింది.

'అమ్మా! ఉ!'

చంద్రయ్య దిగ్గున లేచి నిలువబడి—రెండు నిమిషాల పాటు యోచించి — దక్షిణపు దిశన బంధించిఉన్న తలుపును తోయ ప్రయత్నించాడు. ఆ తలుపులను బంధించి ఎనిమిది సంవత్సరాలకు పైగా కావటమువలన—గొడ్డలి సహాయముతోగాని గడియ పైకి లేచినది కాదు.

కరదీపిక చేతబట్టుకొని—సావడిలోనుండి—చంద్రయ్య గదిలోకి వెళ్ళి నిలువబడినాడు.

ఒకమూల సన్నగా దీపము వెలుగుతున్నది. మంచముమీద అన్న పండుకొని మూలుగుచున్నాడు. తలకూ, కాలికీ కట్లుకట్టి ఉన్నాయి. వదినెగారు రోగికి విసురుతూ దగ్గర కూర్చున్నది.

చంద్రయ్య చేతిలోఉన్న కరదీపిక చేయిజారి నేలమీద పడ్డది. అన్నను ప్రత్యక్షముగా చూసిన తమ్ముడు 'చలమన్నయ్యా!' అంటూ మంచముమీద ఉన్న రోగిపై బడి — తన హృదయానికి అతడిని అదుముకున్నాడు.

'తలబాధరా చంద్రీ! తలబాధరా!' తమ్ముని తన బాహువులతో బంధించుకొన్నాడు చలమయ్య.

అన్నదమ్ముల కౌగిలింతను గాంచిన తోడికోడళ్ళ హృదయాలలో 'ఎంతయినా వాళ్లు ఒక తల్లిపిల్లలు!' అన్న భావము మెరపువలె మెరసింది.



# శ్రీ హిత శ్రీ

జననం:— 1926. తెనాలి. హితశ్రీగారు 1949 నుంచి కథలు వ్రాయడం ప్రారంభించినారు. వర్తమానజీవితంలోని నైరాశ్యం, నిస్పృహలను మనస్తత్వపు వెలుతురులోనుండి సామాజికంగా ప్రదర్శించే నిశ్చలమైన, నిరాక్రోశమైన శైలి వీరిది. హితశ్రీగారు షుమారు నూరు కథలు వ్రాశారు. చాలా కథలు పత్రికల్లో వెలువడినాయి. దాదాపు ఇరవై రేడియో నాటిక లున్నాయి. 'విచిత్రజీవులు' నాటకం, 'అంతర్వాహిని' అనే నవల భారతి పాఠకులకు సుపరిచితమే. ఇవిగాక వీరు వ్రాసినవి ఆరు నాటిక లున్నాయి. ఆర్థికశాస్త్రం వీరి అభిమాన విషయం.

ప్రస్తుతం వి. యస్. ఆర్. కాలేజి, తెనాలిలో కామర్సులెక్చరరుగా పనిచేస్తున్నారు.



# కి ఫ

ఒయ్యారంగా వీచే గాలివీవనలకు ఒరుగుతూ తొలుగుతూ పట్టు విడిపోతున్నట్లుండి విడిపోక ఊగుతూ నిలుచున్న దారాల్లాంటి సుకుమారాలైన హృదయాందోళికల మీద ఈ కథ నడిచింది. ఇరువురి హృదయాలు సంకోచంతో సిగ్గుతో బిడియంతో భయంతో ఒక నచ్చుల శంఖాన్ని ఆధారం చేసుకొని ఊగిసలాడుతూ ఉంటాయి. నచ్చుల శంఖం వాళ్ళమనస్సులలోని కదలికలనూ, బెదురుపాటులనూ, నిశ్వాసలను తనలో నిముడ్చుకొని తనమీదకు తెచ్చుకొని వాళ్ళ రహస్యసంభాషణలను మనకు చెబుతూ ఉంటుంది. మనం కొన్ని సమస్యలను తెగింపుతో చేయలేము, పరిష్కరించలేము. బలవంతాన త్రెంచితే ఏమీ ఉండదు. అయినా అవి మన అంతరాళాన్ని పట్టి ఉంటాయి. వల్లభరావు మనస్సుకూ ఆ స్త్రీ హృదయానికీ మధ్య ఎన్నో మంతనాలు జరిగాయి. అవి మనం చెవి యొగ్గి వింటేనే వినపడుతవి.

ఇది భావనా ప్రధానమైన కథ.

# మచ్చల శంఖం

సిమెంటు చప్టాలం ఉన్న ఇసుక నేలమీద నడుస్తున్నాడు వల్లభరావు, అడుగులో అడుగు వేసుకొంటూ. సముద్రపునీరు అతని కాళ్ళని తడపటానికి మాటిమాటికి ప్రయత్నించి కవ్విస్తోంది. బీచ్‌లో జనం ఎక్కువమంది లేరు. అక్కడక్కడ విడివిడిగా కొంతమంది కూచున్నారు ఎదురుగా ఎవరో వొస్తున్నారు, కులాసాగా కబుర్లు చెప్పుకొంటూ. ఎక్కడికో అర్జంటుగా పోతున్నట్టు గాలి రంయిమని వీస్తోంది. ఆ వాతావరణంలో వల్లభరావు తనకు తెలియకుండానే తన జీవితంలో ఓ పది పదిహేనేళ్ళ కాలం తగ్గించేసుకొన్నాడు.

రకరకాల నత్తగుల్లల్ని ఒడ్డుమీద పడేసిపోతున్నాయి అలలు. అవన్నీ పరిశీలిస్తూ పరధ్యానంగా నడుస్తున్న వల్లభరావుని ఓ పెద్ద అల చుట్టుముట్టేసింది. చిరునవ్వుతో అలాగే నుంచున్నాడతను. కాళ్ళక్రింద ఇసుక జారిపోతుంటే తమాషాగా ఉంది. నీళ్లు వెనక్కి పోతూ అతనికో బహుమానం ఇచ్చాయి. ముచ్చటపడి చేతిలోకి తీసుకొన్నాడు. చిన్న శంఖం. తెల్లగా మెరుస్తోంది. అక్కడక్కడ నల్లటిమచ్చలు అందంగా ఉన్నాయి.

ముందుకు సాగి ప్రక్కకి చూశాడు వల్లభరావు. ఎవరో చిన్న కుర్రాడు తన చేతిలోని శంఖంవైపు చూస్తూ నుంచున్నాడు. కొంచెం దూరంలో వాళ్ళమ్మ కాబోలు

కూచుని సముద్రంవైపు చూస్తోంది. వల్లభరావు దగ్గరగా వొచ్చాడు. ఆ కుర్రవాడు అతనివైపు కళ్ళెత్తి చూచాడు. మిలమిలా మెరిసే ఆ కళ్ళని చూసి ముచ్చటపడ్డాడు వల్లభరావు. ఆ రేళ్ళకంటే ఉండవేమో. ఎంతో బావున్నాడు. వల్లభరావుకి ఆ కుర్రా డేం చేస్తాడో చూడా లనిపించింది. ఇప్పుడే ఆ శంఖం కావాలని వాళ్ళమ్మతో మారాం చేస్తాడు. ఆ మారాం చూడా లనిపించిం దతనికి. కాని అలాంటిపనే మీ వాడు చేయలేదు. అలాగే శంఖంవైపూ, వల్లభరావు వైపూ చూడసాగాడు. వల్లభరావుకి జాలివేసింది. హృదయంలో ఏదో అనురాగంలాంటి భావం మెరిసింది. దగ్గిరగా వెళ్ళి శంఖం వాడిచేతి కందించాడు. కొంచెంసేపు బెరుకుగా వల్లభరావువైపు చూశాడు వాడు.

'ఫరవా లేదులే, తీసుకో.'

ఈ మాటలకి ఆమె తల ప్రక్కకి తిప్పి వల్లభరావు వైపు చూసింది. కాని అత నామెవైపు చూడలేదు. ఆకుర్రా డు శంఖం తీసుకొన్నాడు. అటూఇటూ తిప్పి చూడసాగాడు.

'నీ పేరేమిటోయ్!'

వాడు తలెత్తి వల్లభరావువైపు చూశాడు. ఏదో చెప్పాలని కాబోలు పెదవులు ప్రయత్నించాయి. కాని వల్లభరావుకి ఏ సమాధానము వినిపించలేదు. ఆ కుర్రాడిమీద మరికొంచెం ఆదరం కలిగిం దతనికి. తను కొత్తవాడామె!

కొంచెం బుజ్జగిస్తూ అన్నాడు.

'చెప్పు, బాబూ!,

వాడు మళ్ళీ పెదవులు కదలించాడు. ముఖంలో ఏదో బాధ ప్రస్ఫుటమైంది. కళ్ళలో ఏదో దీనత్వం గోచరించింది.

'చెప్పలేడు–'

వేదనాభరితమైన ఆ స్వరం వల్లభరావు హృదయంలో ఇంతవరకూ మృదు మధు సంగీతం వినిపిస్తున్న తంత్రుల్ని నిర్దయగా తెగ్గొట్టింది. ఆమెవైపు మొదటిసారిగా రెప్ప వాల్చకుండా చూశాడు. మూర్తీభవించిన నిరాశలా, నిస్పృహలా, అచేతనంగా ఆమె తల దించుకొని అలాగే కూచుని ఉంది. ఆమె మనసులో తుఫాను రేగిందని తెలుసుకోటానికి ఎంతో సేపు పట్టలేదు అతనికి. జాలిగా చూశాడు. వెంటనే అతనికి మరో విషయం స్ఫురించింది. ఆమె వితంతువు అతని హృదయం గతుక్కుమంది. ఆమెకు వెంటనే మరోసంగతి ... బాధాకరమైన మరో కొత్త విషయం తెలిసింది—ఆమె కట్టుకున్న తెల్లటి చీరకి అక్కడక్కడ అతుకులు స్పష్టంగా కనిపిస్తున్నాయి. ఇహ ఆమెకేం మిగిలింది. అతని హృదయంలో చెయ్యిపెట్టి కలచినట్టయింది. ఆ చుట్టుప్రక్కల ఆవరించి ఉన్న ఆనందమయ వాతావరణంలో ఆమె కేమీ సంబంధం లేదు. ఓ నిట్టూర్పు విడిచాడు వల్లభరావు. చూపులు ఆపసివాడిమీదికి మరలించాడు. మూగజీవి!

అతని హృదయంలో కరుణ కట్టలు త్రెంచుకొని ప్రవహిస్తోంది. ఆ ఇద్దరు అభాగ్యులవైపూ జాలిగా, సానుభూతితో

చూస్తూ ఉండిపోయాడు. అక్కడినించి కదలిపోటానికి అతనికి మనస్కరించటంలేదు. నిమిషాలు ఒకటివెంట ఒకటి గడిచి పోయాయి.

'ఎవరైనా చూస్తే బాగుండదు...'

ఆ హీనస్వరం అతన్ని మేల్కొలిపింది. వెంటనే చిన్న బుచ్చుకొన్నాడు. తను చేసింది పొరపాటే. ఇందాక వెళ్లిపోవాలిసింది. కాని...

వల్లభరావు ఆ పసివాడివైపు మరోసారి జాలిగాచూసి నెమ్మదిగా అడుగు ముందుకేశాడు. అతని మనసులో ఆలోచనల దుమారం రేగింది. అంత చక్కటి కుర్రాడికి ఈ లోపమేమిటి! వాడి చూపులు జ్ఞాపకం వొచ్చాయి. ఆ అమాయిక జీవి భావాలన్నీ అలాగే లోలోపల అణగిపోవాలి తన ఉద్రేకాలు, భావాలు మాటల్లో వెలిబుచ్చలేడు. మనసులోనే ఆపుకోవాలి. వల్లభరావు ముఖంలో విషాదం ఆవరించింది. ఏ పెద్ద హాస్పిటల్‌లోనైనా చూపిస్తే ప్రయోజనముంటుందేమో! చూపించారో, లేదో! చూపించటానికి డబ్బెక్కడినించి వస్తుంది? ఆమెను చూస్తే పరిస్థితంతా అర్థమైపోతుంది. ఎలా మరి? తనేమైనా సహాయం చేస్తే! ఏం సహాయం? ఏవిధంగా చేయటం? హుఁ—తనకి ఇతరులకు సహాయం చెయ్యగల పటిమ ఎక్కడుంది? తనేమైనా ధనవంతుడా? పరపతి కలవాడా? ఒక సామాన్య మానవుడు. ఏమి చెయ్యలేని సామాన్య మానవుడు. కాని...కాని.....ఏమైనా చెయ్యాలి.

వల్లభరావు మనసంతా పాడయిపోయింది. కాళ్ళీడ్చుకు పోయినంతవరకూ పోయాడు. చీకటి పడ్డది. అస్పష్టంగా వెన్నెల పడుతోంది. వెనక్కి తిరిగాడు అవే ఆలోచనలు.

అలా ఆలోచిస్తూ నడుస్తున్న వల్లభరావుకి వెన్నెల్లో మెరుస్తూ కనిపించింది—అదే. ఆ శంఖమే. తెల్లగా నల్లటి మచ్చలతో అందంగా, కనిపించే ఆ శంఖమే. వల్లభరావు శంఖం చేతిలోకి తీసుకొన్నాడు. నిస్సందేహంగా ఆ శంఖమే. ఇక్కడెందుకుంది? మర్చిపోయి వెళ్ళారా? అతను ముందుకి చూశాడు. కొంచెం దూరంలో కనిపించాయి ఆకృతులు—తెల్లటి చీరతో నెమ్మదిగా నడుస్తున్న స్త్రీ—ప్రక్కన చిన్న కుర్రాడు. వాళ్ళే—అనుమానం లేదు. అయితే ఈ శంఖం ఇక్కడే ఎందుకు పడేసి వెళ్ళిపోయారు? మర్చిపోయారా? మర్చిపోటానికి అదేమీ కనిపించనంత చిన్నది కాదు. కావాలనే బుద్ధిపూర్వకంగా ఆమె వొదిలేసి వెళ్ళిపోయింది. ఎందుకు? ఇష్టం లేదా తీసుకోటం? వెంటనే అతని కామె మాటలు జ్ఞాపకం వొచ్చాయి.

'ఎవరైనా చూస్తే బావుండదు.—'

ఇందాక ఆ మాటల్ని గురించి తను ఎక్కువగా ఆలోచించలేదు. ఆమె అలా ఎందుకంది? ఎవరైనా చూస్తే ఏమనుకుంటారు? ఆమె అలా ఎందు కనుకోవాలి? తనని అపార్థము చేసుకొందా? మనసులో తను భయపడకపోతే అసలలా అనగలిగి ఉండేది కాదు. అవును. ఆమె తనని అపార్థం చేసుకొంది. తనపరిచయంకోసం అలాచేశాడని అనుకొందా?

మనుష్యులు ఇంత త్వరగా ఎందుకు ఇతరులను గురించి అపోహ పడతారు? అంత అనాలోచితంగా ఎందుకు ప్రవర్తిస్తారు?

వల్లభరావుకి ఓ క్షణం ఏహ్యాభావం కలిగింది ఆమె మీద. కాని మళ్ళీ ఆలోచించాడు. తను అనవసరంగా ఆమెను గురించి అపోహ పడుతున్నాడేమో! అదే క్షణాన అతనికి తట్టింది అకస్మాత్తుగా. ఆమెను ఏ విషయంలో ఆక్షేపించటానికి ప్రయత్నించాడో, అదే విషయంలో తనని తను ఆక్షేపించుకున్నట్టయింది.

వల్లభరావు వెంటనే సమాధానం చెప్పుకున్నాడు. తనని గురించి తను వేసుకొన్న ప్రశ్న సమంజసంగా లేదు. ఆ కుర్రాడు ముచ్చటపడితే ఆ శంఖం ఇచ్చాడు. ఆమె తొందర పడివుండకపోతే, బహుశః తను ఆమెకేమైనా సహాయం చేయగల్గి ఉండేవాడేమో! కాని అలాంటి వాళ్ళకి సహాయం చెయ్యాలని ముందుకు దూకితే మిగిలేది శ్రమమాత్రమే. ఇతరులు చేసిన ప్రతిపనికి మరో దృక్పథంలోనుంచి అపార్థం చేసుకొంటే ఎవరూ ఏమీ చెయ్యలేరు. తన సహాయం ఏమీ ఆమె కక్కర్లేదు. మంచిది.

ఆ సమయంలో వల్లభరావుకి చిరుకోపం వచ్చింది. చిరాకు పుట్టింది. ఆ శంఖం ఆవాళ మనసంతా పాడుచేసింది. ఛీ! మొదట ముచ్చటపడ్డాడు కాని, చివరకి దానివలన జరిగింది ఇది. అతనికి కొంచెం ఆవేశం కలిగింది. బలంకొద్దీ సముద్రంలోకి విసిరేశాడు శంఖం. అతని మనసు కొంచెం తేలికపడ్డది.

మళ్ళీ తను సాయంత్రం పొందిన ప్రశాంతత వొచ్చే సూచన కనిపించింది. సముద్రం వైపు అలాగే చూస్తూ నుంచున్నాడు. వెన్నెలలో సముద్రం పొంగుతూ కొత్త సౌందర్యం ప్రకటిస్తోంది.

కాసు అతి నా అవస్థలో ఎక్కడ ప్రసేవు ఉండ లేక పోయాడు. ఆ పసివాడూ, ఆమె మళ్ళీ అతని స్మృతిపథంలో మెదిలారు. తన కెటువంటి దురుద్దేశమూ లేదని ఆమెకి తెలసేటట్టు చెయ్యాలి. ఆమె పశ్చాత్తాపపడుతుంది. వెంటనే వల్లభరావు చకచక నడిచిపోయాడు. వాళ్ళని నిర్లక్ష్యంగా దాటిపోయాడు.

అలా దాటిపోయిన వల్లభరావుకి ఆమె ఏంచేస్తోందో చూడాలని బుద్ధిపుట్టింది. తన వెనుక వొస్తోందా? ఓరగా చూశాడు. ఆమె కనిపించ లేదు. ఆ సముద్రపు హోరు అలికిడికూడా వినిపించ లేదు. వెనక్కి తిరిగాడు. ఆమె తనవైపు నడవటం లేదు! ఆశ్చర్యం వేసింది అతనికి. ఆమె వెనక్కి వెడుతుందేం? ఓ క్షణం అతని మతిపోయింది! ఆమె ఏమిటో వెతుకుతోంది. కొంపతీసి, శంఖంకోసమా? అలాగేవుంది. అయితే ఆమె నిజంగానే మర్చిపోయిందా? తననిచూసి జ్ఞాపకం తెచ్చుకుంది కాబోలు.

వల్లభరావులో మళ్ళీ జాలి ప్రవేశించింది. తనకి తెలిసివుండీ, ఆమెనలా వెదకనియ్యటం క్రూరమనిపించింది. గబగబ నడిచాడు ఆమె ఉన్నస్థలం వైపు.

"ఏమిటి వెతుకుతున్నారు?"

ఆమె ఉలిక్కిపడ్డది. తలెత్తి అతనివైపు చూసింది. ఆమె ముఖంలోని విస్మయం ఆ అస్పష్ట కాంతిలోకూడా స్పష్టంగా కనిపించిం దతనికి. ఆమె జవాబుకోసం ఎదురు చూడకుండా అతనే అన్నాడు మళ్ళీ.

"శంఖంకోసమేనా?'

ఓ క్షణం ఆమె ఏమీ అనలేదు. కాని వెంటనే తేరు కుని ఏదో అర్థం చేసుకొన్నట్టుగా అతనివైపు చూసి తలతిప్పి అంది—'కాదు!'

'మరి దేనికోసం?'

ఆమె సమాధానం ఏమీ యివ్వలేదు. ఆమె తటపటాయించటం చూసి వల్లభరావు తను అక్కడికి మళ్ళీ రావటము, ఆమెని ప్రశ్నించటము పొరపాటని ఓ క్షణం చింతించాడు.

'ఏదైనా వస్తువు పోయిందా?' అడక్కూడదని అనుకుంటూనే అడిగాడు. ఆమె అవు నన్నట్టు తల తిప్పింది.

'ఏమిటి?'

ఆమె సందిగ్ధావస్థలో పడ్డది. ఈసారి వల్లభరావుకీ పూర్తిగా తెలిసిపోయింది. ఆమె తననించి ఏదో దాస్తోంది దాచాలనే ఆమె ప్రయత్నం; కొన్ని క్షణాలు అలాగే గడిచి పోయాయి. ఆమె కుర్రవాడిని దగ్గిరగా తీసుకొని ముందుకు

రెండడుగులు వేసింది. వల్లభరావుకి కొంచెం చిరాకూ, కోపమూ కలిగాయి. అసలుసంగతి అతనికి తెలిసింది. తనిచ్చిన ఆ శంఖం అలా అక్కడ వొదిలేసి మళ్ళీ తను వెళ్ళిపోగానే ఇలా ప్రవర్తించటం కేవలం సంకుచితంగా కనిపించక తప్పదు. ఇలాంటి చిన్న విషయాలలోకూడ మనుషు లిలా ఎందుకు ప్రవర్తిస్తారు?

'మీరు వెదికేది శంఖంకోసమే అయితే, అది మళ్ళీ సముద్రంలోకి విసిరేశానని చెప్పటానికి చింతిస్తున్నాను.' కొంచెం తీవ్రంగా, అసహనంగా అన్నాడు.

ఆమె ఏమీ జవాబివ్వలేదు. అలాగే వెళ్ళిపోతోంది. ఆమె మౌనం అతనికి కొంచెం ఆశ్చర్యం కలిగించింది. మాట్లాడితేనే నోటి ముత్యాలు రాలేట్టు ప్రవర్తిస్తోం దామె, తనదారిని తను పోదామని ఓ క్షణం అనుకొన్నాడు. కాని ఆమెని మాట్లాడించాలనే పట్టుదల అకస్మాత్తుగా కలిగిం దతనికి.

"మీ రిలా ఎందుకు ప్రవర్తిస్తున్నారో నా కర్థం కావటంలేదు."

ఆమె ఆగింది.

'ఏం చేశాను?' నెమ్మదిగా అంది.

"శంఖంకోసం వెతకటం కాదన్నారు. కాని శంఖం పారేశా ననగానే వెళ్ళిపోతున్నారు. అసలు సంగతి నా దగ్గిర దాచటమెందుకు? నేను మీకేమీ అపకారం తలపెట్టే దురుద్దేశంతో లేనని గ్రహిస్తే బావుండును."

ఆమె ఇలాంటిప్రశ్న ఎదుర్కొనే స్థితిలో లేదు, ఇంత

కుండ బద్దలుకొట్టినట్టుగా అతను మాట్లాడుతాడని అనుకో లేదు. మాట్లాడకుండా అలాగే నుంచుంది.

'మీరు సమాధానం చెప్పగలిగితే చెప్పండి. ఇష్టం లేకపోతే వెళ్ళండి. కాని, ఈ సమాధానంకోసం రాత్రిం బగళ్ళు ఒక ప్రాణి తల బద్దలుకొట్టుకునే పరిస్థితి తప్పించ తలుచుకుంటే ఉన్నది ఉన్నట్టు చెబితే సంతోషం. జీవితంలో మళ్ళీ యిలాంటి సమస్యలు రాకుండా చేసుకొంటాను.'

ఆమె నిట్టూర్పు విడిచింది.

'పొరపాటు చేశాను. మీరిలా మళ్ళీ వస్తా రనుకో లేదు.' అని మాత్రం అని ఊరుకుంది.

'అయితే ఆ శంఖం బుద్ధిపూర్వకంగానే అలా ఒది లేశా రన్నమాట.'

'అవును.'

'ఎందుకు?'

'ఈ ప్రశ్నకి సమాధానం చెప్పాలిసి ఉంటుం దనుకో లేదు. అలా అనుకొంటే అలా చెయ్యకపోయే ఉందును. కాని, మీరు నిర్బంధిస్తున్నారు కనుక చెప్పక తప్పలేదు. కేవలం మీ కోసమే అలా చేశాను.'

— వల్లభరావు తెల్లబోయాడు. అనుకోని పరిణామం ఎదురౌతోంది.

'నాకోసమే.'

'అవును. చిట్టిబాబు మాట్లాడలేడని తెలుసుకున్న ప్పుడు మీ మనస్సు చివుక్కుమనటం నేను గ్రహించాను. ఆ బాధ నాకంటే ఎవరికి తెలుస్తుంది? నిరంతరం ఇది మీ

మనస్సులో ముల్లులా మెదుల్తుందని ఆ క్షణంలో మిమ్మల్ని చూసిన ప్రతివాళ్ళూ గ్రహించగలరు. చాలామంది అలాగే బాధపడ్డారు. కాని తరువాత ఎక్కువకాలం వాళ్ళ నా విష యము బాధించలేదు. కాని మీరు బాగా దెబ్బతిన్నారు. ప్రశాంతంగా ఉన్న మనసుకి అకస్మాత్తుగా గట్టి దెబ్బ తగి లింది. ఏమీ మాట్లాడలేక పోయారు. ఏమీ తోచక మిమ్ము లను మీరే మర్చిపోయాడు. అందుకే అలా హెచ్చరించాను. ముమ్ముందు మానసికంగా చాలా బాధపడతారని భయప డ్డాను. ఏం చేయగలను? మనుష్యులు కొన్ని విషయాలలో పూర్తిగా నిస్సహాయులు. ఎంతోసేపు ఆలోచించాను. మళ్ళీ మీరు తిరిగొస్తే బావుండు ననుకొన్నాను. అలాగేవొచ్చారు. దూరంగా చూశాను. ఆ శంఖం అలా వదిలి వెళ్ళిపో యారు.'

ఆమె ఆగింది. వల్లభరావులో పూర్వపు కాఠిన్యం మంచులా కరిగిపోయింది. ఆమె మళ్లీ చెప్పటం ప్రారంభిస్తుం దని కాసేపు ఎదురు చూశాడు. తరవాత నెమ్మదిగా అందు కొన్నాడు.

"ఎందుకు?"

'ఆ శంఖం అలా పడివుండటం చూస్తే మీరు మూడు పనులు చెయ్యవచ్చు. నా చేతికివ్వటమో లేక అలా దాన్ని వొదిలేసి వెళ్ళటమో లేకపోతే సముద్రంలోకి విసిరి పారె య్యటమో. మూడోపని చేస్తే నా ప్రయత్నం సఫల మైనట్టే.'

వల్లభరావు విస్తుపోయాడు. ఆమెమీద అతని కా క్షణంలో ఎంతో గౌరవం కలిగింది. సరిగా ఆమె అనుకొన్న

ట్టుగానే తను ప్రవర్తించాడు. కాని అతనికో సందేహం కలిగింది.

'అలా ప్రవర్తిస్తే లాభం?'

"వాడి కేదైనా సహాయం చెయ్యగలిగితేగాని మీకు మనసుకి శాంతి ఉండదు. కాని ఏం చెయ్యగలరు? అదిమీకు తలకుమించిన విషయం. ఊరికే మథనపడటం తప్ప జరిగే దేమీ ఉండదు. అశాంతి పొందుతున్న మనసు అది తప్పించుకోటానికి ఎంత చిన్న అవకాశం దొరికినా ఉపయోగించుకొంటుంది.

వల్లభరావు కీ విషయం పూర్తిగా బోధపడ్డది. ఆమె ఇంకేదో చెప్పబోతోంది. వల్లభరావు సిగ్గుపడ్డాడు. తలవంచుకొని అన్నాడు. "ఇహ చెప్పక్కర్లేదులెండి, తెలిసింది."

ఆమె ఇంకేమీ అనలేదు. అతనూ ఏమీ అనలేదు. కొద్ది క్షణాలు అలాగే గడిచిపోయాయి. ఎవరి మనసులో ఏ ఆలోచనలు మెదులుతున్నాయో ఇద్దరికీ తెలుసు.

వెన్నెల స్పష్టమౌతోంది క్రమంగా. ఆమె శెలవు తీసుకొంది. దూరమైపోతున్న ఆ ఆకృతులవైపు చూస్తూ అక్కడే నిలబడిపోయాడు వల్లభరావు, హృదయంలోని బరువుతో.

ఆ పసివాడితోసహా ఆమె అదృశ్యమైంది. వల్లభరావు సముద్రంవైపు చూశాడు. వెన్నెలలో సముద్రం పొంగిపోతోంది. ఓ పెద్ద అల...అతని సమీపంలో నల్లటి మచ్చలుగల తెల్లటి శంఖం. ఆ అపురూప శంఖం వెన్నెలలో మెరిసింది. అతను సముద్రంవైపు రెండడుగులు వేశాడు. కాని మళ్లీ ఆగిపోయాడు. మరి కొంచెంసేపటిలో ఆ శంఖం క్రమక్రమంగా నీళ్ళలోకి జారిపోయింది.

# శ్రీ భాస్కరభట్ల కృష్ణారావు

కృష్ణారావుగారు 1918 లో హైదరాబాదు జిల్లాలో జన్మించారు. కలకత్తా, ఉస్మానియా విశ్వవిద్యాలయాల్లో విద్య నభ్యసించి 1940 లో బి. యస్. సి. ఎల్. ఎల్. బి. అయ్యారు. 1945 నుంచి కథలు వ్రాస్తున్నారు. ఇప్పటికి దాదాపు నూరు కథలు వ్రాశారు. "కృష్ణారావు కథలు" అనే పేరుతో ఒక కథల సంపుటి వెలువడింది. వీరి "చంద్రలోకానికి ప్రయాణం" అన్నది పిల్లలకు సంబంధించిన కథల పుస్తకం. యుగసంధి, వింత ప్రణయం, వెల్లువలో పూచికపుల్లలు ఇవి మూడు నవలలు. యుగసంధి, 1922 – 1948నడిమి కాలపు తెలంగాణా సామాజికరాజకీయ జీవితాన్ని ప్రతిబింబించే నవల. వెల్లువలో పూచికపుల్లలు అస్తిత్వ వాదంపై ఆధారపడిన నవల.

కృష్ణారావుగారు ఆంధ్ర సారస్వత పరిషత్తు స్థాపకులలో ఒకరు. చాలాకాలంనుంచి హైదరాబాదు ఆకాశవాణిలో ప్రోగ్రాం ఎగ్జిక్యూటీవ్ గా పని చేస్తున్నారు.



# కథ

సహాయ్ అనే అతన్ని ఒక భూతంగానూ, ఒక వార్తగానూ మనం ఈకథలో చూస్తాము. అతని వార్ధక్యదేహాన్ని ఆలంబన చేసుకొని అతనిరూపచిత్రణ జరుగుతుంది. సహాయ్‌కు ఇంగ్లీషు తప్పితే ఏమీరాదు. పాతపత్రికలు చదువుతాడు. బీరు త్రాగుతాడు. ఇవి అతని విక్షిప్తవార్తలే అయినా వీటిమాటున గుప్తంగా ఉన్న సహాయ్ జీవితాభాస ఎంతో మనకు పొడగడుతుంది. నిజంగా చూస్తే మనుష్యుడు జీవితంకోసం బ్రతకడంలేదు. జీవితాభాస కోసం బ్రతుకుతున్నాడు. జీవితాభాస జీవితంకంటే ప్రబలమైంది. సహాయ్ జీవితం ఏదో జరిగిన ఒక దుర్ఘటనకు స్మృతిశేషమైన జీవితంలాంటిది. అలాంటి స్మృతిశేషజీవితాలను గడిపేవాళ్లు ఈ ప్రపంచంలో ఎందరు లేరు! ఈకథ, ఆరంభంలో మనకొక పొగమంచులాంటి రూపం ఇస్తుంది. ఆపొగమంచులోంచి నెమ్మదిగా సహాయ్, అతని కాలు చేతులు, నాలుక, అలవాట్లు కదులుతూ ఉంటాయి. ఇంతమాత్రంగ బొమ్మ కొరకు ఆబొమ్మ చనిపోయిన తరువాత మిత్రులు ఖాళీగ్లాసును పానీయంతో నింపి ఆకారంగా ఉంచుతారు. ఈ పంక్తి చదివినప్పుడు మన హృదయం ఒక్క క్షణం మౌనమౌతుంది.

స్వప్న కథనంలో వాచ్యం కొంత అధికమైనా సహాయ్ అనే వాని ఛాయాదేహాన్ని అతని అతీత వ్యక్తిత్వాన్ని చిత్రించడంలో ఈకథ విజయాన్ని సాధించింది. కృష్ణారావుగారి కథా పరికల్పన, సామగ్రి అనుపమమైంది. దాన్ని ఈకథలో వారు చక్కగా సంపుటీకరించారుకూడా.

ఇది బింబప్రధానమైన కథ



# వింత ఆకృతి

నీకేమి అపకారం చేశాను?...నన్నెందుకు వేధించుకు తింటావు?—అగాధంలోంచి ఒక బొంగురుగొంతు అనిష్టంగా పైకి ఉబికింది. కారుచీకట్లు నల్లత్రాచులకుమల్లే ఆ అగాధంలో సుళ్ళుతిరిగి, ఏదో అస్పష్టమైన ఆకారాన్ని దాల్చుతున్నాయి.

ఏవో దుస్తులు, శూన్యంలో, గిరగిర తిరిగి, ప్రాణం పోసుకోడానికి ప్రయత్నిస్తున్నాయి. నిజస్వరూపాన్ని దాల్చడానికి యమయాతన పడుతున్నాయి. కదలికతో చూపుల్ని చెదరగొడుతున్నాయి. త్రుటి కాలానికి చలనం క్రమంగా స్తంభించింది. వెడల్పాటి గీతల బుష్‌షర్టు, ప్యాంటు,...నైలు సూటు,...నిలువునా మానవాకృతిలో కన్నెదుట నిలిచాయి. మొహమూ, ముంజేతులూ, పాదాలూ కనబడటంలేదు. నిదానించి చూచాను. కాని లాభం లేకపోయింది. అంధకారంలో విలీనం కాలేదుకదా? ఏమో?...

వదనరహితమైన ఆ వింత ఆకృతిని చూసి, శరీరం గడ్డకట్టుకు పోయింది. ఆపాదమస్తకం కంపించిపోతూ 'ఎవరు' అని భయంకొద్దీ గట్టిగా అరిచాను...

'నేను ప్రపంచానికి దూరంగా, అపరిచితంగా ఉండ దలచాను. నాపై యితరులు ఆసక్తి చూపితే నేను భరించ

లేను. నా మానాన్ని నన్ను బ్రతకనిస్తే ఎంతో సంతోషిస్తాను.'

ఒక్కొక్కటే మాట బరువుగా అగాధంలోంచి పైకి పెకిలింది. ఆ వింత ఆకృతి వింతధోరణి నన్ను మరీ భయ విహ్వాలుడిని చేసింది. నిర్లక్ష్యంతో వదనరహితమైన చీకటి నవ్వు నవ్వింది.

అగాధంలోని చీకటి పాములు అమాంతంగా నన్ను ముసురుకున్నాయి.

శరీరంపైన పాకుతూ చీకటినాలుకలతో నన్ను తడుము తున్నాయి. హృదయాన్నీ, ఆత్మనీ చుట్టివేస్తున్నాయి.

కొందరికి క్రాస్‌రోడ్డుకుమల్లే హడావిడిగా తమ జీవితాల్ని గడపడమంటే ఏమాత్రంయిష్టముండదు. ఆవేశాల్నీ, ఉద్రేకాల్నీ అణచుకొని ప్రశాంతంగా ఏకాంతంలో నివసించాలని ఉంటుంది.'

పిస్టల్‌గుండ్లకిమల్లే ఒక్కొక్కమాటే నా హృదయంలోకి దూసుకుపోతున్నది. ఎందుకో, 'ఇతను 'సహాయ్' కాదుగదా?' అనే స్ఫురణ అదటుపాటున కలిగింది.

'ఇంతకీ మీ రెవరు?' మొండి ధైర్యాన్ని చిక్కబట్టుకొని, తిరిగి గట్టిగా అరిచాను.

'నే నెవరైతే మీకెందుకు? పరిచయాలూ, స్నేహితులూ, ఆపేక్షలూ, ప్రేమలు అనవసరంగా కల్పించుకొని లంపటంలో పడి, జీవితాన్ని దుఃఖభాజనం చేసుకోవద్దని చెప్ప

డానికి వచ్చాను.' చీకటి నూతిలోంచి బొంగురుధ్వని మాట ప్రయోగించింది.

ఎందుకో ఆ వింత ఆకృతి వింతహృదయం, జీవితంలో బలంగా దెబ్బతిన్నట్లు తోచింది. ఆ వింతధోరణి, ఆ వింత ఆకృతిని అమాంతంగా పట్టియిచ్చింది

సందేహం లేదు. అతను ముమ్మాటికీ సహాయే—

'మీరు 'సహాయ్' కాదుగదా?' తరతరాల ధైర్యాన్ని కూడదీసుకొని ప్రశ్నించాను.

'అయితే కావచ్చు, కాని కాదనుకోవడమే చాలా మంచిది.' ఎందుకో ఈసారి ఆ కంఠధ్వని తేలికగా తోచింది. జవసత్వా లుడిగిన మనిషి మాట్లాడుతున్న ట్లనిపించింది.

'మీరు నిజంగానే 'సహాయ్' అయితే నేటికి నా పుణ్యం ఫలించినట్టే' మొక్కబోయిన తీర్థం ఎదురు పడినట్లని పించి, వెదక దలచిన పెన్నిధి కాలికి తాకినట్లు తోచి, హృద యం ఎగిరి గంతులు వేసింది.

'ఎందువల్ల?'

ఆ చీకటి గొంతు చీకటి ప్రశ్న నన్ను త్రుటికాలం వరకు యిబ్బందిపెట్టింది

'మీరు ప్రపంచంతో ఏ సంబంధం లేకుండా, బ్రత కడం నన్ను మొదట ఆకర్షించింది. ఆ తరువాత మిమ్మల్ని గూర్చి స్నేహితులద్వారా ఎన్నో విషయాలు తెలుసుకు న్నాను. ఒక్కొక్క విషయమే తెలుసుకున్నకొద్దీ మిమ్మల్ని

కలుసుకోవాలనీ, మీా స్నేహం సంపాదించాలనీ మనస్సు ఉవ్విళ్ళూరింది'.

'ప్రపంచంలో ఎందరో వ్యక్తులు నిర్లిప్తంగా జీవితంలో ఏ ఆసక్తి లేకుండా బ్రతుకు నీడుస్తున్నారు. వారందరినీ తెలుసుకొని, వారందరి స్నేహం సంపాదించడం నీకు సాధ్యమవుతుందా?'

'సాధ్యం కాకపోవచ్చు ... కాని దగ్గరలో ఉన్నవారిని మాత్రం, స్నేహం చేసుకోవడం సాధ్యమేనని నా ఉద్దేశం'

'ఆ నిర్లిప్త జీవితానికి, నీవు ఒక అడ్డంకి అని, వారు భావిస్తే?'

ఆ బొంగురు ప్రశ్నకి ఎంత ఆలోచించినా ఏమీా సమాధానం దొరకలేదు.

'ఆశానిరాశలు, సుఖదుఃఖాలు, నిమ్నోన్నతాలు, ఈ ద్వంద్వాలన్నింటికీ అతీతంగా నిలిచి, మీారు జీవితాన్ని ఎట్లా గడపగలుగుతున్నారో ఆలోచిస్తే ఎంతో ఆశ్చర్యమేస్తుంది.'

'ఈ రహస్యాన్ని కనుక్కోవడం కోసమేనా, మీారు స్నేహాన్ని అభిలషించింది?'

'అభిరుచులు ఏకమైనప్పుడేకదూ, మనం ఒక వ్యక్తి స్నేహాన్ని కోరేది?'

'అభిరుచులపైన ఆధారపడే స్నేహాలు, ఎక్కువకాలం నిలువలేవు — అభిరుచులు భిన్నం కావడంతోనే, ప్రాణస్నేహితులు కూడా విడిపోవడం తథ్యం.'

'అయితే, చిరకాలం మనకలిగే మిత్రత్వానికి, పునాది ఏదై వుండాలంటారు?'

'మేధస్సు పునాదిగా ఉండాలని నేను అంటాను— మేధస్సుద్వారా ఏర్పడే స్నేహాలు కలకాలం నిలువగలుగుతాయని నా ఉద్దేశం.'

వింత ఆకృతి, వింతభావాలు నన్ను ఉక్కిరి బిక్కిరి చేసాయి.

'ఒక వ్యక్తి వింత ప్రకృతి, ఇంకొక వ్యక్తికి నచ్చుతుంది. అప్పుడు ఆ ఒకరి స్నేహాన్ని ఇంకొకరు అభిలషించడం, ఆ స్నేహంకోసం ఆందోళన చెందడం, అతి సహజమనే నా ఉద్దేశం.'

'కాని, ఆ ఆందోళన, ఆ వింతవ్యక్తి హృదయంలో ప్రతిధ్వనించకపోతే?'

'నిజమే, ప్రతిధ్వనించకపోతే ఏమవుతుంది? ఆ ఇంకొక వ్యక్తి జీవితం దుఃఖభాజనం అవుతుంది—అంతే.

ఎందుకో ఆ పరిస్థితి నాకు భయంకరంగా తోచింది.

'నాకు పరిచయాలు, స్నేహితాలు, సానుభూతులపైన ఏమాత్రం నమ్మకంలేదు. ఆశయాలు, ఆదర్శాలంటే నాకు ఏమాత్రం గిట్టవు. ప్రవాహంలో పూచికపుల్లకుమల్లే ఎటో

కొట్టుకపోతున్నాను. అల్లా కొట్టుకుపోవడమే నా జీవితాశయమని భావించి, తదనుగుణంగా నా జీవితాన్ని మలచుకుంటున్నాను. కాగా, నాకు నచ్చిన పద్ధతిని నేను నడుచుకుంటున్నాను. నేను అనుమతిస్తే తప్ప, నా జీవితంలో ఇంకొకరికి జోక్యంగానీ, ప్రవేశంగాని ఉండకూడదు. నా మానాన్ని నన్ను బ్రతకనిస్తే నాకదే పదివేలు. ఈ ప్రపంచాన్ని అంతకన్నా ఎక్కువ నేనేమీ కోరను.'

ఆ వింత ఆకృతి, వింత హృదయం, ఎంత బలంగా దెబ్బతిన్నదో, కరడు కట్టి శిలగా మారటానికి? ఎన్ని నిట్టూర్పులు, ఎన్ని కన్నీటి కాల్వలు, ఎన్ని తుఫానులు, ఎన్ని సముద్ర ఘోషలు, ఆ హృదయంలో ఇంకిపోయాయో, అల్లా పాషాణంగా మారడానికి?

ఆధాటుపాటున చీకట్లు దట్టమైనాయి. చిక్కని చీకట్లు అలలు అలలుగా, కళ్ళ, పాపలకి కొట్టుతున్నాయి. ఆ తాకిడికి తట్టుకోలేక కళ్ళు మూసుకున్నాను.

కొద్దిగా తేరుకొని కళ్ళు తెరిచేసరికి, ఆ వింత ఆకృతి ఎక్కడా కనపడలేదు. దిగ్గున పక్కమీదినుంచి లేచాను. శరీరమే కళ్ళుగా మారి, ఆ వింత ఆకృతికోసం, పడకగదంతా గుండెలదడతో కలయజూచాను. బెడ్‌లాంప్ వేలుతురు వెలవెల బోతున్నది. పడకగదిలోని ఒక్కొక్క వస్తువే చీకటి తెరలని తొలగించుకొని విస్పష్టమైన ఆకారాన్ని చాలుస్తున్నది. గట్టిగా కళ్లు నులుముకున్నాను. అయినా, గదిలో ఎక్కడా సహాయ్ కనపడలేదు.

కల కరగింది. తలవనితలంపుగా, అగాధంలోంచి తీరా నిజ వచ్చిపడ్డాను. గదిలోని గడియారం ఉదయం ఆరుగంటలు కొడుతున్నది.

ఎందుకో వెంటనే సహాయ్‌ని చూడాలని హృదయం మారాంచేసింది. 'నీకూ అతనికీ సంబంధ మేమి' టని మెదడు ఒక పిచ్చిప్రశ్న వేసింది. 'నీకు అర్థంకాదు లెమ్మ' ని హృదయము ఈసడించుకుంది. 'అయితే నీ యిష్టమ'ని మెదడు మౌనం వహించింది.

శరీరం కదిలింది. వేగంగా కాలకృత్యాలు తీర్చుకుంది. ఉదయము టీ అయినా తీసుకోకుండా ఇంట్లోనించి బయల్దేరింది. కాళ్ళు ఉద్వేగంగా ముందుకు సాగుతున్నాయి. అవయవాల కదలికకు, మెదడు చురుకుగా పనిచేయడం మొదలుపెట్టింది.

సహాయ్‌ని గూర్చి పూర్వం మిత్రులు చెప్పిన సంగతులన్నిటినీ, ఒక్కొక్కటిగా నెమరువేయడం ఆరంభించింది.

ఒక్కొక్క స్మృతి, హృదయాన్ని ఒక్కొక్క ఊపు ఊపింది

"సహాయ్, ఇండియన్ ఎయిర్‌లైన్స్‌లో ఒక పైలట్."

"తాజ్‌మహల్ హోటల్‌లోని ఒక గదిలో అతని నివాసము"

'పెళ్ళి కాలేదు'

'బంధువులుకాని, స్నేహితులుకాని ఎవ్వరూ ఉన్నట్లు కనపడదు.'

'అతనికి అందరూ పరిచయస్తులే ఆ అంతస్తునిదాటి ఎవ్వారూ స్నేహితులు కాలేదు."

"సికిందరాబాదుకి ఒంటరిగా వచ్చాడు. ఒంటరి జీవితాన్ని గడుపుతున్నాడు."

"ఎక్కడ పుట్టాడో ఎక్కడ పెరిగాడో, ఎక్కడ విద్యాభ్యసించాడో ఎవ్వరికీ తెలియదు."

"ఎప్పుడూ ఇంగ్లీషుమాట్లాడుతాడు. నిమిషానికి ఒకమాట చొప్పున, నోటమాట పెగులుతుంది."

సహాయ్‌కి ఏయితర భాషలుగాని వచ్చినట్లు కనబడదు. అతని మాతృభాష ఏమిటో ఎవ్వరికీ తెలియదు."

"సర్వస్త్రు, చివరికి పనిమనుషులతో కూడా ఇంగ్లీషులోనే మాట్లాడుతాడు. వాళ్లు తమతమ మాతృభాషల్లోనే జవాబులు చెబితే బిత్తర చూపులు చూస్తాడు."

ఇంగ్లీషుతో పనిగడవనప్పుడు సంజ్ఞలతో వెళ్ళడిస్తాడు."

"ఒకటవ తేదీన జీతం రావడంతోనే మొదట భోజనం కూపన్లు కొంటాడు. హోటల్ రూమ్ బాడుగ చెల్లిస్తాడు. చాకలి మంగలి ఖర్చుపోను, మిగిలిన జీతం పదవ తేదీకల్లా, బీర్ తాగి వ్యయపరుస్తాడు."

"ఆ తరువాత హోటల్ గదినించి ఎక్కడకీ కదలడు. పరిచయస్తుల్ని కలుసుకోడు."

"రూపాయికి శేరు చొప్పున పాత ఇంగ్లీషు దినపత్రికలూ, మాస, వారపత్రికలూ కొంటాడు. డ్యూటీకి వెళ్లిన

స్తూడు తప్ప. మిగిలిన కాలమంతా ఆపాత పత్రికలతో గడు పుతాడు."

"పత్రికలు ఎప్పటివనే ప్రసక్తే ఉండదు. కొన్ని సంవత్సరాల క్రితం నైనా, అతనికి అభ్యంతరం ఉండదు. ఆపత్రికలన్నింటిని విచక్షణ లేకుండా మొదటి పేజీనుంచి ప్రింటెడ్ అండ్ పబ్లిష్డు వరకు చదివేస్తాడు".

తను లోగడ విన్న సంగతుల్ని బట్టి, మెదడు సహాయ్ రూపకల్పన చేసింది. చివరకు తన ఆరూపకల్పనతో తానే సంతృప్తి పొందలేక పోయింది, వెంటనే దానిని చెరిపివేసింది. ఒక్కొక్క సహాయ్ చోప్పున ఎన్నో మానవా కృతుల్ని సృష్టించుకుంది. ముందుకు సాగుతున్నకొద్దీ ఆ ఆకృతులు శూన్యంలో విలీనం కావడం మొదలెట్టాయి.

కాళ్ళు చురుకుగా ముందుకు అడుగులు వేస్తునే ఉన్నాయి. కొంతకాలానికి ఆసాంతం శరీరమే నడకగా మారింది.

ఇంతలోకే దారిలో రఘు కనబడ్డాడు.

'నీకు సహాయ్ తెలుసు కదూ?"

"ఆc, ఎందుకు?"

"ఎంతో కాలం నించి, నాకుఅతన్ని కలుసుకోవాలని ఉంది, వెడుదాం, వస్తావా?"

"నీకు మతేమైనా పోలేదుకదా?"

'అంటే?"

"అంటే, నీకీ సంగతి తెలియదన్న మాట."

"సంగతేముంది తెలియడానికి?"

"నిన్న నాగపూర్ దగ్గర ఇండియన్ ఏర్ లైన్సు విమానం ఒకటి పడిపోయింది. ఆ క్రాష్‌లాండింగ్‌లో సహాయ్ మరణించాడు."

ఎందుకో రఘుమాటల్ని నిలుచున్న పాటున నమ్మ లేకపోయాను.

"నిజంగానా?" అని నాలోని సందేహాన్ని ధ్వనించాను.

"నా మాటపైన నీకు నమ్మకం లేదా?"

ఎందుకో, అప్పటికి నాకు నమ్మకం కుదర లేదు.

'అబద్ధం – పచ్చిఅబద్ధమ'ని గట్టిగా అరిచాను;

నా అరుపుకి రఘు బిత్తరి పోయాడు.

"నామాటలపైన విశ్వాసం లేకపోతే, ఈరోజు పేపరే నైనా చూడు. నిజం నీకే తెలుస్తుంది." అని రఘు తనదారిని తాను వెళ్ళిపోయాడు.

పిడుగుపుమల్లే పడిన ఆ వార్తకి తట్టుకోలేక, ఉత్తర క్షణంలోనే పేపరు కొన్నాను. ఆతురతగా పేపరు తెరిచాను. పతాక శీర్షికలో ఆ వార్త కనబడింది. గబగబా చదివాను.

నిజం తెలిసింది.

సహాయ్ ఇక లేడు.

సహాయ్‌ని నేను ఎన్నడూ చూడలేదు. ఇక ముందె న్నడూ చూడబోను.

ఎందుకో ఆప్త మిత్రుడిని కోల్పోయిన ట్లనిపించింది.

దారిలో మెదడు చేసిన రూపకల్పన, నా హృదయానికి శాశ్వతంగా హత్తుకుపోయింది. అదే చివరకు నాకు మిగిలింది. అదే నా పెన్నిధి, అదే నా సర్వస్వం.

సహాయ్ అకాలమరణానికి మిత్రులెవ్వరూ, ఎన్నడూ, చింతించలేదు. నాకూ, ఎన్నడూ, చింతించవలసిన అవసరం కనబడలేదు.

మిత్రులం కులాసాగా, ఏదైనా పానీయం పుచ్చుకుంటున్నప్పుడు, సహాయ్ స్మృతి చిహ్నంగా ఒక ఖాళీ గ్లాసులో కొంత పానీయం పోసి టేబుల్‌పైన ఉంచుతాము – దాన్ని ఎవరమూ ముట్టుకోము. పానీయాలు పుచ్చుకోవడమైన తరువాత వేయిటర్ మా ఖాళీగ్లాసులతో పాటు ఆ గ్లాసుని కూడా తీసుకొని వెడుతాడు. అంతే.

ఈ తతంగం, మాకు ఒక ఆచారంగా వెలిసింది. అప్పటికి, ఇప్పటికీ, ఈ ఆచారాన్ని పాటిస్తానే ఉన్నాం.



# మా ప్రచురణలు

| | | | |
|---|---|---|---|
| 1. | రాజేంద్రప్రసాద్ ఆత్మకథ | 2 | 50 |
| 2. | ఉత్తర గోగ్రహణం | 2 | 00 |
| 3. | శ్రీకృష్ణరాయబారము | 1 | 50 |
| 4. | హిమబిందు (నవల)<br>శ్రీ అడివి బాపిరాజు | 2 | 50 |
| 5. | కావ్యతోరణము | 1 | 50 |
| 6. | ప్రహ్లాద చరిత్రము<br>సంకలనం : శ్రీ కాటూరి వేంకటేశ్వరరావు | 1 | 50 |
| 7. | ప్రతిజ్ఞాయౌగంధరాయణం,<br>స్వప్నవాసవదత్తము (నాటకములు)<br>అనువాదం : శ్రీ కాటూరి వేంకటేశ్వరరావు | 1 | 50 |
| 8. | గాంధీజీ విద్యార్థి జీవితము | 0 | 50 |

ప్రతులకు :—

**దక్షిణ భారత హిందీ ప్రచార సభ-ఆంధ్ర**

**హైదరాబాదు**

ఆంధ్ర హిందీ ప్రచార ప్రెస్, విజయవాడ-2.